




విరోధి సం.
మార్గశీర్షము

# భారతి

సంపుటము 26
సంచిక 12

# తెనుగునిరి

శ్రీ కొణిదెన బాలకృష్ణయ్య

శ్రీమంతులు ధీమంతులు - సామంతులు గలసి మెలసి సలుపు సపర్యన్
చేమంతుల నలరు రమా - సీమంతిని యనగ దెలుగుసీమ రహించున్.

పఱపు గల్గిన పచ్చ బయళ్ల గడుపార దినుచు దిర్గాడెడి ధేనుతతులు
చిఱుకాఱుమబ్బుల చెలువున మెఱుగాఱె మడువుల నీదెడి మాహిషములు
నడపెలిగొండలు నా రైతు లదలింప దున్నుచు జనుచుండు దుక్కిటెడ్లు
గొల్ల "ట్రుహూ" యంచు గొంకికఱ్ఱను వీవ, గుంపుగూడుచునుండు గొఱ్ఱెపిండు
పంటపైరులు ఫలపుష్ప పాదపములు - నెడతెగక పాఱు నేర్లు మహీధరములు
గలిగి కనువిందు గూర్చుచు గమలనిలయ - కాటపట్టనదగు నస్మదాంధ్రసీమ.

పెద్దకడవను కూడును బెఱుగు గలిపి - కడవయంచున బచ్చడి గార మునిచి
చేన బనిసేయువారి దోసిళ్ల బోయ - జనుచునున్నది సిరి యన దెనుగుతల్లి.

గొఱ్ఱు నాగలి పాపటం గుంటకయును - జడ్డిగము మేడి బండియు జర్ణకోల
గొట్టమున నెండకాలాన దిట్టపరచి - శ్రాంతిగొను భోగి మా తెల్గురైతు చాగి.

కొతిమెరిచేల బైకొని యల్లవీతెంచు కమ్మతెమ్మెరలపై గాంక్ష కలదా
కెంపుసొంపుల నింపు నింపు మెరపపండ్ల గనుపండువుగ గాంచగా దలంతో
నోరూరజేయుచు దోరగా గాచిన సెనగపాలాలపై జేర్తో మనసు
పొట్టలుబ్బెడి పాల పొత్తులు గల మొక్క జొన్నచేలను నిల్వ గన్నువైతొ
ముఱ్ఱుగాయల నిండి విఱ్ఱవీగిన కంది యలచంద పెసరల నంటజూతొ
పొరలు పెనుదోసపండ్ల సొంపును గనెదవో - మిలమిలని చెఱకుపాలను మించి నిండి
కుంటలనుగల తీనీరు గ్రోలవలతో - పాంథుడా ! రమ్ము ! రమ్మోయి ! బడలినాడ
వని పిలిచి పెట్టు నతిథుల కాంధ్రరైతు.

వచ్చెను రాష్ట్రిం బిక బార - పొచ్చెంబులు మాని తెలుగుప్రోడ లత్రిపియం
బచ్చువడ నొక్కటిగ బరు - లచ్చెరువందంగ వడయు డభ్యుదయంబుల్.



# కవిసింహముల కావ్యగర్జనము

శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు

సంస్కృత సారస్వతతారాపథమున విస్మృతి జలదచ్ఛన్నములైన కవిజ్యోతు లెన్నియో కలవు. సారస్వతగవేషణనిష్ణాతుల నిశితదృష్టి యప్పుడప్పు డీ విస్మృతి మేఘముల దొలగించుకొని యా జ్యోతుల నించుక పరికించి ప్రకాశింప జేయును. అట్టి జ్యోతులలో వంశీధరమిశ్రు డొకడు. ఈకవి గౌతమగోత్రజుడు, ఆంధ్రదేశస్థుడు. త్రిలిఙ్గదేశమున 'దేవర్షి' గ్రామమున వసించు నీతని మూలపురుషుడు 'జాపిజదీక్షితులు' క్రీ. శ. ౧౫౦౦ కు బూర్వమున గాజోలు, కాశీనగరమును జేరి యచ్చటనే స్థిరవాస మేర్పఱచుకొనెనట. ఈయనపౌత్త్రుడు 'విశ్వనాథదీక్షితులు.' విశ్వనాథదీక్షితుని పౌత్త్రులలో ద్వితీయుడు 'మాధవసూరి' 'అక్బరుచక్రవర్తి' (పాలనము: ౧౫౫౬-౧౬౦౫ క్రీ.) మన్ననల నందెనట. మాధవపండితునకు 'వంశీధరుడు, మురళీధరుడు, గిరిధరుడు' అను తనయులు ముగ్వురు. ఇందు వంశీధరుడు కవితల్లజుడై అక్బరుపౌత్త్రుడగు 'షాజహాన్' (పాలన: క్రీ. ౧౬౨౭-౫౮) చక్రవర్తియాస్థానము నలంకరించెను. ప్రచండకవికోవిదు డగు జగన్నాథపండితరాయలుకూడ నీయాస్థానముననే సమ్మానము నందుచుండెను. వంశీధరుని రెండవకుమారుడు నారాయణసూరి జగన్నాథపండితరాయల శిష్యు డగుటచే వంశీధరునికంటె పండితరాయ లించుక చిన్నవాడేమో యని తోచును.

పండితరాయ లనిన సార్వభౌముని కఖండగౌరవ ముండెడిది. జగన్నాథునకు జక్రవర్తి ప్రసాదించినదే 'పండితరాజ' బిరుదము. చక్రవర్తిని యగు 'ముంతాజ్ మహల్'కు వంశీధరు డన్న నమేయాదరము. తనకే బిరుదమును రాకపోవుటచేతనే కావలయు నీతనికి జగన్నాథునియెడ వైమనస్య మేర్పడెను. జగన్నాథు డప్రతిమప్రతిభాభాసురుడు; ఆనందవర్ధనుడు, మమ్మటులతో సమానస్కంధుడు. వీరు ముగ్వురును సంస్కృత సాహిత్యప్రపంచమున మహాశిఖరము లని యాంధ్రేతర విద్వాంసులును ముక్తకంఠమున గీర్తించిరి. శతగ్రంథనిర్మాత యగు నప్పయదీక్షితుల చిత్రమీమాంసను ఖండించియు, శబ్దశాస్త్రమును మథించిన భట్టోజిదీక్షితుల 'మనోరమ'పై 'కుచమర్దని' యను ఖండనమును రచించియు వాసిగాంచిన మహామహుడు పండితరాయలు. ఈయన రచించిన యన్యాపదేశశ్లోక మొకటి స్వోత్కర్షసూచకముగా నుండుటను గాంచి వంశీధరుడు తన యుత్కర్ష నుద్ఘాటించుచు దానికి బ్రతిగా నింకొకపద్యమును రచించెను. పండితరాయల పద్యము:

'దిగన్తే శ్రూయన్తే
మదమలినగణ్డాః కరటినః,
కరిణ్యః కారుణ్య
స్పద మసమశీలాః ఖలు మృగాః,
ఇదానీం లోకేస్మి
న్ననుపమశిఖానాం పునరయం,
నఖానాం పాణ్డిత్యం
ప్రకటయతి కస్మిన్ మృగపతిః?'

(భామినీవిలాసము. 1. ౧., రసగంగాధరము, ౫౩౬ పు., పద్యవేణి ౭౧౦ ప., పద్యామృతతరంగిణి ౨౦౦ ప., రసికజీవనము ౪౪౩ ప.)

—నేను విద్వత్కేసరిని. నాధాటి కాగలేక మత్తేభములు దిగంతములకు బారిపోయినవి. కరిణీబృందము పాపము నాకరుణకే కాని పరాక్రమమునకు బాత్రము గాదు. భీరువు లగు లేళ్లు నా విక్రమమునకసలే యాస్పదములు గావు. ఇక నెవరిపై నా ప్రజ్ఞాపరాక్రమమును జూపుదును? అని పైపద్యభావము.

బహుశః పైపద్యమును దనశిష్యు డగు నారాయణునిచే బండితరాయలు వంశీధరునకు బంపియుండును.

తనకుమారుడు తెచ్చిన పద్యమును జూచి వంశీధరు డీ క్రింది ప్రత్యాక్షేపపద్యమును రచించెను:

'దిఙ్నాగాః ప్రతిపేదిరే ప్రథమతో
జాత్యైవ జేతవ్యతాం,
సమ్భావ్య స్స్ఫుటవిక్రమోథ వృషభో
గౌరేవ గౌరిపతేః,
విక్రాన్తైర్నికషం కరోతు కతమం
నామ త్రిలోకీతలే,
కణ్ఠేకాలకుటుమ్బినీకరుణయా
సిక్తః స కణ్ఠీరవః'

(రసికజీవనము, ౪౪౪ ప., పద్యామృతత. ౨౦౧ ప.)

మహాదేవునకు (షాజహాన్ చక్రవర్తికి) ప్రేమపాత్రు డగుట జగన్నాథుడు నిజముగా వృషభతుల్యుడే. భవాని (చక్రవర్తిని) కి ప్రేమపాత్ర మగు నేనే సింహసదృశుడను గాని పండితరాయలు కాడు. (ఈశ్వరునకు ప్రేమపాత్ర మగు,వాహనము నంది! భవానీవాహనము సింహము) ఇక నాపరాక్రమాటోపమున కాగువారు ముల్లోకములను లేనేలే రనుభావము గల యన్యాపదేశ పద్యమును వంశీధరుడు రచించి వ్యంగ్యముగా జగన్నాథు నధిక్షేపించి, తన యీసును దీర్చుకొనె నట.

హరిభాస్కరుని 'పద్యామృతతరంగిణి' పై నాతనికుమారుడు జయరామపండితుడు నిర్మించిన 'సోపాన' మను వ్యాఖ్యలో నైపద్యమునకు వివృతి యిట్లున్నది:

'అథ ఏతస్యాన్యాపదేశస్య దిల్లీన్ద్రశాహాజహాన్మహిషాః సేవకో వంశీధర నామా కవి ర్యేనాన్యాపదేశేన పద్యేన ప్రత్యుత్తరమదాత్తదుపన్యస్యతి 'దిఙ్నాగా' ఇతి. యది వృషభే గౌరీపతిసమ్బన్ధేన విక్రమః సమ్భావ్యతే, తదా మయ్యపి కణ్ఠేకాల కుటుమ్బినీసమ్బన్ధేన న తుల్య ఏవ; పరన్తు వృషభే జాతికృతా విక్రమసమ్భావనా నైవ ప్రాదుర్భవేదితి ధ్వనయ న్నాహ కణ్ఠేకాల ఇత్యాదినా.'

కవితాసామ్రాజ్యమున మహారాజు డగు పండిత రాయల నధిక్షేపించిన వంశీధరు డెంతటి నిరంకుశుడో, వా డెంతటి ఖ్యాతి నందియుండెనో మన మూహింప వచ్చును. ఇట్టి కవిశేఖరుని గ్రంథములపేళ్లైనను దెలియకపోవుట శోచనీయము. ఈతని యీ క్రింది శ్లోక మొక్కటిమాత్రము సుభాషితకోశములయందు లభించినది :

వాసకసజ్జికావర్ణనము

'సాయం చాపగ్రథనసమయే
లగ్నయా కర్ణమూలే,
సఖ్యా మన్దస్మితమధురయా
సాదరం సూచ్యమానః,
కోయం ధన్యః కమలనయనే
యస్యచ్ఛాయాం పురస్తా
దఙ్గుల్యగ్రం నిజమపి ముహుః
సూచివిద్ధం నవేత్సి.'

[పద్యవేణి. *IV*. ౭౦. ('వంశీమిశ్రాణామ్'); రసికజీవనము. ౯౫౧ ప., సఖ్యాలంకరణము, ౨౫౦ ప., సుభాషితహారావళి. ౧౯౭౩ ప., సుభాషితసుధారత్నభాండాగారము. ౧౨౦. ౧౯ ప. సు. ర. భాండాగారము. ౨౭౮. ౧౯ ప.]

(సఖీనాయికల రహస్యసంభాషణమును ప్రచ్ఛన్నముగా వినిన ప్రియుడు నాయిక నడిగిన ప్రశ్నము:—కమలనయనా, సాయంకాలమున నీవు దండల గ్రుచ్చుచుండగా, మందహాససుందరయగు నీ చెలికత్తె నీ చెవిలో నతిరహస్యముగా నాదరముతో నెవనినిగూర్చి సూచించుచున్నదో,ఎవని సంగతినిగూర్చి పరవశవై వినుచు, కంటియెదుట నున్న నీ వ్రేళ్లకొనలకు మాటిమాటికి సూది గ్రుచ్చుకొనుచున్నను గుర్తింపనేలేకపోతివో యా ధన్యతము డెవడో యించుక తెలుపగలవా అని భావము.)

ఆంధ్రదేశీయుడై యుత్తరదేశమునకు వలస పోయిన మనవంశీధరుని వంశమునకు జెందిన సాహిత్యాచార్యభట్టమథురానాథుడు హిందీ సంస్కృతభాషలలో ప్రచండకవికోవిదుడై ప్రకృతము రాజపుత్రస్థానమున జయపురమహారాజాస్థానము నలంకరించి, బృహద్గ్రంథరచన మొనరించి విలసిల్లుచున్నాడు.

# శూద్రకుని పద్మప్రాభృతకము

శ్రీ పి. గణపతిశాస్త్రి

శూద్రకకవిమృచ్ఛకటికరూపకం చాలామంది చదివేఉంటారు. ఈమృచ్ఛకటికము తెనుగులోకికూడా అనూదితమైనది. ఈరూపకంవల్లనే శూద్రకుని నామం సంస్కృతవాఙ్మయంలో అజరామరమైనది.

శూద్రకుడు రచించిన పద్మప్రాభృతకము చాలామందికి తెలిసిఉండకపోవచ్చును. దీనిని ౧౯౨౨ లోనే సుప్రసిద్ధపరిశోధకులు మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించారు. ఇది వారు ప్రకటించిన మిగిలిన మూడు భాణాలతోను కలిసి 'చతుర్భాణీ' అనే పేరుతో ప్రకాశితమైనది.

'ప్రాభృతకము' అంటే కానుక. పద్మప్రాభృతకము అంటే పద్మమును కానుకనుగూర్చి రచించిన రూపకం అన్నమాట. ఇందులో కర్ణీపుత్రుడు నాయకుడు. దేవసేన నాయిక. దేవసేన వర్తకి. ఈమె దేవదత్త అను వర్తకి చెల్లెలు. కర్ణీసుతునికి దేవదత్త ప్రియురాలు. వసంతప్రాదుర్భావంలో కర్ణీసుతునికి దేవసేనపై అనురాగం ఉదయిస్తుంది. కర్ణీసుతుడు తన మిత్రుడైన శశలాంఛనుని దేవదత్తాగృహానికి పంపిస్తాడు. అయితే దేవదత్త ఇంతకుపూర్వమే తాను కర్ణీసుతదర్శనంకోసం బయలుదేరబోతున్నానని పరిచారకునిద్వారా కబురు పంపిస్తుంది. ఈఅదను కనిపెట్టి కర్ణీసుతుడు శశలాంఛనుని దేవసేనదగ్గరకు దౌత్యానికి పంపిస్తాడు. శశుడు మార్గంలో అనేకమంది మిత్రులతో సంభాషిస్తూ దేవసేన గృహం చేరుకుంటాడు. దారిలో అతడు కవులు, విద్వాంసులు, గణికలు శాక్యభిక్షుకీభిక్షుకులు మొదలైన వారితో ఆకాశసంభాషణం నడిపిస్తాడు. ఈసంభాషణలలో ఆకాలపు ఉజ్జయినీనగరనాగరికుల జీవితం స్పష్టంగా ప్రతిఫలిస్తుంది. దేవదత్త కర్ణీసుతుని ఇంటికి బయలుదేరేదాకా ఆలస్యంచేసే మిత్రవృకతో శశలాంఛనుడు ఈసంభాషణలు జరుపుతూన్నట్టు మనకు అవగతమవుతుంది దేవసేనాగృహం చేరుకున్నాక వారిద్దరికీ జరిగిన సంభాషణలో దేవసేన ఎట్టకేలకు తనకు కర్ణీసుతునియెడల గల అనురాగం వెల్లడిస్తుంది. శశలాంఛనుడు దేవసేనకు కర్ణీసుతుని అనురాగంకూడా తెలియజేస్తాడు. అనంతరం దేవసేనాకర్ణీసుతుల మధ్యసంకేత నిర్ణయంకూడా జరుగుతుంది. శశకుమారుడు తిరిగి కర్ణీసుతునిదగ్గరకు వెళ్ళిపోతూ, కర్ణీపుత్రుని విరహోపశమనార్థం ఉపాయనం ఏదైనా ఇవ్వవలసిందని అర్థిస్తాడు. ఆమె తాను హారంగా ధరించిన మాలికనుండి తామరపువ్వు ఒకటి కర్ణీసుతునికి కానుకగా పంపిస్తుంది. శశకుమారుడా కానుకను కర్ణీసుతుని కర్పించడానికై స్వీకరిస్తాడు. దీనితో ఈభాణం సమాప్తమవుతుంది.

ఈభాణంలో అంతటా కర్ణీసుతుని మిత్రుడు శశకుమారుడు ఒకడేపాత్ర. ఈతడు అందరితో 'ఏమంటున్నారు? అల్లాగా!' అని ఆకాశభాషితాలు చేస్తూంటాడు.

ఈభాణము సంస్కృతవాఙ్మయంలో చాలా ప్రాచీనమైనది. మానవల్లి రామకృష్ణకవిగారు ఈ శూద్రకుడు విక్రమశకంప్రారంభించి విక్రమాదిత్యబిరుదం వహించిన చక్రవర్తి అయిఉండవచ్చునని భావిస్తున్నారు. ఇతడు ఆంధ్రభృత్యవంశానికి చెందిన స్వాతిచక్రవర్తిఆస్థానంలో ఉండేవాడట. కొంతకాలానికి ఇతనికీ స్వాతికీ విరోధం ఏర్పడుతుంది. ఇతన్ని చంపివేయడానికి సంఘిలకుడనే శాక్యభిక్షువు నియోగింపబడ్డాడట. కాని ఈ శాక్యభిక్షువును శూద్రకుడు చంపివేస్తాడు. ఈసంఘిలకుని పేరు మన రూపకంలోకూడా కనబడుతున్నది. శూద్రకుని చరిత్రకూడా

చాలా ప్రఖ్యాతమైనదిగా కనబడుతున్నది. రామిల సోమిలులనే కవిద్వయం శూద్రకకథా అనే కావ్యంలో ఇతనిచరిత్ర వర్ణించారు.

ఈభాణంలో వచ్చే కథ చరిత్రప్రసిద్ధమైనదిగా కనబడుతున్నది. ఈరూపకంలో వచ్చే పాత్రలనుగురించి, ఈ ప్రేమోదంతాన్నిగురించి, దండి తన అవంతిసుందరీకథలోను, బాణుడు కాదంబరిలోను సూచించారు. ఈ నాటకనాయకుడు కర్ణీసుతునికే మూలదేవుడనే మరిఒక నామధేయంకూడా ఉన్నది. ఇతని మిత్రుడు శశలాంఛనుడు, ఇతని ప్రియురాండ్రు దేవదత్తా దేవసేనలు కేవలము కవికల్పితపాత్రలు కావు. వీరినిగూర్చి సంస్కృతవాఙ్మయంలో అక్కడక్కడ ప్రస్తావనలు కనిపిస్తున్నవి. ఈ కర్ణీసుతుడు చౌర్యాన్నిగురించి ఒక శాస్త్రగ్రంథం రచించినట్లు కనిపిస్తున్నది. అయితే మన కీగ్రంథం లభించలేదుకాని, ఈకర్ణీసుతునిగురించి సంస్కృతవాఙ్మయంలో అక్కడక్కడ ప్రస్తావనలు కనిపిస్తున్నాయి.

శూద్రకుని కాలనిర్ణయం సుకర మైనది కాదు. ఇతడురామకృష్ణకవిగారన్నట్లువిక్రమశకంప్రారంభించినవాడయితే క్రీస్తుపూర్వం ఒకటవశతాబ్దంలోనివాడయి యుండవచ్చును. ఇతని కాలం ఎంతక్రిందికి జరిపినా ఇతడు కాళిదాసుకంటె ప్రాచీనుడనడంలో సందేహం ఉండదు. ఈరూపకంలో కుముద్వతి అనే ప్రకరణాన్నిగూర్చిన ప్రస్తావన ఉన్నది. ఈకుముద్వతీప్రకరణం శూద్రకకృతమై ఉండవచ్చునని మానవల్లి రామకృష్ణకవిగారి అభిప్రాయము.

ఆకాలంలో ఉజ్జయినిలోని సాంఘికాచారాలు గ్రహించడానికి ఈరూపకం చాలా ఉపయోగపడుతుంది. ఈ రూపకంలో శాక్యభిక్షుకినిగురించి ఒకచోట, భిక్షుకునిగురించి ఒకచోట వర్ణన కనిపిస్తుంది. వారిందులో అవినీతిమార్గపరులైనట్లు చిత్రింపబడినది. అయినా ఈకవికి బుద్ధశాసనంమీద గౌరవం ఉన్నట్లు ఈక్రిందివాక్యాలనుబట్టి గ్రహింపవచ్చును. "ఆహా! ఈబుద్ధశాసన మెంత చెడ్డది! ఇట్టిదుర్మార్గుల మూలమున పాడైపోయినను ఇదినిత్యమును పూజింపబడుచు నేయున్నది గదా! అయిననేమి! కాకి ఎంగిలి చేసినంతమాత్రమున పుణ్యతీర్థమాహాత్మ్యము పోవునా!

ఈరూపకంలో వ్యావహారికభాషావాదానికి బీజాలుకూడా కనిపిస్తున్నాయి. శశలాంఛనుడు దేవసేనాగృహానికి వెళ్లేదారిలో 'దత్తకలశి' అనే వ్యాకరణపండితుని కలుసుకుంటాడు. ఈ 'దత్తకలశి' తాను కాతంత్రవ్యాకరణానుయాయులతో వివదిస్తున్నట్లు సూచిస్తాడు. ఈ దత్తకలశి శశలాంఛనునితో మాట్లాడేటప్పుడు పణుగుల్లాంటి కఠినపదాలు దొర్లిస్తూ సంభాషిస్తాడు. ఈవ్యాకరణపండితునికి వేశ్యాప్రసక్తి కూడా ఉన్నది. వీరిద్దరికి జరిగిన సంభాషణలో ఒకప్పుడు ఆవేశ్య దత్తకలశిదగ్గరకు వచ్చినట్లు, దత్తకలశి ఆమెను కఠినమైన వ్యాకరణక్లిష్టప్రయోగాలతో వేధించినట్లు తెలుస్తుంది. శశలాంఛనుడు దత్తకలశితో నీ కామప్రహారనిష్ఠురములగు వాగ్వజ్రములతో నన్ను చంపివేయకుము! వ్యావహారికభాషలో తిన్నగా మాట్లాడుము!" [సాధు వ్యావహారికయా వాచా వద!"] అంటాడు.

అపిమ్మటశశికుమారుడు కుముద్వతి అనే యువతిని దర్శిస్తాడు. ఈమె చంద్రోదయుడనే మార్యరాజకుమారుని ప్రియురాలు. అతడు సామంతరాజులను జయించడానికి వెళ్లడంచేత ఈమె విరహిణీవేషం ధరించి ఉంటుంది. ఇది వేశ్యవాటికావిరుద్ధమని శశికుమారు డంటాడు. ఈకుముద్వతి త్వరలోనే రాజమహిషీగౌరవం పొందవలెననీ, ఈమె పరిహాసయోగ్యకాదనీ శశలాంఛను డనుకుంటాడు. ఈకుముద్వతి వలభిగవాక్షంపై వాలిన వాయసాన్ని ఉద్దేశించి, "చంద్రోదయుడు దండయాత్రలు ముగించుకొని త్వరలో రాగలడా?" అని ప్రశ్నిస్తుంది. ఆశ్లోకం ఇది:

"భద్రం తే! వలభిగవాక్షతిలక
    శ్రాద్ధోపహారాతిథే!
జీవన్త్యం మయి కచ్చి దేష్యతి సమే
    నిత్యప్రవాసీ ప్రియః,
యద్యాగచ్ఛతి గచ్ఛ! తావ దితర
    ద్వారాశ్రితం తోరణం

నిశ్శోకాహి సమేత్య మే ప్రియతమం
దాస్యామి దత్తోదకమ్.

ఇలాగే శశిలాంఛనుడు దేవసేనాగృహమార్గంలో ఆ సేవకులను కలుసుకుంటాడు. ఈ దేవసేన 'కుముద్వతి' అనే ప్రకరణంలో వేషం వెయ్యబోతున్నట్లు కుముద్వతిచెలికత్తె ప్రియవదనిక చెబుతుంది. చివరికి శశికుమారుడు దేవసేనను 'పద్మప్రాభృతకం' ఇవ్వవలసిందని అర్థిస్తాడు. ఆశ్లోకం ఇది:

"ఈషల్లీలాభిదష్టం
స్తనతటమృదితం పత్రలేఖానువిద్ధం
స్విన్నం నిశ్వాసవాతై
ర్మ్లానతరరసక్లిష్టకింజల్కకర్ణమ్
ప్రాతర్నిర్మాల్యభూతం
సురతసముదయప్రాభృతం ప్రేషయాస్మై
పద్మం పద్మావదాతే!
కరతలయుగళభ్రామణక్లిష్టనాళమ్"

ఆమె ఆపద్మం కర్ణీపుత్రునికి కానుకగా ఇచ్చిన తరవాత శశిలాంఛను డామెను ఆశీర్వదిస్తాడు. ఈ ఆశీర్వచనశ్లోకంతో ఈభాణం సమాప్తమవుతుంది.

ఈ ఆశీర్వచనశ్లోకంతప్ప ఈ భాణంలో మిగిలిన సంస్కృతరూపకాలలో కనబడే భరతవాక్యం కనబడడం లేదు. బహుశః వరరుచి రచించిన ఉభయాభిసారిక విడిచివేస్తే ఇది మనకు లభించిన భాణాలలో అతిప్రాచీనమైనదని పరిగణించవచ్చును.

సాహిత్యదృష్ట్యా పరిశీలిస్తే పద్మప్రాభృతకము సంస్కృతవాఙ్మయంలో కాళిదాసుని మేఘదూతంతో సమానమైనది. శూద్రకుని శృంగారహాస్యప్రసక్తి చాల సున్నితమైనది. అయితే కాళిదాసమహాకవిది భావనాసుందరమైన కవితాప్రపంచము. శూద్రకునిది కేవలము వాస్తవికప్రపంచము. వాస్తవికప్రపంచములో కవితాసౌందర్యం అన్వేషించగల దిట్ట శూద్రకుడు. ఈవిషయం ఈకవులిద్దరూ సృజించిన శకుంతలావసంతసేనాపాత్రలలోనే స్పష్టంగా భాసిస్తుంది. మేఘదూతంలో విరహవిధురుడైన యక్షుడు ప్రియురాలికి మేఘదౌత్యం పంపించాడు. పద్మప్రాభృతకంలో చౌర్యశాస్త్రకారుడైన కర్ణీపుత్రుడు దేవసేనకు మిత్రుని సందేశం పంపిస్తాడు. మేఘదూతంలో మేఘుడు యక్షుని ప్రియురాలికి సందేశం చెప్పిన విషయం భావనాగమ్యమే. పద్మప్రాభృతకంలో దేవసేన ఇచ్చిన పద్మప్రాభృతకం స్వయంగా శశిలాంఛనుడు తన మిత్రునికి అందిస్తాడు.

బహుశః శూద్రకకవి ఈ భాణం తన యౌవనప్రాదుర్భావంలో రచించిఉండవచ్చును. అయితే అతని సునిశితమైన వాస్తవదృష్టికి ఇందులోనే బీజాలు కన్పిస్తున్నవి. శూద్రకుని సంస్కృతకవితాస్వభావం తెలుసుకోవాలంటే పద్మప్రాభృతకం పఠించవలసిందే. వసంతవతిదుహిత వనరాజిక అనేయువతి వసంతపుష్పాలంకృతయై కామదేవార్చనకోసం ఆలయంవైపు నడిచిపోతూంటుంది. ఆమెను మార్గంలో దర్శించిన శశిలాంఛను డామెతో "వనరాజికా! నీశరీరానికి వసంతోదయం అయిన"దని ఛలోక్తిగా అంటాడు. ఆ అభిప్రాయం గల శ్లోకాన్ని బట్టి శూద్రకకవికవితాచాతుర్యం శృంగగ్రాహికగా గ్రహించవచ్చును.

"వాసంతీకుందమిశ్రైః
కురవకకుసుమైః పూరితః కేశహస్తో
లగ్నాశోకశ్శిఖాంతః
స్తనతటరచితస్సిందువారోపహారః
ప్రత్యగ్రైశ్చూతపుష్పైః
ప్రచలకిసలయైః కల్పితః కేశపూరః
పుష్పవల్లగ్రాగ్రహస్తే!
వహసి సువదనే! మూర్తిమంతం వసంతమ్."

# నాదేశ్వరి

•

శ్రీ రాయసం శేషగిరిరావు

ఆ మందాకినిచెంత నందనవనంబం దాలతాచ్ఛాయ, వీ
ణామాధుర్యరసానుసేకమృదుతానామ్లానగాంధర్వవి
ద్యామూర్ధన్య కళాప్రపూర్ణవు, పరార్థంబైన యాలాపనా
సామర్థ్యం బొకకొంత మాకు వినిపించఁ రాదె నాదేశ్వరీ!

ప్రాణవాయువు బట్టి బంధించి శ్రుతిగూర్చు పూనిక యోగశాస్త్రానుభవము
అవరోహణారోహణానేకగమకంబులందున శబ్దశాస్త్రానుభవము
స్రోదేకముఖవికాసోచ్చారణాదిలక్షణముల భరతశాస్త్రానుభవము
సముదాత్తకంపితసప్తస్వరంబులదూనిక మంత్రశాస్త్రానుభవము
గీతికాలాపగతి నరమూతకనుల-నిస్తులసమాధియోగనిర్నిద్రశక్తి
కలిగినంగాని వేరైన కలుగబోదు - నిర్మలానందవిద్య సంగీతవిద్య.

తలిరుటాకులతోడ దలయూచు లేకొమ్మ మురిపెంపుముదమున మొగ్గదొడుగు
చనుపీడకుండ వెంటనెబడు లే దూడనలరించి తల్లిపాత్తిలికి బాపు
'కా'వను పాత్తిలికసిగందు జోకొట్టి బుడిచేతు లాడించు బొమ్మ చేయు
తోక ద్రొక్కిన రేగు ధూర్తాహి నాడించు పడగవిప్పుల నృత్యవైభవమున
తన్మయానందమున దము దామె మరచి-కన్నులుండియు బయటిలోకంబు గనని
లలితశాంభవీముద్ర శ్రోతల కొసంగు-నిర్మలానందవిద్య సంగీతవిద్య.

నాదస్పందనమే ప్రపంచము బహిర్నాదంబు లోనాదముం
వేదాంతాధ్యయనంబుచే గని బుధుల్ విశ్వంబు సర్వంబు నీ
నాదబ్రహ్మమయం బటంచనిరి, యీనాదంబునే సప్తధా
భేదింపంగ స్వరంబులయ్యె ప్రణవంబే యిట్లనేకాకృతిం.

నాదోపాసనకై సమస్తమృగముల్ నానావిహంగంబు లే
దేదో శబ్దములం ధ్వనించి శృతియందే లీనమైపోవు వృ
షాదుల్ సాధనచేయు నొక్క-ధ్వని సట్లయ్యుం గృతార్థంబు గా
లే దాసాధన రెండు శబ్దములు వేర్వేరౌచు శబ్దించుటం.

---

# భట్టపాదుడు

శ్రీ కె. అన్నమరాజశర్మ

సూర్యభగవానుడు కషాయశోభలెనయ - గ్రుంకులిడుచుండె నపరాబ్ధికూలమందు,
నీలయమునాతరంగిణి నిగ్గు లొలసి - శోణవతిగాఁగ దోచె విస్ఫురణరుచుల!

యమునదరి స్గదంబవిపినాంతరమం దొక బాడబుండు నే
త్రముల ననంత బాష్పముల రాల్చుచు, శిష్యులతోడ "నింతకుం
గ్రమవరచర్య నాపదికి గన్పడదేవిధినే? దుషాగ్ని జీ
వముల ద్యజించుచుండె గురువంచనకుం బరిహార మూర్వరన్.

జైనులచెంత శాస్త్రముల జక్కఁగ నేర్చితి, జైనధర్మమున్
మానుగ నభ్యసించితి, గుమారునిమారుగ జ్ఞానభిక్షమున్
దానముజేసినట్టి గురుతన్ గురితింపక వాద మూని, ప్ర
జ్ఞానిధిగాఁగ పేరుగొనినాఁడ, గృతఘ్నతమై యహంకృతిన్.

ఎన్ని బుధాభినందనల నెంతగ నందిన నేమి? ధర్మమున్
దన్ని, కృతఘ్నతాజ్వలితతాపముపాపము గట్టికొంటి, నే
నన్నివిధాల దండనకు నర్హుఁడ, గర్హ్యము నాదుజీవితం
బెన్నితరాలకైనను, సహింతురె భారతభావికోవిదుల్?

కాన, తుషాగ్ని దేహమును గాల్చుటయే యనుతాపశాంతిగా
మానిజనోక్తసాధుతరమార్గము, నా కనుగమ్య మిప్పుడే
పూని చరింతునం" చనుడు; మూగిన ఛాత్రగణమ్ము లార్తిమై
పూనిరి తద్వ్రతాచరణముం బొనరించెడి కార్యసాధనల్.

ఆత్రివేణీవిశుద్ధపుణ్యస్థలాన, - పండితాఖండలుం డార్యమండనుండు,
భరతపుత్రావతంసుండు, భట్టపాదు - డగ్నితప్తుండు గాఁజొచ్చె, నంతలోన.

నగము కాలియు కాలని సమయమందు - బ్రహ్మవర్చస్వి, కావివస్త్రములవాడు
బాలసన్న్యాసి యొకడు తీవ్రమున వచ్చి - నిలిచి, నయమున బల్కె నంజలి ఘటించి.

“పండితవర్య ! నీకయి ప్రపంచగవేషణముం బొనర్చి యిం
దుండగ వచ్చినాడ, నయనోత్సవ మయ్యెను; పండితాళి ను
ద్దండవచఃప్రసంగముల దైవగురూత్తముఁడొండె సాటిగా
నిండె భవద్యశమ్ము ధరణిన్, గరుణింపుము వాదభిక్షుకున్.”

అని నుతియించినంత, మృదులార్ద్రకృపాఫణితిన్ వచించె “ని
న్గన భవదీయనామ మెఱుగన్ దపియించెడి నాదుచిత్త మో
కనదరవిందనేత్ర !” యనగా దరహాసము మోసులెత్త “నన్
జనపదవాసులెల్లరును శంకరు డంచు వచింతు రర్మిలిన్.”

శంకరుని పేరు శ్రవణగోచరము గాగ - భట్టపాదు డానందమ్ము బట్టలేక
“తర్క-సంగ్రామమున నీకు దగిన జోడు - కలడు, మండనమిశ్రునికడకు జనుము.

ఈనిమేషాననో - కాక, యింక నొక్క - క్షణమునకొ, నాకు మరణ మాసన్నమగును,
తీరని యభీష్ట మెట్లు సిద్ధింపగలదు ?” - అనగ శంకరు డేగె మ్లానాస్యు డగుచు.

కటకట ! భట్టపాదతనుకాండము పూర్తి దహించి భస్మము
త్కటముగ ప్రోవుగాగ, జనకాండము లెంతయు క్రందనధ్వనిన్
జటులవిషాదబాష్పముల జార్చిరి; సూర్యకుమారి నేటికిం
గటకటపెట్టుతత్కథల గానముసల్పు రహోనిశీథులన్.

---

# రెండు చాటూక్తులు

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి

సంస్కృతసారస్వతములో చాటుశ్లోకము లోకభాగము. కావ్యరచన మారంభమైనది మొదలుగా నవియు నుదయించుచునే వచ్చినవి. అందు వినుటకు చదువుటకు నింపుపుట్టించు చిత్రవిచిత్రములు, సరసములైన వివిధవర్ణనము లెన్నేని కలవు. విజ్ఞానము, నీతిధైర్యోత్సాహములు, భక్తిజ్ఞానవైరాగ్యములు కలిగించునవి కొన్నివే లుండు ననుటయు నతిశయోక్తి కాదు. అంతే కాదు, ఆయావ్యక్తులకు సంబంధించిన పరస్పరస్పర్ధలు, ఈర్ష్యాసూయలు, జిగీషనిందశాపములు, పక్షపాతము మొదలగువానితోడి వర్ణనలు కూడ నందున్నవి. ఇదంతా పాఠకలోకమునకు తెలియనిది గాదు. అట్టివానిలో భవభూతికిని, మురారికిని సంబంధించిన రెండు చాటుశ్లోకముల నిం దించుక పరామర్శింతము. అవి యివి:—

"మురారిపదచింతాయాం భవభూతేస్తు కా కథా,
భవభూతిం పరిత్యజ్య మురారి మురరీకురు"

"భవభూతి మనాదృత్య నిర్వాణమతినా మయా,
మురారిపదచింతాయా మిద మాధీయతే మనః"

హరిహరభేదము మాటుపెట్టుకొని మురారికవిని పైకెత్తుటకును, భవభూతికవిని క్రిందికి దింపుటకు ననర్ఘరాఘవనాటకాభిమానియైన యొకానొక పండితు డీ శ్లోకము లల్లె ననుట విదితము. ఈ శ్లోకములు ముందు పుట్టెనో, లేక జనశ్రుతియే ముందు పుట్టెనో నిర్ణయింపజాలముగాని, "భవభూతి మహావీరచరిత్రనాటకమందలి జిగీషచే మురారి యనర్ఘరాఘవము నిర్మించె" నన్న కింవదంతికూడ విద్వల్లోకమున గలదు. వీటి పౌర్వాపర్యముమాట యెటున్నను—

"ఊహించి తెలియరాకుండ నూరవ రాజా
శ్రమ గళాపూర్ణోదయము రచించె"

అని యెవడో యొక మహానుభావు డన్న మాటను బట్టి కళాపూర్ణోదయము దాదాపు మూడువందల సంవత్సరము లణగి పోయినట్లే పై చాటుశ్లోకములయందలి నిరసనభావము వ్యాపించుటనుబట్టి తన వ్యాప్తి తగ్గిపోవుటచే మహావీరచరిత్రము కొన్నివందల యేండ్లణగిపోవుటయు, తుదకందలి రెండున్నరయంకముల గ్రంథము నష్టమగుటయు సంభవించియుండునని భావించుట యసమంజసము కానేరదు. మఱియు, కవులనేకాని తత్కృతులను పేర్కొనక పోయినా, ఈ నిరసన మొక్క మహావీరచరితము ననర్ఘరాఘవముతో పోల్చి చేసినదిగాని, తక్కిన భవభూతినాటకములను పోల్చి చేసినది కాదని పాఠకులకు స్పష్టము కాకపోదు. అప్పటి కుదయించిన పూర్వరామాయణకథానాటకములలో నా రెండును వ్యాప్తిగాంచియుండుటయే యందుకు కారణము. అట్లుగాక భవభూతినాటకములు మూడింటిని స్మరించియే యా నిందకు డట్లు నిరసించియుండు నని యెవరేని భావింతురా, అయితే యా దూషకుడు దృశ్యకావ్యోచితి నిసుమంతయేని యెఱుగనివా డని చెప్పవలసి వచ్చును. సకలసామాజికహృదయములను

కరగించునదియై విశ్వజనీనవిఖ్యాతిగన్న యుత్తరరామచరిత మెక్కడ? కేవలపాండిత్యప్రకర్షప్రకటనార్థమైన యనర్ఘరాఘవ మెక్కడ?

భవభూతివలెనే మురారియు సకల శాస్త్రజ్ఞుడు, సాహిత్యనిధి, విద్వత్కవి. కాని, దృశ్యకావ్యరచనమునందు పేరెన్నికగన్న భాసకాళిదాసాదు లైదాఱుగురిలో నెంచదగిన నెవ్వరైన భవభూతిని గణింతురుగాని మురారిని గణింపరు. అట్లని యితనికి విద్వల్లోకమున ఖ్యాతి లేకపోలేదు. ఆ ఖ్యాతియంతయు నితని వైదుష్యమునకు, నపూర్వశబ్దప్రయోగమునకు నెక్కువగా సంబంధించిన దని యిప్పటికి కనవచ్చిన రెండుమూడు స్తుతివచనములే చెప్పుచున్నవి.

"మురారిపదచిన్తా చే త్తదా మాఘే మతిం కురు,
మురారిపదచిన్తా చే త్తదా మాఽఘే మతిం కురు"
"దేవీం వాచ ముపాసతే హి బహవ స్సారం తు సారస్వతం
జానీతే నితరా మసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః"

ఇవియైనా, మాఘునివలె నితడు పదప్రయోగమందు నిపుణు డనియు, సాహిత్యపారంగతు డనియు ప్రకటించుచున్నవిగాని యితని కవిత్వసంపదను ప్రశంసించుట లేదు. ఈ రెండు మాటలయినా చాటువులుగాని, వస్తుపాత్రరసౌచిత్యముతోడి భవభూతికవితా చాతుర్యము నెలుగెత్తి స్తుతించిన రాజశేఖర గోవర్ధనాదుల ప్రశంసావచనము లెన్నో! లెక్కలేదు. కావున పైని మురారిపక్షపాతి కావించిన నిరసనము మహావీరచరిత్రను గూర్చియే కాని యితరములనుగూర్చి కాదని నిశ్చయింతము. ఇక నది యెట్టిదో చూతము.

భవభూతికంటె మురారి సుమారు రొక శతాబ్ది పరుడు. ఇతని నాటికి రామకథను పెక్కండ్రు పాఠ్య దృశ్యకావ్యములుగా నిర్మించిన ట్లితని మాటలే యిట్లు చెప్పుచున్నది:

"యది క్షుణ్ణం పూర్వై రితి జహతి రామస్య చరితం,
గుణై రేతావద్భి ర్జగతి పున రన్యో జయతి కః"

అందలి దృశ్యములలో భాసుని ప్రతిమాభిషేకములు కథను పంచుకొన్నవి, మిశ్రనృత్తములు నైనవి. తరువాత సంతరించినవిగాని, యశోవర్మ రామాభ్యుదయమును, మాయురాజు నుదాత్తరాఘవము నితని నాటికి సజీవములు. మహావీరచరిత విద్వల్లోకవ్యాప్తము. ఉదాత్తరాఘవమును చూచి యనర్ఘరాఘవమైన యితని కావ్యము కొన్ని కథారంగముల మహావీరచరిత ననుకరించిన దని పాఠకులకు తెలియకపోదు. అందుచే వెనుక వ్రాసిన ట్లితనికి దానిపై ఈర్ష్య గల దన్న కింవదంతి వట్టిది కా దనియు, ఆ ఈర్ష్యయే యల్లనల్ల నెగబ్రాకి పై చాటూక్తిరూపమున బరిణమించిన దనియు మన మూహింపవచ్చును. పై రెండు చాటూక్తులు తప్ప మఱియొకడు కావించిన మహావీరచరిత నిరసనము మఱెందును కానరాదు. ఏమయిన నేమి? మహావీరచరితముకన్న ననర్ఘరాఘవము దేశమంతట పఠనపాఠనవ్యవహారమున మిక్కిలి యెక్కువగా వ్యాపించిన దని మాత్ర మిపుడు మన మంగీకరింపకతప్పదు. పై నిందకుడు చేసిన మహావీరచరితనిరసన మెంతమాత్రమును సముచితము కా దనక తప్పదు.

"లోకో భిన్నరుచిః" అన్న ట్లొక్కొకరి కవిత్వ మొక్కొకరి కాదరపాత్రము కావచ్చునుగాని పోల్చిచూచి యొకరిని నుతించి యింకొకరిని నిందించుటమాత్రము సహృదయ సమ్మతము కాజాలదుకదా!!

# సుగుణ

[పెద్దకథ]

శ్రీ బలివాడ కాంతారావు

(గతసంచిక తరువాయి)

౫

ఆదివారం. ముందురోజు ఆఫీసునుంచి కొన్ని ఫైళ్లు పని చేసుకోవా లని యింటికి తెచ్చినా నాకు చెయ్యాలని లేదు. సుగుణఆత్మకథ పూర్తిగా వినేద్దామన్న వుబలాటంతో కాఫీ త్రాగాక 'కథ పూర్తికానీ' అన్నాను. సుగుణ వంటయింటివేపు చెయ్యి చూపించింది.

'నే నేమీ అనుకోను. యీవేళకు భోజనం లేకపోతే చచ్చిపోం'

'మీ రెప్పుడూ యేదో అనుకుంటారనో, మెచ్చుకుంటారనో యే పనీ చెయ్యను. నాలో నాకు సంతృప్తి లేనిది ఎదుటివాళ్ల నెలా సంతృప్తిపరుస్తాను' అంటూ టేబిల్ మీది ఫైళ్లకట్ట చూపించి, అక్కడనుంచి వెళ్లిపోయింది. గత్యంతరం లేక ఫైళ్లకట్ట విప్పాను.

యీ కథేదో వినేద్దామని చకచకా పని చేశాను. నా పని పూర్తయేసరికి భోజనం తయారు. భోంచేశాక మాటాడే శక్తి లేకపోయింది గాని వినాలనే కుతూహలం పోలేదు. సుగుణ పడుకోవా లని ప్రయత్నిస్తోంది. అంచేత బలవంతపెట్టలేదు.

ఎండ బాగా చల్లారలేదు. తిరిగి వేగంగా వచ్చి వంటచెయ్యొచ్చని సుగుణను సముద్రపొడ్డుకు తీసుక పోయాను. చెదురుచెదురుగా మనుషు లున్నారు. గాలి హెచ్చుగా వీయటంవలన యిసుక రేగిరి మీద పడుతోంది. మా కథ నడవలేదు. నాలుగుముక్కలతోనే ఆగిపోతోంది. నేను వెనుకకు తిరిగి చూశాను. కొద్ది ఆవల యిసుకదిబ్బమీద చిన్న సరుగుడుతోట కనిపించింది. ఆ చిన్న చెట్లు గాలికి ఆడుతున్నా యిసుక రేగరటం కనిపించలేదు. ఇద్దరం లేచి తోటకు వుత్తర వేపున యిసుకదిబ్బపై కూర్చున్నాం. దక్షిణదిశనుంచి వీచే గాలి తోటలో చొచ్చుకొని సంగీతస్వరంతో మమ్మల్ని తాకిపోతోంది. మా మనసులు వుల్లాసంతో నిండిపోవటంమూలాన కొంతసేపటివరకు ఆ పూనే చెట్ల వేపు చూశాం.

'ఎంతవరకు విన్నారు ?'

'నిన్నొకరోజున యిక్కడే కూర్చుంటే వాడు వచ్చి యేదో వాగాడన్నావ్'

'ఆయనవుద్దేశం కనుక్కోవా లనుకున్నా. ఆయనే అడక్కుండా తేలిపోయాడుగా—నే రమ్మన లేదు. నన్ను చూసి వచ్చాడు. కూర్చోమంటే కూర్చున్నాడు. చివరికి మాటలు కలిపి యిలా తేలిపోయాడు. అంత వేగంగా బయటపడతా డని నే ననుకోలేదు. మా తమ్ముడు కెరటాలదగ్గరకి పరుగెత్తుతుంటే వాడిని తీసుక వచ్చి దగ్గర కూర్చోపెట్టాక, ఏం చూసి నన్ను ప్రేమించా రన్నాను.

'నాలాంటివాడిని మీరు ప్రేమిస్తా రని అనుకోలేదు.'

# సుగుణ

[పెద్దకథ]

శ్రీ బలివాడ కాంతారావు

(గతసంచిక తరువాయి)

౫

ఆదివారం. ముందురోజు ఆఫీసునుంచి కొన్ని ఫైళ్లు పని చేసుకోవా లని యింటికి తెచ్చినా నాకు చెయ్యా లని లేదు. సుగుణఆత్మకథ పూర్తిగా వినేద్దామన్న ఉబలాటంతో కాఫీ త్రాగాక 'కథ పూర్తికానీ' అన్నాను. సుగుణ వంటయింటివేపు చెయ్యి చూపించింది.

'నే నేమీ అనుకోను. యీవేళకు భోజనం లేకపోతే చచ్చిపోం'

'మీ రెప్పుడూ యేదో అనుకుంటారనో, మెచ్చుకుంటారనో యే పనీ చెయ్యను. నాలో నాకు సంతృప్తి లేనిది ఎదుటివాళ్ల నెలా సంతృప్తిపరుస్తాను' అంటూ టేబిల్‌మీది ఫైళ్లకట్ట చూపించి, అక్కడనుంచి వెళ్లిపోయింది. గత్యంతరం లేక ఫైళ్లకట్ట విప్పాను.

యీ కథేదో వినేద్దామని చకచకా పని చేశాను. నా పని పూర్తయేసరికి భోజనం తయారు. భోంచేశాక మాటాడే శక్తి లేకపోయింది గాని వినాలనే కుతూహలం పోలేదు. సుగుణ పడుకోవా లని ప్రయత్నిస్తోంది. అంచేత బలవంతపెట్టలేదు.

ఎండ బాగా చల్లారలేదు. తిరిగి వేగంగా వచ్చి వంటచెయ్యొచ్చని సుగుణను సముద్రపొడ్డుకు తీసుక పోయాను. చెదురు చెదురుగా మనుషు లున్నారు. గాలి హెచ్చుగా వీయటంవలన యిసుక రొగిరి మీద పడుతోంది. మా కథ నడవలేదు. నాలుగుముక్కలలోనే ఆగిపోతోంది. నేను వెనుకకు తిరిగి చూశాను. కొద్ది ఆవల యిసుకదిబ్బమీద చిన్న సరుగుడుతోట కనిపించింది. ఆ చిన్న చెట్లు గాలికి ఆడుతున్నా యిసుక రొగరటం కనిపించలేదు. ఇద్దరం లేచి తోటకు ఉత్తర వేపున యిసుకదిబ్బపై కూర్చున్నాం. దక్షిణదిశనుంచి వీచే గాలి తోటలో చొచ్చుకొని సంగీతస్వరంతో మమ్మల్ని తాకిపోతోంది. మా మనసులు ఉల్లాసంతో నిండిపోవటంవలన కొంతసేపటివరకు ఆ వూగే చెట్ల వేపు చూశాం.

'ఎంతవరకు విన్నారు?'

'నీ వ్వొకరోజున యిక్కడే కూర్చుంటే వాడు వచ్చి యేదో వాగాడన్నావ్'

'ఆయనవుద్దేశం కనుక్కోవా లనుకున్నా. ఆయనే అడక్కుండా తేలిపోయాడుగా—నే రమ్మన లేదు. నన్ను చూసి వచ్చాడు. కూర్చోమంటే కూర్చున్నాడు. చివరికి మాటలు కలిపి యిలా తేలిపోయాడు. అంత వేగంగా బయటపడతా డని నే ననుకోలేదు. మా తమ్ముడు కెరటాలదగ్గరకి పరుగెత్తుతుంటే వాడిని తీసుక వచ్చి దగ్గర కూర్చోపెట్టాక, ఏం చూసి నన్ను ప్రేమించా రన్నాను.

'నాలాంటివాడిని మీరు ప్రేమిస్తా రని అనుకోలేదు.'

'నేను ప్రేమించా నని మీరు ప్రేమించారన్న మాట. నేను ప్రేమించా నని మీ కెలా తెలుసు కున్నారు?'

యీ ప్రశ్నకు ఆయన జవాబీయక నా వేపు చూసి మళ్లీ తలదించాడు.

'దయచేసి వెళ్లిపోండి. యీ మాటలు యిక్కడ అడితే వేరే అర్థం యివ్వవచ్చు. రేపు కాలేజీలో అడితే సంతోషంగా స్వీకరిస్తాను'

ఆయన లేవలేదు. కాని ముఖం ముడుచు కున్నాడు. నేను 'వస్తా' నని లేచివెళ్లిపోయా నింటికి.

ఆ రెండోరోజు కాలేజీలో బోటనీక్లాసులో ఒక్కర్తినే ముందుగా వెళ్లి కూర్చున్నా. నాతరువాత చంద్రశేఖరరావు వచ్చి కూర్చున్నాడు. నేనే మాటలు మొదలుపెట్టాను. జవాబు లివ్వటానికి సిగ్గుపడు తున్నాడు. ఆయననోట్సు సరిగా లేవంటే నా పుస్తకం అందిస్తుండగా యీయన దయచేశారు. నా వేపు యెర్రగాచూసి అక్కడ కూర్చున్నాడు. నేను వ వ్యాపులో లేకపోయాను.

'శేఖరం! నేను ప్రేమించానని నన్ను ఆయన ప్రేమించారు. నే నెంత అదృష్టవంతురాల్ని' నేను నవ్వుతున్నా నేగాని వాళ్ళిద్దరి సంగతి చెప్పలేను. శేఖరం అలా చూస్తావేం? యీయన చాలా ధీమాగా ఉన్నారే!

'శేఖరం! నీకు తెలీదూ నిన్నుకూడా ప్రేమి స్తున్నా నని?'

బూట్లచప్పుడు. అంతా ఒక్కసారి ముంచు కొచ్చారు. కొంతసేపటివరకు పుస్తకం విప్పి అక్షరాల వేపు చూడలేదు.

మసక పూరుకుంది. నేను ఊకొట్టుతున్నా. ఆమె పరుసుడుచెట్లవేపు చూస్తూ 'మీ కింకా విషాలని ఉందా' అని ప్రశ్నించింది.

'హాఁ! కానీ' అన్నాను.

'అసలు నాకు చెప్పాలని లేదు, ఇలాంటి విషయాలు చెప్పుకోవటంవలన యేం లాభం లేదు. ఉన్మాదులు మన మెదడికి పనికివచ్చే దేమీ యివ్వరు.

'నా దృష్టిలో నా దేమీ ఉన్మాది కాదు. నా వుద్దేశా లిలాంటి వని మొదట చెప్పకుండా అలా సంచరిస్తే యెవరుమాత్రం పిచ్చియెక్కరు?'

'నా వేపు మీ వుద్దేశాలు చెప్పే చూశారా? మీ రంటే నే నెందు కలా అయ్యాను?'

'అనుభవంలేని కుర్రాడ్ని వున్మాది అనటం బాగా లేదు'

'అయితే వినండి. ఆరోజు సాయంత్రంకూడా వచ్చాడు. అట్టే మాటాడలేదు. రెండోరోజు వచ్చాడు. కూర్చో మన్నాను, కూర్చున్నాడు.

'మీకు పెళ్లయిందా?' అని అడిగాను.

కాలే దన్నట్లు తల వూపాడు.

'అయితే పెళ్లి చేసుకోబోతున్నారా?'

'ఏమో?'

'మీగురించి మీరే మాట్లాడుకో లేనప్పుడు నా గురించి ఎలా మాట్లాడగలరు?' అన్నాను.

దీనికి జబాబు లేదు.

'నా ప్రశ్నలకి జవా బివ్వరు. మీమీద మీకే విశ్వాసం లేదు. మీ బలహీనత నాదగ్గరే చూపిస్తు న్నారు. మీ రన్న దేమిటి? నన్ను ప్రేమించా నన్నారు. పెళ్లాంగానా? అదేదో సరిగ్గా చెప్పండి'

దీనికి జబాబు లేదుగాని ఔ నన్నట్లు ఆ ముఖం చెప్పింది.

'నన్ను పెళ్లాం చేసుకోవా లని వుంది. సరే! నే నెలా ఆకర్షింపబడ్డాను?'

'నాకు ప్రేమంటే తెలియని పేదరికంలో మీరే భిక్ష పెట్టా' రన్నాడు.

'భిక్ష యేరూపంలో పెట్టాను?'

'ఇం కేరూపం. ప్రేమరూపం. మీ పుస్తకం యిచ్చి. మీచే గౌరవింపబడ్డ మనిషి చింకిబట్టలతో ఛీ—'

'అంచేతనా, ఆ గులాంబట్టలు కట్టారు. ఎక్కడి నుంచి తెచ్చారా అరువు ?'

'అరువు కాదు. స్వంతం. దగ్గర ఉన్న నాలుగు డబ్బులు ఖర్చు పెట్టి'

'సరి మిమ్మల్ని కాలేజీలో పుస్తకం యిచ్చి పెళ్లాంలా ప్రేమించలేదు. శేఖరాన్ని, మిగతా వాళ్ళని యెలా ప్రేమించానో మిమ్మల్నీ అలానే. అంత కంటే మీమీద కాస్త హెచ్చు జాలి చూపించాను. మీ రా బట్టలు కట్టాక అదికూడ అవసరం లేక పోయింది.'

కాస్సేపు నావేపు వికారంగా చూచాడు. ముఖం పక్కకు తిప్పాడు. నేను మళ్లీ అన్నాను. 'నా సంగతి నేను చెప్పుకోగలను. నేను కాలేజీలో యీ పరీక్షలతరవాత వుండను. ఎందుకంటే అది నాదిలా లేదు. తరవాత పెళ్లి చేసుకుంటాను. మా అమ్మ నన్నెలా పెంచిందో నేనుకూడ నా పిల్లలని అలా పెంచుతాను.'

ఆయన యిటూ అటూ చూశాడు. ఆ మార్పు నా కేమీ బాసలేదు.

'అయితే మీ వుద్దేశం?' అన్నాడు చటుక్కున.

'పెళ్లి చేసుకోవటం' అన్నాను.

'ఎవరిని ?'

'నే పెంచుకున్నవాణ్ని.'

ఆయనగొంతుకదగ్గర గలగలలు నన్ను చిరాకెత్తించాయ్.

'అయితే నన్ను ?'

'యీ ప్రశ్న తరవాతే మీకు యెంతమాత్రం పెళ్లాడా లని లేదు. నేనూ మామూలుమనిషినే. అయినా మీ రీనాడు అన్న మాటలు యెప్పుడూ వింటానని అనుకోలేదు. యీ చివరి ప్రశ్న రావటానికి మీ కెంత కోపం వచ్చింది. దీనినిబట్టి మీకు పెళ్లాడితే యెంత లాభమో తెలుసు. అయ్యే చెట్టుసంగతి ఆకులే చెప్పాయి. యిక దయచెయ్యండి.'

గభ్భున లేచిపోయి రొప్పుకుంటూ వెళ్లిపోయాడు. నా మన సెలా వుంటేదో—మా చిన్నతమ్ముడు కళ్లలో యిసుక పోసుకొని యేడుస్తుంటే వాడిని ఓదార్చ టంతో సరిపోయింది.

ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరం చదివి నే నేమీ కాలేదు. మళ్ళా యింకొక ఉత్తరం వచ్చింది. అదిమాత్రం మొదటిదానిలా చింపలేదు. రెండుసార్లు చదివి తిరిగి వ్రాసినవాడికే పంపేశాను. అప్పుడే ఆ మాసినగుడ్డలతో కనిపించా డన్నాను. మా అన్నయ్యలా పీడూ వున్మాదని వూరుకున్నాను.'

ఎందుకో నాకు ఆయనపై జాలి వేయటంవలన 'సుగుణా' అన్నాను.

'వాడు ఉన్మాది కాడనేనా మీ అభిప్రాయం! మీ రొకప్పుడు అలాంటి ఉన్మాదులైతేగాని వాళ్లమీద సానుభూతి చూపింపలేరు!'

నే నేమీ మాటాడలేకపోయాను.

'మొదటి ఉత్తరం చూశాక ఒక కత్తి పట్టుకొని ఆయనదగ్గరకు వెళ్లి, నరుకుతానన్నావ్, కత్తి కోసం యెందుకు వెతుక్కుంటావ్! ఇదిగో నేనే తెచ్చాను - చంపు! అన్నాను.

నాకు తెలుసు ఉన్మాదులు ఎప్పుడూ ఏ కార్యాన్నీ సాధించలేరు. వుద్రేకమైన కబుర్లతో అమాయకుల్ని రెచ్చగొట్టి మంటల్లో మాడ్చేస్తారు. వారి ప్రాణం వాళ్లకు తీపే. నా ఆలోచన నాకే అసందర్భంగా తోచింది.

రెండో ఉత్తరం. ఇదీ ప్రేమ అనుకొని ప్రేమించిన మనిషి వ్రాసినట్టే వుంది. అది ప్రేమ కాదు, ఏం కాదు - మనసులో వున్న వికారాన్ని అలా వెళ్ళగ్రక్కటం. యీ మనసే, యీ శరీరమే నల్లగా మాడిన ముఖంతో యెదురుపడితే తుప్పున వూస్తారిలాంటి వాళ్లు. సరే! యిలాంటివాళ్ల విషయం మనం చెప్పుకోఖ్ఖర్లేదు. లేవండి పోదాం!' అని సుగుణే లేచిపోయింది. నేనూ లేచాను. మేం యింటికి చేరుకునేటప్పటికి వీధిదీపా లింకా వెలగలేదు.

౬

'పంచభూతాలే మన శరీరం. మనిషి చావగానే మళ్లీ వాటిని చేరుకుంటాడు' అన్నాను ఆమె ప్రశ్నకి జవాబుగా.

సుగుణ మాటాడలేదు. ఆకాశం వేపు ఆమె దృష్టి వుంది. నేనుకూడ పైకి చూశాను. తారకలు కన్ను గీటుతున్నాయ్. కుర్చీమీదినుంచి లేచింది సుగుణ. నే నలా వాలుకుర్చీమీద కూర్చునే వున్నాను.

'మనది తత్త్వజ్ఞుల దేశం. అయినా మనలా కష్టాలకు జడిసేవాళ్లు, చావుకు యేడ్చేవాళ్లు ప్రపంచంలో యింకెవ్వరూ లేరు' అంది ఎదురుగా కనిపించే సత్యన్నారాయణస్వామికోవెలవేపు చూస్తూ.

నేను కుర్చీమీదినుంచి లేచాను. డాబాకు ఒక చివరను పిట్టగోడకు చేయి ఆన్చి నిలుచున్నాను. సుగుణ మెల్లగా పైకి చూస్తుంటూ నాదగ్గరగా వస్తోంది. మనసులను హాయిగొల్పే గాలి వీస్తోంది.

'మన ప్రత్యేకత అదే' అన్నాను నేను.

'ఏది?' అంది సుగుణ నావేపు చూడకుండానే.

'మన యింటినిండా సంపదే. మనం అనుభవించం. పొరుగువాళ్లకిస్తాం. మనదేశం తత్త్వజ్ఞుల దేశమే. ఆ తత్త్వం పొరుగుదేశంలో పనికివచ్చింది.'

హాహా అంటూ ఒక్కసారిగా సుగుణ నవ్వింది.

'ఏం సుగుణా' అన్నాను దిగజారిన స్వరంతో.

'సరే! నిద్రపోతారా? లేక యింకా ఆ పాతగొప్పతో తెల్లవారేవరకూ గెంతులు వేస్తారా? కళ్లకు కనిపించింది చూడండి. మీకు పుణ్యం వుంటుంది.'

'సుగుణా! విశదీసి చెప్పు' అనటంకంటే యింకేమీ చేయలేకపోయాను.

'మనలో ప్రత్యేకత యేమీ లేదు గర్వించటానికి. బ్రతికున్నది మీరుగాని మీ తాతముత్తాతలు కారు. మీ ముత్తాతలు యింత గొప్ప పని చేశారని మీరు గొంత టంవలన మీ కేం గొప్ప లేదు. మరింత సిగ్గుచేటు. వారు చేసిన గొప్పని మీరు చెయ్యటానికి కృషి చెయ్యండి. అప్పుడే ఆ సాధకబాధకాలు కళ్లతో చూస్తారు.'

మారుమాటాడక అక్కడినుంచి నడిచి పరుపుమీద వ్రాలిపోయి బలవంతంగా కళ్లు మూసుకున్నాను. కొంతసేపటికి నిద్రపోయాను.

సుగుణ నన్ను ఎప్పుడూ తనకుతానై అలా నిశిరాత్రప్పుడు మేల్కొలపలేదు. నా కాశ్చర్యం వేసింది. దగ్గరగా వున్న ఆమెను ఎంతోసేపు చూడలేదు. గప్పున లేచాను.

మళ్ళీ ఎందుకు ఆగిపోయానో చెప్పలేను. బహుశః ఆమెను అర్థంచేసుకోటానికి నా బుద్ధి చాలదని ఆగిపోయివుండవచ్చు. నా గొంతుకలో మాటలు దొర్లుకపోతున్నాయ్ గాని ఒకటీ పైకి రాదు.

'నీ వెందుకు చదువుకున్నా' వని ప్రశ్నించింది అలా తల దించుకొనే.

'నేను వూహించి తప్పు చెప్పేకంటే నీవే నిజం చెప్తే మంచిదేమో' అన్నాను.

'యీ రెండు రోజులలో అన్ని ప్రశ్నలెందుకు వేశారు?'

'నిన్ను చూసి బాగా తెలుసుకుందామనే వేశాను.'

'నేను చిన్నగా నడవకుండా యింకొకర్ని చిన్నగా నడవమని చెప్పటంలో అర్థం లేదు. తెలివి తక్కువదాన్ని' అంటూ లేచి ఆమె పరుపుమీదకు పోయి చారబడింది. నే నింకా అలా కూర్చున్నాను. ఆ ప్రవర్తన చూస్తుంటే యేం పాలుపోలేదు. అయినా నా మనసు ఆమెను సంబాళించాలని వుబలాటపడింది.

నేను లేచి ఆమెదగ్గరగా వెళ్లాను. 'సుగుణా' అన్నా నెంతో ఆప్యాయంగా. 'నీ వెవరినీ తిట్టలేదు. నీ మాటలు నేనుతప్ప యింకెవరు విన్నారు? నిజానికి నీ వ్యాఖ్యమాటలతో నీ వన్నాకర్షించావ్. నీలా మాట్లాడే

స్త్రీని యీ సీమలో చూడలేను సుగుణా' అన్నాను.

'నిజం. చాలా బాగే మనిషిని చూడలేరు. నా యీ బాగుకు మీ మనసులో నైనా యెన్నాళ్ళుండి పోతుంది ?'

ఆమె అర్ధనిమీలిత నేత్రాలవేపు అలా చూస్తూనే వున్నాను. 'నేను నాకోసమే చదువుకున్నా. నా భర్త నీతులు తెలిసి పోయితే— నా పిల్లలు పాడవకుండా స్వతంత్రపరు లని చెప్పుకోతగ్గట్టుగా చెయ్యా లని చదువుకున్నా. ఇంతమాత్రం నే సాధించగలిగితే యీ దేశంలో ఆడజన్మ యెత్తినందుకు దేశసేవ చేశా నని మురిసిపోతాను'

ఊరుకోని నా చెవి నేనే మెలివేసుకోవటం కష్ట మనిపించింది. నేను ఆమెవూహలో పాడుమని షిగా వుండటం నాకు సహించరానిదిగా తోచింది.

'సుగుణా' అన్నాను.

'ఏమండీ' అంది.

'నేను కళ్లతో చూడటం నేర్చుకుంటున్నాను. మంచిమనిషి నెలా గౌతానో చెప్పు'

యీ మాటలు అడాక నాలో నాకే ఆశ్చర్యం వేసింది. నేను పాడుమనిషిని కా నవబోయి యిలా అన్నాను. మాటలు గొంతువరకు వచ్చేసరికి మనసు మార్పు యిలా చేసింది.

నా సమాధానంతో ఆమె యెంతో మహదా నందమూ తృప్తీ అనుభవిస్తోం దని గుర్తించాను.

గాలి వీస్తోంది. వెన్నెల కాస్తోంది. యివన్నీ నాకోసమే అని వీటిని స్తుతించఖ్ఖర్లేదు. వాటిపని అవి చేసుకపోతుంటే నా కాలం యిలా తగలెయ్యటంలో అర్థం లేదు. అయినా మానవస్వభావం బాగున్న వాళ్లనే పొగడుతాం. చెడ్డవాడిని చూసి అసహ్యించు కుంటాం. వా డిలా బాగుపడతా డని ఆలోచించం. డబ్బున్నవాడు దానం చెయ్యగానే వేనోళ్ల పొగ డుతాం. ఆ డబ్బు యెందరు పేదవాళ్లని పిండితే వచ్చిందో— ఆ పేదవాళ్ల సంగతే మరచిపోతాం. నా సుగుణను నేను స్తుతించఖ్ఖర్లేదు. అయినా ఆమెను పొగడకుండా వుండలేకపోతున్నా, నేను మామూలు మనిషినికాబట్టి.

సుగుణ నన్ను పొగడుతున్నట్టే వుంటుంది; పొగడదు. తిట్టినట్టే వుంటుంది; తిట్టదు. ఆమె స్థాయిలో నే పడటానికి నాలో మొదటి లోటు ఆలోచించగా ఒక్కటే అని అనుకున్నాను. నాకు మెద డున్న దని నే ననుకోకపోవటమే.

ఆమె లేచి కుర్చీమీద కూర్చుంది. నే నామె పరుపుమీద వాలాను.

'మీకు నిద్దర రావటంలేదా ?' అని ప్రశ్నించింది నా వేపు చూడకుండానే.

'లేదు' అన్నాను.

'సరే! చెప్పండి' అంది.

'ఏమి'టన్నాను.

'ఏం చెప్పదలచినారో అది'

'నే నేం చెప్పదలచుకో లేదు'

'సరే, నే నెప్పుడూ యీ వేళలా వుండాలని లేదు. మీ విషయా లేమైనా చెప్పగలరా ?'

నేను జవా బీయలేకపోయాను.

'మీ మాటలు నాకు వెర్రెత్తించవు. విరక్తి పుట్టించవు. మీ మంచిమనసుకు మరింత సంతోషిస్తాను'

యీ మాటలతో నాకు చెప్పా లనిపించింది. 'సుగుణా! నా సంగతి యెప్పుడూ చెప్పకూడ దను కున్నాను. కాని యిప్పుడు చెప్తున్నాను. యెంచేతంటే నిన్ను యీ రెండురోజులలో అర్థంచేసుకోబోయి నేను మనిషి నని తెలుసుకున్నాను.'

నేను కాస్సేపు ఆగాను. నా జీవితం నా కళ్ల ఎదట వుంది.

'నాకు బాగా జ్ఞాపకం వుంది. వేసవి సెలవులకి రంగారాయపురం వెళ్లాను. ఆసంవత్సరమే కోటూ బూటూ వేసుకొని వెళ్లటం. సికందుఫారందర్గా

అవంతాను. యింటికి వెళ్లాక ఎంతసేపో కూర్చో లేదు. వూరంతా తిరుగుతున్నాను. నా వెనకాల మా బాచిగాడు, గణపతి, రామయ్య, వీళ్లంతా కట్టు కథలతో, ఒక టేమిటి, బడిపంతులుదగ్గరనుంచి వాకిట పందులవరకూ వుదంతాలు చెప్తున్నారు.

'కిష్టిగా, నీకు తెలీదుగాని జీడితోటలో తాటి చెట్టుకి కాయ లున్నాయ్. కోయకుండా నీకోసమే వుంచాం. పదండీ పదండీ అండీ' అని ఒక్కటే పరుగు.

బాచిగాడు చెట్టెక్కి మోపుమీద కూర్చొని గెలలు నరుకుతున్నాడు. నన్ను కొంచెందూరంలో కూర్చోబెట్టి చెదిరిన కాయలు కూడబెట్టున్నారు మిగతావాళ్లు. నేను చెట్టువేపు చూస్తున్నాను.

వీళ్లంతా ఒక్కసారి 'సుందూ భాయ్, సుందూ భాయ్' అని గంతులేస్తున్నారు. చప్పట్లు కొట్టు న్నారు. చెట్టుమీద నున్న బాచిగాడుకూడాను. చుట్టూ చూశాను. నా వెనకాలే వున్న మా మామిడి తోటనుంచి సావిత్రి పరుగెత్తి నావేపే రావటం చూశాను. సావిత్రివెనకాలే మామిడికొమ్మ పట్టుకొని గబగబ ఒక ఆడమనిషి, కోపంగా నడవటం చూశాను. సావిత్రి గబ్బున వచ్చి నా చేతిలో మామిడికాయ పెట్టి నాదగ్గర కూర్చుండిపోయింది. వీళ్లింకా సుందూ భాయ్ అనటం మానలేదు. ఆ సుందు చూస్తుంటే నాకూ అనబుద్ధివేసింది. 'ఏం సావిత్రీ' అనే బదులు 'ఏం సుందూభాయ్' అన్నాను. అలసిపోతున్న ఏడేళ్ల సావిత్రికళ్లలో నీరు తిరగటం చూశాను.

తోటకాపుపెళ్లాం సావిత్రిని కొట్టా లన్నంత కోపంతో వచ్చింది. కాని నన్ను చూడగానే 'అబ్బాయిగోరు ఎప్పు డొచ్చా' రంది. 'యీ వేళే' అన్నాను. 'నూడు బాబూ, యీ గుంటపాప రాలిన మామిడికాయ దొంగలాడి, నాదీ అంటాది.'

'తప్పు కాదా' అన్నట్లు నేను సావిత్రివేపు చూశాను.

'అబద్ధం ఆడుతుంది కిష్టీ. మా అమ్మ యిస్తే నీ కీయడానికి పరుగెత్తుకొని వస్తే'

'ఛీ! కా యెవరు తింటారు?' అని విసిరేశా నా కాయని. మా గణపతిగాడు తీసుకొని పిల్లి కొరుకు కొరికి అక్కడున్నవాళ్లకి పంచిపెట్టున్నాడు. సావిత్రి వెక్కివెక్కి ఏడుస్తోంది.

బాచిగాడు చెట్టు దిగాడు. కొమ్మలతాలుకు కరుకులు రాపాడాయేమో శరీరంమీద అక్కడక్కడ రక్తం చిమ్ముతోంది. సావిత్రికూడ చూసింది. రక్తం చిమ్మినదగ్గర వుమ్మంటిస్తూనే 'సుందూభాయ్ సుందూ భాయ్' అని వెక్కిరిస్తున్నాడు.

సావిత్రి ఆ ధూళిలోనే కాళ్లూ చేతులు కొట్టు కుంటూ యేడుస్తోంది. నేను తాటిముంజలు తింటూ, వూరుకో సుందూభాయ్ అనైనా అనలేదు.

'చెప్పవేమిటి?' అంటూ బాచిగాడివేపు యెర్రగా చూసి హఠాత్తుగా లేచి పరుగెత్తింది. నాకు భయం వేసింది. యీ రక్తంగురించి మా నాన్నతో చెప్పిందంటే యింతా నేను చెయ్యించానని నాన్న నన్ను కొట్తారు. సావిత్రిని వెంబడించాను. ఇన్నాళ్లలా చిన్న జట వుంటే గబ్బున పట్టుకొనేవాణ్ని.

'కిష్టీ! కొట్టకు. చెప్పను, చెప్పను' అంటూ గడ్డి నేలమీద కూర్చుండిపోయి రెండు చేతులూ నెత్తిన పెట్టుకొని భయంతో వణికిపోతోంది. నిజంగా అప్పుడు నాకు కనికరం వేసింది. ఆ సుందుమీద చెయ్యి వేశాను. గట్టిగా యేడుస్తోంది. లేవదీసి 'ఎందు కేడుస్తున్నా' వన్నాను.

'పేలు పట్టాయని నాన్న గుండు చెయ్యించా' రని ఏడుస్తూ చెప్పగానే ఆదేమిటో ఆ వయసులో మరీ జాలివేసింది. ఇలాగైనా బుజ్జగిద్దామని కామోసు 'యిం కెప్పుడూ కాయ విసరనులే' అన్నాను.

'అమ్మ మళ్లీ యిస్తుందా?' కళ్లింతవి చేసు కొని, యివ్వ దన్నట్లుగా నావేపు చూసింది.

'సుందూభాయి వూరూరు' అంటూ చేతిలో తాటికాయ పట్టుకొనివచ్చిన మా బాచిగాడు వెక్కి రించటం మొదలుపెట్టాడు. నాకు కోపంవచ్చి బాచి గాడికి ఒక్క లెంపకాయ కొట్టి వెళ్లిపోయాను.

సావిత్రి ఎటు వెళ్లిందో నేను చూడలేదు.

'సుగుణా ! వింటున్నావా ?' అని ప్రశ్నించాను.

'ఊఁ, చెప్పండి' అంది. సుగుణ ఏ ప్రశ్నలూ వేయకపోవటంవల్ల నా మనసు ఒకే త్రోవలో పోతోంది.

'చిన్ననాటి చిలిపిచేష్టలెన్నో వున్నయ్. తెలియక చేసిన తప్పులు చెప్పుకోదగ్గవి కావు కూడాను. నేనిది ఎందుకు చెప్తానంటే—ఆవేళ ఆ చిన్న సంఘటన మా యిద్దరి జీవితాలనూ చిత్రించింది !

౨

నేను స్కూలుఫైనలు చదువుతున్న రోజులవి. చదువుమీద నాకు శ్రద్ధ కొంచెమైనా లేదు. దిగువ క్లాసుల్లో రెండేసేళ్లచొప్పున కూర్చున్నాను. క్లాసులో పైకి కనపడని పెంకితనం చేసేవాడిని. బడికి సాధారణంగా వెళ్లటంమాత్రం మానలేదు. ఎంచేతంటే క్లాసులో వున్న అమ్మాయిలమీద దృష్టి పోయేది.

ఇంటినుంచి కావలసిన డబ్బు. బట్టలు రోజుకొక జతె మార్చేవాడిని. వాసననూనెలూ, సెంట్లూ—ఏమిటో అదొక గర్వం అప్పుడు—ఇప్పుడదొక వెర్రిలా కనిపిస్తోంది.

ఏదైనా శృంగారమైన పుస్తకం దొరికిందంటే బడికి వెళ్లటం మాని చదువుకొనకూర్చొనేవాణ్ని. ఏ తారాశశాంకంలోని పద్యాలో కంఠస్థంచేసి పాడుకోవటం అదొక సరదా. గదినిండా సినీమా తారలు—ఆ బొమ్మలకేసి దీక్షగా గంటలకొద్దీ చూస్తూ కూర్చోవటం.

ఆ అమ్మాయి కిటికీనుంచి చూసి కిలకిల నవ్వింది. వాళ్లిద్దరూ వెన్నెల్లో హాయిగా మనిషీమనిషీ రాసుకొని విహరించారు. ఉద్యానవనంలో మల్లెపొద చాటున ముద్దులుపెట్టుకున్నారు. మిసమిసలాడే ముగ్ధ పమిట జారింది—అబ్బా !—యీ కథలు, యీ నవలలు, యీ సినీమాలు నా పద్ధాలుగేళ్ల దగ్గరనుంచీ నా మెదడుకి ఎక్కించిన విషయాలు.

నా పద్ధెనిమిదోయేటనుంచీ నాలో నేనే ఏదో పిచ్చిగా మాట్లాడుకొనేవాడిని. ఏ బొమ్మనో పట్టుకొని నవ్వుకుంటూ కళ్లదగ్గర పెట్టుకొనేవాణ్ని. మంచిరాత్రప్పుడు కిటికీగుండా వెన్నెల నా ముఖంమీద పడితే చాలు అలా ఏడ్చుకుంటూవేవాడిని. నా తలలో ఎప్పుడూ ఏ సినీమాలోని ఘట్టమో, ఏ నవలలోని ఆడదో తిరిగి నన్ను వెర్రెత్తించేది.

ఒకనాడు రెండు కళ్లు నా కళ్లల్లోనికి ఎంతో తియ్యగా చూశా యనుకున్నాను. ఆ వెంటనే వెళ్లాను. ఒక మేడలోనికి పోయి తలుపు చారవేసింది. అలా అక్కడే ఒక ఎలెక్ట్రిక్ స్తంభానికి చారబడి చాలాసేపు నిలుచుండిపోయాను.. ఆ మరుచటిరోజు స్కూలుకు పోకుండా ఆ రోడ్డువెంబడి ఎన్నోసార్లు తిరిగా నా కళ్లకోసం. కాని కనిపించందే...

ఇలాంటి వెన్నో వెర్రిపనులు చేశాను. అలాంటివి జ్ఞాపకానికివస్తే సిగ్గుతో కూడుకపోతాను.

శెలవు లిచ్చారు. రంగారాయపురంఅంటే నాకు రెండేళ్లనుంచీ అసహ్యం వేస్తోంది. యీయేడు మరీని. చిన్నక్లాసుల్లో వున్నప్పుడు ఆ వూ రెప్పుడు వెళ్తాను, అమ్మనీ, నాన్ననీ, సావిత్రినీ వాళ్లందరినీ యెప్పుడు చూస్తానని పించేది. ఆ తోటల్లో హాయిగా ఆడుకోవచ్చు. మా తెల్లావుపాలు తాగొచ్చు. అమ్మ దగ్గర పడుకోవచ్చు...

ఇవన్నీ లేవిప్పుడు. శృంగారం, సౌందర్యం మీదే నా దృష్టి.

'యీ వుత్తరం చూడగానే రాకపోతే నేనే వస్తా'నని నాన్న వ్రాయటంచేత రంగారాయపురం వెళ్లక విధిలేకపోయింది.

ఇదివరకులా నా మనసు సావిత్రికోసం అంతో తనపడలేదు. కాని మనసులో ఒకసారి చూడాలనే కోరిక లేకపోలేదు. బాచిగాడూ, గణపతీ పెళ్లిళ్లు చేసుకొని పెళ్లాలతో కాపరంచేస్తున్నారు. వాళ్లు వచ్చి పలకరిస్తే జవాబు చెప్పటానికి చిన్నతన మనిపించింది.

సావిత్రితల్లి, సావిత్రితండ్రి మేష్టారు వచ్చి పలకరించారు. ఏడో క్లాసువరకూ ఆయనదగ్గర చదువుకున్న రోజులు—ఎన్నిసార్లు కోదండం యెక్కాను? అవేవీ నాకు జ్ఞాపకం లేవు. చాలా ప్రాధేయపడుతూ మాట్లాడాడు. నా మాటలే కరువయ్యాయ్.

ఇంట్లో వున్నానేగాని నా మనసు పట్నంలో పార్కుల్లోను—వేసంకాలంగా! చాలామంది ఆడవాళ్లు వస్తారని—క్లాసులోని అమ్మాయిలమీదా! ఏదో వంక పెట్టి తిరిగి వెళిపోదామని వుబలాటపడ్డాను.

సాయంత్రం ఒక్కడినే అలా చెరువుగట్టువేపు వెళ్లాను. వేసంకాలం అయినా పెద్ద చెరువు కాబట్టి వున్న నీరు తేటగానే వుంది. మా పెద్దరైతుపెళ్లాం పలకరించింది. కాస్సేపు మాటాడి ముందుకు సాగాను. సావిత్రి కనిపించింది. నాకు తెలియకుండానే ఆగిపోయాను. యీ కొద్దినెలలలో సావిత్రిలో వచ్చిన మార్పు—అంత అందంగా ఉంటుందని అనుకోలేదు. నా తలలో గుండూగాయి, చిన్న పరికిణీతో వున్న సావిత్రే వుండేది. ఆ చీరకట్టు, ఆ నడక—పాదాలకున్న పట్టీలు—అలా ఎంతసేపైనా చూడాలనిపించింది. నా వేపు ఒకసారి చూసి గబగబ నడవటం మొదలుపెట్టింది. పాపం! బిందెలో నీరు ఒలికి ఆమె చీర తడుపుతోంది. సావిత్రి కనుపించేవరకూ చూస్తూనే వున్నాను.

ఆ నిముషం దగ్గరనుంచి నాకు అవూర్లో వుండాలనిపిస్తోంది. సావిత్రికళ్లల్లో యిదివరకు చూసిన కళ్లల్లో తళుకంటే హెచ్చు కనిపించింది. సావిత్రి నడకలో సొగసుంది.

చెరువురెండోవేపు వెళ్లి ఒక మడిగట్టుమీద కూర్చున్నాను. బీటలువారిన భూమివేపు చూస్తున్నాగాని నా మనసు సావిత్రిమీదే వుంది. అంతఅందంగా వున్న సావిత్రి, నా దెందుకు కాకూడ దనిపించింది. ఇదివరకటిలా యిప్పుడు నా సావిత్రి అనుకోడానికి సాహసించలేకపోయాను.

నేను చీకటిపడకుండానే యింటికి వెళ్లేసరికి సావిత్రి మా యింటోనే వుంది. నాగురించే మాట్లాడుకోవడం విని విస్తుపోయాను. సాహసం చేసుకొని నక్కివున్నవాడిని గప్పున పెరటికి వెళ్లి 'ఏం సావిత్రీ' అని పలకరించాను. సావిత్రికి యీ బ్రహ్మాండమైన సిగ్గు యెక్కడనుంచి వచ్చిందో-గబగబ వెళిపోతోంది, తల వంచుకొని. అమ్మ వంటయింటినుంచే అంది-'ఆదేమిటే సావిత్రీ! కిష్టీ కిష్టీ అని పలవరించేదానివి. వాడొస్తే వెళిపోతున్నావేం?' వినిపించుకోనట్టే వెళిపోతుంటే గబగబ వెళ్లి అలవాటుకొద్దీ జడ పట్టుకోబోయి చెయ్యి పట్టుకున్నాను.

'ఉండు కిష్టీ' అంటూ చెయ్యి విదిలించుకొని వెళిపోయింది.

అమ్మ వచ్చి నాదగ్గరగా నిలబడినట్టు కొంతసేపటికిగాని తెలుసుకోలేకపోయాను.

'పెళ్లి అని అనుకున్నాక మరీ సిగ్గు హెచ్చిపోయిందిరా బాబూ' అంది.

'ఎవరికమ్మా? సావిత్రికే?' అన్నాను నా చెవులనే నమ్మలేక.

'అవునురా. సంబంధం స్థిరమైంది. డబ్బు సర్దుకోలేక, మేష్టరుగారు వచ్చేయేటికంటున్నారు.'

'మంచిదే' అని అక్కడ వుండలేదు.

ఆ మరుక్షణంనుంచి నా కా వూర్లో వుండాలని లేదు. ఆ మరుచటిరోజు ప్రొద్దున్న చెరువుగట్టుమీద చేతిలో టూత్ బ్రష్‌తో కూర్చున్నాను. సావిత్రి ఒక్కర్తే రాలేదు. ఇంకో ఆవిడతో కలిసివచ్చింది. సావిత్రి వేపు నాకు చూడాలని లేదు. యీ కొత్తమనిషి యెవరో చాలా బాగుం దనిపించింది. ఆమెవేపు చూస్తున్నాను. ఆమెమాత్రం నా వేపు అసలే చూడలేదు. నేనేదో గాబరాపడిపోతున్నాను.

గణపతిగాడు నాదగ్గరగా కూర్చున్నాడు పళ్లుతోముపుల్ల పట్టుకొని. 'కిష్టీ' అని పిలవగానే నేను తడబడి వాడికేసి చూశాను. 'అదిగోరా నా పెళ్లాం' అని నవ్వుతూ, నీటిలో బిందె ముంచుతున్న ఆవిడ వేపు చూపించాడు. ఇంతసేపూ నేను బాధపడింది యీ

మంత్రాలు చదువుకున్న గణపతిగాడి పెళ్ళాంకోసమా!

'వస్తానురా' అని ముఖం కడుక్కొని వచ్చేశాను. పొట్టి జుత్తు, పీఛూది, చిన్న బొజ్జ—అలాంటి గణపతిగాడే అంత అందమైన పెళ్ళాన్ని కట్టుకున్నప్పుడు నేను ఎంతో అందమైనదాన్ని పెళ్ళాడాలని భీష్మించుకున్నాను.

ఇంటికి వచ్చాను. పట్నం వెళ్ళిపోతానని అమ్మతో చెప్పాను. అమ్మ వుండమని బ్రతిమాలుతుంటే నా పట్టుదల మరీ హెచ్చిపోయింది. నాన్న తోడల్లుడికూతురు పెళ్ళికి వెళ్ళారు. నేను రాబట్టి అమ్మ వెళ్ళలేదు. నాన్న మూడురోజులవరకూ రారు. నాన్న వచ్చేవరకైనా వుండమని అమ్మ బ్రతిమాలింది. ససేమిరా ఉండనని పంతంపట్టాను. అమ్మకళ్ళల్లో నీరు తిరిగినా నా భ్రమ నన్ను పట్టు విడవనిచ్చింది కాదు.

నే నింకా భోంచెయ్యలేదు. అమ్మ యెక్కడికో వెళ్ళింది. వాలు కుర్చీ పెరటివాకిట్లో వెన్నెల్లో వేసుకొని కూర్చున్నాను. ఇంకా గణపతి పెళ్ళామే నా కళ్ళల్లో తిరుగుతోంది. ఇదంతా పల్లెటూరి అందం. పట్నంవాజ్రూపుయెదుట యీ అందం దేనికి? ఇలా ఆలోచిస్తూ కూర్చుంటే 'కిష్టీ' అన్న కీచుగొంతుక వినిపించింది. చుట్టూ చూశాను. సావిత్రి!

సావిత్రిచూపువల్ల నే నేమీ కాలేదు; యేమీ గ్రహించలేదు.

'కిష్టీ, యిది నీకు న్యాయంగా వుందా?'

'ఏం టా యిది?'

జవాబు లేకపోవటంతో వెనక్కి చూశాను. సావిత్రి తల దించుకొనే వుంది. యీసారి ఆమెవేపు చూడాలనిపిస్తోంది.

'కిష్టీ' అని ఒక్కసారి యేడుస్తూ నా పాదాల దగ్గర కూర్చుండిపోయింది.

'పిచ్చిదానా! యేడుస్తా వెందుకు?' ఓదార్చుదామని ఆమెతలమీద చెయ్యి వేశాను. సావిత్రిని తాకగానే నా నరాలన్నీ స్థలాలుతప్పాయ్.

'కిష్టీ, రేపు వెళ్ళిపోతావా?'

'హాఁ'

'నిజంగా వెళిపోతావా కిష్టీ?' నీరు నిండిన కళ్ళతో నా ముఖంవేపు చూస్తూ లోతుస్వరంతో అంది. నా కళ్ళెందుకో మండాయ్. కొత్త తొట్రుపాటుతో 'అయితే వెళ్ళనులే సావిత్రీ' అన్నాను.

నా పాదాలదగ్గరనుంచి చటుక్కున లేచిపోయి 'వస్తాను కిష్టీ! అమ్మకోసం నే వచ్చినందుకు వుండటానికి ఒప్పుకున్నావ్. అమ్మ నీ వెళిపోతా వని మాయింటిదగ్గర చెప్తూ యేడుస్తుంటే నీదగ్గరకు వచ్చి నే నేడ్చాను. నా యేడుపుతోనే నీ మనసు కరిగింది గాని కని పెంచిన అమ్మయేడుపు కనపడలేదేం? ఆ కోట్లూ బూట్లూ అవతల పారేయ్ కిష్టీ! సిగ్గైనా వస్తుంది' అంటూ గబగబ వెళిపోతోంది. యీ మాటలు ఆ పల్లెటూరిపిల్లనోటివెంబడి వచ్చాయని నమ్మలేకపోయాను.

ఆమె వెళిపోవటం నా కిష్టంలేదు. గబగబ లేచి ఆమెవెనకాల వెళ్ళి వసారాలో ఆమెచెయ్యి పట్టుకున్నాను. ఆగి తిరిగి నావేపు చూసింది. నా జీవితం అంతా వెన్నెలనిపించింది. ఆగలేక సావిత్రిని గట్టిగా గుండెకదుముకొని 'నా సా...' అన్నాను.

ఎంతసేపో అలా లేను. సావిత్రి ఏడుస్తోంది. నాకు జాలివేసింది. నేను కొట్టానేమో నని ఆవేళ లొంగిపోయిన సావిత్రి యీనాడు నా వాంఛకి లొంగిపోయింది. సావిత్రిని అలా పట్టుకొనే 'ఏడుస్తున్నావేం సావిత్రీ' అన్నాను.

'పెళ్ళి...' అంది. ఆనాడు ఆమెబావకోసమే గుండు చెయ్యించారు. యీనాడు పెళ్ళి ఆమెబావకోసమే చేస్తున్నారు. ఆమెకు యిష్టం లేకపోబట్టి యేడుస్తుం దని అనుకున్నాను.

అడుగుల చప్పుడవబట్టి అమ్మ వస్తోందని వూహించాను. నేను గాబరాపడుతోంటే సావిత్రి

ముందుకు వచ్చి 'కిష్టి వుండటానికి ఒప్పుకున్నా వత్తయ్యా' అంది. 'నిజంగానే' అని అమ్మ సావిత్రిని వీధివాకిలిలోనే కౌగిలించుకోవటం చూచి పెరటికి వెళ్లి కుర్చీమీద కూర్చున్నాను.

## ౮

ఆ మరునాడు వుదయం సావిత్రియింటికి వెళ్లాను. సావిత్రితల్లి గదిలో చాపమీద కూర్చోబెట్టి మాటల్లో మాటగా సావిత్రిపెళ్లిగురించికూడ యెత్తింది. పెళ్లికి సావిత్రి యిష్టపడినట్లుగాకూడ తేల్చింది.

'సావిత్రి మనస్ఫూర్తిగా యిష్టపడితే వేగంగా చేసెయ్యటమే మంచి' దని, యేమనలేక నవ్వేసి వచ్చేస్తూ ఆ పొరుగునే వున్న గణపతిగాడి యింటివేపు చూస్తూ వచ్చేశాను. నాకు ఆశాభంగం కలిగింది.

ఆవేళ మధ్యాహ్నం పడుకొని లేచేసరికి అమ్మ సావిత్రితో వరండాలో కూర్చుని మాట్లాడుతోంది. లేచినవాడిని టక్కు వేసి నిద్రపోతున్నట్లు నటించాను. నాగురించి యేమీ మాట్లాడుకోకపోవటంతో లేచాను. నన్నుచూచి సావిత్రి లేచి వెళిపోబోతుంటే అమ్మ 'నీ కెందుకే కిష్టిదగ్గర అంత సిగ్గు?' అని చెయ్యి పట్టుకొని కూర్చోబెట్టింది బలవంతాన.

ముఖం కడుక్కోవాలి అన్నాను. అమ్మ సావిత్రివేపు చూసింది. సావిత్రి లేచి పెరటికి వెళ్లింది. అమ్మ వెళితే సావిత్రిని నే నడగవలసిన మాటలు అడిగి వుందును. అమ్మే అంది-పెరటికి వెళ్లి ముఖం కడుక్కో అని. మంచి సమయం దొరికిం దని వెళ్లాను. సావిత్రి చెంబుతో నీరు, సబ్బు అక్కడ పెట్టి వెళిపోబోతోంది.

'కాస్త నీరు పోయి సావిత్రీ' అన్నాను. తిరిగి వచ్చింది. ముఖం కడుక్కుంటూ 'నీ కిష్టపడిందిగా ఆ సంబంధం' అన్నాను మెల్లగా.

'అమ్మ చెప్పింది వాళ్ళది మంచి సాంప్రదాయ కుటుంబ మని. అమ్మకంటే నాకు హెచ్చు తెలుసా? ఆయన కష్టపడి సంపాదించుకొని తల్లిదండ్రిని పోషిస్తున్నారట. అలాంటప్పుడు యిష్టపడదా కిష్టీ'

వరగకప్పిన కళ్లు విప్పి సావిత్రివేపు ఒకసారి చూసి 'అయితే నిన్న రాత్రి యెందు కలా యేడ్చావ్'

'నిన్నటివరకు నన్ను నా సావిత్రీ అంటూ వను కోలేదు కిష్టీ. నా కిష్టికోసం నే నిప్పుడు వాళ్లని కాదంటే నాకు పాపం వస్తుందా?' వంగి మెల్లగా అంటూ నా చేతులమీద నీరు పోస్తోంది.

ఆ మూడుముళ్లమీద మమకారం, భక్తీచూపిస్తున్న సావిత్రిఅవివేకానికి అప్పట్లో జాలివేసింది.

మూడోరోజు వుదయానికల్లా నాన్న వచ్చారు. ఇంచుమించు ఆయన ,లోలోన పెద్దపెట్టున యేడుస్తున్నా రనిపించింది. అమ్మాయిపెళ్లి యే చికాకూ లేకుండా జరిగిపోయిందా అని అమ్మ అడిగింది. 'ఏం జరగటమే! యీ రోజుల్లో సామాన్యకుటుంబాలలో ఆడపిల్లల్ని కనటమే నేరంగా వుందే' అంటూ తల దించేశారు. ఆయన అంత వికలంగా, విచారంగా వుండటం నే నెప్పుడూ చూడలేదు. 'యేం చెప్పను వాడి బాధ. ఒకపిల్లకి పెళ్లిచేసేటప్పటికి తలప్రాణం తోకకి వచ్చింది. ఇంకా యిద్దరు పెళ్లికి సిద్ధంగా వున్నారు. ఆర్జించిన దంతా యీ పెళ్లితో సరి. రెక్కాడితే డొక్కాడటం. నన్ను పట్టుకొని బావురు మని యేడ్చాడే......రామరామ...వాడి కష్టం శత్రువుకీ వద్దు......!' ఆ యేడుపుగొంతుకతోనే అన్నారు—'మన కిష్టడి పెళ్లికి దేవుడిసాక్షిగా ఒక్క దమ్మిడీ కట్నం పుచ్చుకోనే' అని.

మా దగ్గరివాళ్ల కష్టాలు మా కళ్లు తెరిచాయ్. అందుకే సుగుణ వాళ్ల కోడ లయ్యేభాగ్యం పట్టింది.

ఆవేళనుంచి నేనూ, సావిత్రీ కలుసుకోటానికి మా అమ్మ మంచి అవకాశం యిచ్చేది. అలాంటి అవకాశం యిచ్చినందుకు కారణంవిషయం ఆలోచించలే దప్పుడు. నాన్న కట్నం ఒక్క దమ్మిడీ పుచ్చుకో ననగానే సావిత్రిమీద అమ్మదృష్టి పడివుండవచ్చు.

నా శెలవులు ఆఖరుకాబోతున్నకొద్దీ సావిత్రి తత్వం నా కేమీ నచ్చింది కాదు.

'యీ కంపుపీఠుల్లో వాలుసుగోడల మధ్య పక్కమంచాలమీద భక్తో యున్న దేవుళ్ల మధ్య—పాడుకోడానికీ ఆడుకోడానికీ, వలచి వలపించుకోడానికీ—శాంతికీ ప్రశాంతికీ—ఛీ—యీ కంపు' అని నేను...

'అదంతా కంపు కాదు. భక్తి లేకపోతే మంచి మనసు లేదు. మంచి మనసు లేకపోతే ప్రేమ లేదు. మనుషులు లేనిచోట మనం విహరించలేం. సంతృప్తి లేనిది బ్రతకలేం' అని సావిత్రి మెట్టవేదాంతం.

నేను పట్నం రేపు వెళిపోతా నని అనుకోగా సావిత్రి చీకటిపడ్డవరకు మా యింట్లోనే వుంది. సావిత్రిని విడిచిపెట్టి వెళిపోవటం నాకు కష్టంగానే వుంది. పట్నంఫాషన్లు జ్ఞాపకానికి వచ్చి సావిత్రిని మరచిపోగల నని అనుకున్నాను. నాన్న యింకా యింటికి రాలేదు. అమ్మ అంగట ఎవరితోనో మాట్లాడుతోంది. మెల్లగా పెరటికి జారాను. సావిత్రి ఒక్కరితే వుంది. గన్నెన దగ్గరకు వెళ్ళి సావిత్రిభుజంమీద చెయ్యి వేశాను. తల దించింది. నన్ను చూడగానే యీ సిగ్గెక్కడ వూడిపడుతోందో ? నేను ఆమెతల యెత్తి ఆ కళ్లల్లోనికి చూశాను.

ఆగలేక పెదిమలను కలిపాను. సావిత్రి నా చేతుల్లోనించి జారి వంటయింట్లోకి వెళ్లిపోయింది.

వంటయింటిదగ్గరకు వెళ్లి వంగి లోనికిచూశాను. సావిత్రి చీరకొంగుతో కళ్లు కప్పుకొని కూర్చుంది.

'సావిత్రీ' అని మెల్లగా పిలిచాను.

'కిష్టీ' అని అలసటగా, అతిమెల్లగా అంది.

'ఏడుస్తున్నావా ?'

'హాఁ...కిష్టీ...హాఁ...లేదు, లేదు వెళిపో కిష్టీ'

సావిత్రిమాటల ధోరణి చూస్తే నా కేమీ పాలుపోలేదు. గబగబ దగ్గరకు వెళ్లాను. మళ్లా భుజంమీద చేయి వేశాను. లేచి నిలబడి కాస్త దూరంగా వెళిపోయింది.

'కిష్టీ వెళిపో......వేగంగా వెళిపో కిష్టీ' — చిరాకు, జాలి, భయం అన్నీ యిమిడున్నాయ్ ఆ గొంతుకలో.

నేనుమాత్రం కదలలేదు. కూర్చున్నాను సమ్మం దగ్గర.

'వెళ్లవుకదూ కిష్టీ' అంది కాస్త గంభీరస్వరంతోనే.

'ఎందు కేడుస్తున్నావో చెప్పంది వెళ్ల'నన్నాను.

'పెళ్లి అయ్యేవరకూ నన్ను ముట్టుకోకు కిష్టీ'

'దానికేనా యేడుస్తున్నావ్' అని పరిహసించాను.

'యీ భయం, యీ దొంగతనం యెందుకు కిష్టీ! ఎక్కడున్నా దగ్గరగానే వుంటాం. ఇప్పుడైనా వెళిపో కిష్టీ'

లేచి వెళిపోయానే గాని ఆమె మనసు అర్థం చేసుకోడానికి ప్రయత్నించలేదు. నిజానికి నా కా మాటలు నచ్చలేదు.

నా కోరిక నన్ను విడిచిపెట్టలేదు. ఆ మరుచటిరోజు ఒంట్లో నీరసంగా వుందని వుండిపోయాను. సావిత్రి యెక్కడా కనిపించలేదు. ఇంకోరోజు ఆగాను బలవంతంగానైనా సావిత్రిని నా సిద్ధాంతాలకు దాసోహం చెయ్యిద్దా మని. కాని సావిత్రి కనపడలేదు. వాళ్ల యింటికి వెళ్లాను. ఎంతసేపు మాట్లాడినా సావిత్రిముఖం కనపడలేదు. తిరిగి వస్తూ సావిత్రికి వినిపిస్తుందేమో అని గట్టిగా అన్నాను. రేపు ప్రొద్దున్న వెళిపోతా నని. 'బుద్ధిగా చదువుకో కిష్టీ' అంది వాళ్ల అమ్మ.

సావిత్రి వస్తుందేమో అన్న భ్రమతో చాలా రాత్రివరకూ మేలుకొనే వున్నాను. నా నిరాశ సావిత్రిమీద అసహ్యాన్ని హెచ్చు చేసింది. ఇలాంటి వాళ్లని నిజానికి నాకు పెళ్లాడా లని లేదు. కల్చర్ లేని ఆడది మోహాన్ని అలవరచుకోలేదు. మల్లెపూల సెప్పమీద కూర్చొబెడితే సెప్ప మునుగుతుందేమో అని అమ్మో అని భయంతో కేకలు వేస్తుంది. హిమాలయంమీదకు పోతే చలిచలని యేడుస్తుంది! ఛస్తే యేం పోయింది-ఎడారిలో కలుసుకొని గాఢంగా

హృదయాలను కలుపుకొని చచ్చిన లైలామజ్నూలులా! మానవుని సాత్వైన మోహాన్ని యిలాంటి అర్థం లేని అజ్ఞానంలో పెట్టి నలిపి చీల్చి చెండాడుతున్నాం మనం అనాగరికులం! మనకంటె లక్షరెట్లు నాగరికులు యీ సృష్ట్యాదిని నివసించిన యిరువురు — ఆదాం, యీవు.

ఇలా ఆ రాత్రంతా మోహాన్ని స్తుతించటంతో ప్రపంచంమీదే అసహ్యం వేసింది. నాకూ సావిత్రికీ యెటువంటి సంబంధం లేదనుకున్నాను.

ఆ మరుచటిరోజు వుదయం బస్సుకోసం రోడ్డుమీదకు పోతూ సావిత్రియింటివేపు చూశాను. నాకెవరూ కనిపించలేదు. రోడ్డుమీద బస్సుకోసం చూస్తూ అప్పుడప్పుడూ సావిత్రియింటి పెరడువేపు చూస్తున్నాను. బస్సు యెక్కబోతూకూడా చూశాను. సావిత్రి నావేపు దీక్షగా చూస్తోం దనుకున్నాను.

౬

రెండో సంవత్సరం స్కూలుఫైనలుక్లాసులో కూర్చుంటా ననుకున్నాను. కూర్చున్నాను. పట్నం వెళ్లిన వారం రోజులవరకూ సావిత్రితో గడిపిన రోజులు జ్ఞాపకం వున్నయ్. తరవాత మరచిపోయాననే చెప్పాలి. మళ్లీ మామూలుధోరణిలో పడ్డాను. యీసారి మరి కొత్త హెచ్చింది. సావిత్రిమీద చూపిన సాహసం యిక్కడా చూపించటానికి చాలా ఆందోళనపడుతున్నా. అందుకే అర్థం లేకుండా తిరిగాను.

ఒకనాటి రాత్రి. పదిగంటలు దాటింది. నిద్ర రావటంలేదు. లేచాను. గదికి తాళంవేసి అలా తల వంచుకొని నడచి వెళిపోతున్నాను. ఒక మనిషీ నా కెదురుగా రాలేదు. అలా రంగారాయపురం వెళి పోదా మనిపించింది.

నడుస్తున్నాను. నా మోహం నన్ను నడిపిస్తోంది. వీథిలో ఎలెక్ట్రిక్ లైటు వెలుగుతోంది. స్తంభానికి ఆనుకొని యెవరో కూర్చున్నట్లు గమనించాను. వేగంగా నడిచాను. నావేపు చూడలేదు. యేదో దీక్షలో వున్నట్టుంది..... దగ్గరగా వంగి భుజంమీద చెయ్యివేశాను. నా కళ్లల్లో నీరు తిరిగింది.

నా భుజంమీద నవ్వుతూ చెయ్యి వేసి 'యేడుస్తున్నారేం?' అప్పుడే మేల్కొని మత్తుగా పలకరించినట్లుంది. నా జవాబు లేదుగాని నా రెండో చెయ్యికూడ భుజంమీదకు వెళ్లింది. నా ఒళ్లు ఒక్కసారిగా పులకరించింది.

'బ్రతుకుమీద విరక్తి పుట్టిందా!'

'హాఁ'

'మీ యిల్లెక్కడ?'

'నా యిల్లు...' నాకు తెలివి వచ్చినట్లైంది. లేచాను. 'వస్తాను. దగ్గరగానే' మళ్లీ వచ్చినత్రోవనే తిరిగి గబగబ వచ్చేశాను.

తాళంతీశాను.

'నేనూ రావచ్చా?'

వెనుకకు తిరిగేసరికి యిం కెవరు? ఆయనే వేసిందా ప్రశ్న.

'రండి' అన్నాను. నే నేం చేస్తున్నదీ ఆయన చూడనే దనుకుంటాను. ఆ గదిచుట్టూ యెన్నోసార్లు చూస్తున్నాడు. నేను మంచంమీద చారబడ్డాను.

ఆయన చేతిలోని కాగితాలు, పెన్సిలు బల్లమీద పెట్తూ 'మీకు పెళ్లి కాలే దనుకుంటా' నన్నాడు.

'లేదు' అన్నాను.

'ఇంకా చదువుకుంటున్నారుకదూ'

'హాఁ'

'మీ నాన్నగారికి హెచ్చు డబ్బుందికదూ?'

దీనికి నే నేమీ జవాబు చెప్పలేదు.

'యే స్త్రీనైనా ప్రేమించారా?'

'ఆ విషయం మీ కనవసరం అనుకుంటాను' అని లేచి కూర్చున్నాను.

'నే నిప్పుడు ఆ స్తంభందగ్గర కూర్చుని

వ్రాస్తున్న కథలో యీ ప్రశ్న వ్రాసి జవాబు దొరక్క గింజుకుంటుంటే మీరు వచ్చి నన్ను జాలిగా లాలించారు. ఆ ప్రశ్న మీకే వేస్తే వాస్తవికమైన జవా బిచ్చినందుకు కృతజ్ఞుణ్ని'

'నా దగ్గరనుంచి మీకు కావలసిం దేమైనా వుందా ?' అన్నాను, వచ్చే చిరాకును అణచివేస్తూ.

'ఉండబట్టే మీ వెనకాలే వచ్చాను. జీవితం మీద విరక్తి పుట్టినవాళ్లదగ్గర యేంతైనా వుంటుంది'

'నా కేమీ విరక్తి పుట్టలేదు. నాదగ్గర యేమీ లేదు.'

'అబద్ధాలు, ఆక్రోశాలు, అర్థంచేసుకోక పోవటం వాళ్లదగ్గరే వుంటుంది. వాళ్లదగ్గర మెసలంది మా కలం నడవదు'

యీ వ్యంగ్యం నా కర్థమయింది. 'యిక దయ చెయ్యం' డన్నాను కటువుగా.

'వెళిపోతానండీ! మా అన్నయ్యే నన్ను యింటి నుంచి యెందుకూ పనికిరా నని పొమ్మన్నప్పుడు మీ రెవరో ఐదునిముషాల పరిచయంతో పొమ్మనటంలో తప్పేమీ లేదు. అయితే మా అన్నయ్యను పొద్దున్న లేవగానే తలచుకొని నాలో నమస్కరిస్తుంటాను. భర్తృహరి చెప్పినట్లు యింత విశాలమైన నేల వుండగా నిద్రపోడానికే చోటు దొరకదా? ఆకులు అలము లుండగా కడుపే నింపుకోలేనా? నా బట్టలనీ నన్నూ చూసి మానవులే కాదు యీ బొమ్మలే పరిహసిస్తాయ్. కొద్దినిముషాలక్రితం మీలో మానవత్వం పొటబ్టి నా మీద రెండు చేతులైనా అభిమానంగా వేయగలిగారు.'

ఆయన అంత జాలిగా మాటాడుతుంటే నే నేమీ అనలేకపోయాను.

'నేను మొదట యిలాగే జీవితం అంటే విరక్తి చెందాను. మీ కన్నీటిని చూసి నా తొలిప్రపంచంలో ఒక మనిషిని కలుసుకున్నా ననుకున్నాను. మీ గుండె మీ పిడికిటిలో పెట్టుకుంటేగాని యెదుటివారి కష్టాలు, కన్నీరు అర్థంచేసుకొని మెసల్లేరు.'

ఆయన అలా నిలుచునే వున్నారు యీ మాట లాడాక. నా కమీజుమీద నల్లిని చూశాను. దాని నేలాకై తేసేం, కాస్త కంగారుపడ్డాక పట్టుకున్నాను. ఆయన యెదురుగా యిన్నాళ్లలా చంపటానికి మనసు పోలేదు. లేచి వీథిలో పారేశాను.

'నేను పోతానండీ' అన్నా రాయన.

'అంత తొందరేం ?' అన్నాను.

'ఆ నల్లిలా నేనూ మీకు దాపురించానేమో అని భయంగా వుంది.'

ఆయన నవ్వుతూ అంటే నేను నవ్వాపుకోలేక పోయాను.

యీ ప్రపంచంలో ఆయనకూ, నాకూ అప్పటికి పదినిముషాల పరిచయం. కోపంతో, కుళ్లుతో నిండిన నా మనసు నాకు తెలియకుండానే ప్రేమకనికరంతో నిండిన ఆయనమనస్సుకు దాసోహం అంది. నా పరాజయం గురించి తలచలేదు. గౌరవించే సూచనలు నాలో అలముకున్నయ్.

ఆయన వెళిపోతుంటే ఆ మాటలు జ్ఞాపకానికి వచ్చాయ్—'ఇంత విశాలమైన ప్రపంచం వుండగా నిద్రపోటానికే చోటు దొరకదా ?' యీ మాటలు నన్ను కలవరపరిచాయ్. ఆరాత్రపుడు యే వీథిలో గరుకునేలమీద నిద్రపోతాడు ? పరుగెత్తాను. గభ్భున చెయ్యి పట్టుకొని 'రండి' అంటూ వెనకకు తిరిగాను. ఆయన మాటాడకుండా, ఆశ్చర్యపడకుండా నాతో వచ్చేశారు.

నా పరుపుమీద పడుకోమన్నాను. 'ఒక చాప వుంటే యిలా పారెయ్ తమ్ముడూ' అన్నారు. సంబంధం ముళ్లువేసుకుంది. నేను చాప వేశాను. చాపమీద కూర్చున్నారు. నేను కుర్చీమీద కూర్చొని 'మీరు వ్రాసిన కథ వినవచ్చా' అన్నాను.

చదివేముందు అన్నారు 'నాకు కట్టుకథలమీద నమ్మకం లేదు. ఎప్పుడూ వ్రాయలేదుకూడాను. యీవేళ కట్టుకథ వ్రాయా లని మనసు పుట్టింది. చాలావరకు వ్రాశాను.'

సుగుణా ! ఆ వర్ణనలు నే చెప్పలేనుగాని ఆ

కథ చెప్తాను.

'కరుణాకరం కథానాయకుడు. ఎప్పుడూ శృంగారం, సౌందర్యం అంటూనే పలవరిస్తాడు. ఆయనకోరికల్లో మొదటగా నిలిచింది మోహం. కళ్లు లేని లోకం కళ్లున్నవాళ్లని చూడనీయదని, ఒళ్లున్నను లేని లోకం ఒళ్లున్నవాడిని విహరించనీయదని అంటాడు. ఇలా అడ్డుపెట్టడానికి వుపయోగించబడే ఆయుధా లేవంటే—జాతిమతాలు, నీతినియమాలు, ఆచారవ్యవహారాలట. ప్రపంచంలో బ్రతకటం ఆనందంకోసమే నని, దానికి మోహం మొదటిమెట్టని చాటుతాడు. యీ కట్టుబాట్లకు లొంగిపోయిన యీ ప్రపంచంలో అసలు మోహానికి చోటేలేదంటాడు. ఏ అశ్వినీ లోకాలకో పోయి, ఏ గంధర్వకన్య మధురాతిమధురమైన పిలుపులోనో లీనమై, ఆడుతూ పాడుతూ సరోవరం మీద మల్లెపూల తెప్పమీద కూర్చొని కాలం అంతా వెన్నెలరాత్రులై జీవితంఅంతా యౌవనం చేసుకోవాలంటాడు.

మాటలతో సంఘాన్ని మరమ్మతు చెయ్యాలని భీష్మించుకున్నవాళ్ల అవస్థ యింతా అంతా కాదు. ఒకర్ని సత్రీంగా బ్రతకనివ్వరు. వాళ్లు బ్రతకలేరు. ఈ ప్రపంచంమీద విరక్తి పుట్టి, బయలుదేరతాడు.

సమోన్నతమైదానాలు. మైదానాన్ని చీల్చుకొని పారే నది. నదిలోని కోనలు. కోనల్లో కిలకిల లాడే చేపలు. యీ ప్రమోదమైన వాతావరణంలో ఆడదానికోసం వెతుకుతాడు.

ముందుకు నడుస్తాడు. ఒక పొలంలో గొర్రెల మంద కనిపిస్తుంది. కుక్కలు జాజామనటంలో నిద్రపోతున్న మంద ఒక్కసారి వులికింది. కరుణాకరం చెట్టెక్కి నక్కిపోతాడు. చెట్టుమీదినుంచి అప్పుడే నిద్రనించి లేచిన గొల్లపిల్లని వెన్నెల కాంతిలో చూస్తాడు. వీచే చల్లగాలికి జారిన పమిట చెంగు వెర్రెత్తించింది. ధైర్యంచేసుకొని చెట్టు దిగాడు. కుక్కలు ఒక్కసారి వచ్చి మీద పడ్డాయ్. గొల్లపిల్ల పరుగెత్తుకొనివచ్చి రక్షించింది. కరుణాకరం వేషం చూసి 'పట్నంబాబు దారితప్పి వచ్చా'రని పొదలు పొలాలు దాటించి రోడ్డు చూపించింది. ఇలా వెళిపోయారంటే పట్నం చేరుకుంటారు బాబూ అంది. ఆమెచెయ్యి హఠాత్తుగా పట్టుకొని 'ఎంత అందంగా వున్నా' వని కౌగిలించుకోబోతాడు. ఆమె విడలించుకోడానికి ప్రయత్నిస్తుంటే పీడు యింకా గట్టిగా అదుముకోబోతుంటాడు.

ఆమె ఒడిలోని కత్తి తీసి గుండెదగ్గర పెట్టే సరికి గజగజ వణికిపోతున్నాడు. ప్రాణంకోసం ఆమె పాదాలని తాకడానికికూడ జంకలేదు.

ఆమె చెప్పిన త్రోవ కాదు, యింకొక త్రోవ పట్టాడు. అడవి ఝుమ్మంటోంది. ధైర్యంతెచ్చుకొని ముందుకు నడుస్తున్నాడు. ఏవో గర్జనలు విని పిస్తున్నయ్. చెట్టెక్కి తెల్లవారేవరకు గడుపుదా మనుకున్నాడు. కొండచిలవ—అమ్మో అంటూ కేక వేసి పరుగెత్తాడు.

ఏ గర్జనా లేదు—చిన్న పర్ణశాల. ఆ పర్ణ శాలబయట వెన్నెల్లో కోయపడుచు. మచ్చలేని చందమామ. మెరుగుపెట్టిన బంగారం—మోహంపు సౌధాలలోని ముగ్ధ! ఆయనరక్తపుకెరటాల్లో విద్యుత్తు ప్రవహించింది.

గప్పున వెళ్లి ఆమెవక్షస్థలంపై చెయ్యి వేశాడు.

ఇక ఆమె—పడుచైనా పాలు పొంగింది. మరెవడో కాదు బిడ్డ. ప్రక్కనున్న విల్లు పాపడి ఆటవస్తువు. ప్రతిపలుకు జోలపాట.

'నెనవలు వూడిపడ్డారు. మోహాన్నంతా మొత్తే శారు! పట్నంలోనించి పిస్తోలుతో రాకపోవటం పెద్ద తప్పిదం చేశా' నని బాధపడతాడు.

ఒకడు ఆమెభుజంమీద చేయి వేశాడు. ఒర లోని బాణం కరకరా చూస్తోంది. ప్రేయసిని పట్టుకున్న తనని క్షమిస్తాడా? చంపుతాడు. ఆమెనీ చంపుతాడు. ఏం చెయ్యటం?

పసిపాపజీవనాధారంమీద దృష్టి పోనిచ్చే వాళ్లని బిడ్డల్లా ఆ కోయలు చూసుకుంటా రని పాపం కరుణాకరం యెప్పుడూ వినలేదు.

పళ్లూ కాయలూ పులితోలులో చుట్టి యిచ్చి అడవి దాటించి వెళిపోయారు.

కరుణాకరం మనసంతా మండిపోతోంది. ఒళ్లంతా కాగిపోతోంది. యీ బాధ పోడానికి ఒకే ఒక సాధనం. పిస్తోలు—యెలా వస్తుంది?

ప్రపంచంలో తెలిసీ తెలుసుకోలేని వస్తువు కన్నా, విషయంకన్నా మోహం గొప్పది అని తన విశ్వాసాన్ని దృఢపరచటానికి ఎంతోసేపు పట్టలేదు.

పెద్దసరోవరం సమీపంలోనే కనిపించింది. వెన్నెలకాంతిలో నీటి వెలుగు. ఆ వెలుగులో మెరసి పోతోంది మల్లెపూల తెప్ప—తను అనుకున్న అశ్వినీలోకాలు...గంధర్వకన్యలు...కని విని యెరుగని మోహంపుస్వేచ్ఛ!

ఆయన చెవులు అమరసంగీతాన్ని విన్నాయ్. ప్రేమతో యిచ్చిన పళ్లూ కాయలూ కాళ్లదన్ని పరుగెత్తాడు. తను యింతకాలం కలగాంచిన గంధర్వకన్యే యెదురుగా కనిపిస్తోంది.

తెప్ప ఒడ్డుకు కొంచెందూరంలో వుంది. కరుణాకరం ఒడ్డున నిలుచుని ప్రేమతో పిలుస్తాడు. ఆమె అలా తెప్పమీద నిలుచోని కొన్ని ప్రశ్నలడుగుతుంది.

'నన్ను ప్రేమిస్తున్నావుకదూ?'

'ప్రేమిస్తున్నానని నే చెప్పుకోను. నా జీవిత సర్వస్వం నివ్వే అంటాను.'

'సరే ప్రేమిస్తున్నావ్—నీ మనసు నిర్మలంగా వుందికదూ?'

'మోహం ఉన్న ప్రతిమనిషిమనసు నిర్మలంగానే వుంటుంది.'

'ఎలా చెప్పగలిగావు?'

'నీయెదురుగా నిలుచోగలిగాను కాబట్టి. మోహం యెరుగని ముగ్ధ గంధర్వాంగనతో మాట్లాడగలడూ?'

'ఏం! దేవుని ప్రార్థించలేదూ? మా పెద్దలు చెప్తారు మానవులు చాలా దైవభక్తి, సత్యం, సహవంతో నిర్మలమైన జీవితం గడుపుతారు; అంచేతే వాళ్లని ప్రేమించేవాళ్లమని. ఇది నిజం కాదంటావా?'

'శుద్ధఅబద్ధం. మళ్లీ ఆ కంపువీసుల్లోకి, కుక్కమంచాలమీదికి ఛీత్తో యున్న దేవుళ్ల బొమ్మలమధ్యకు నన్ను యీడ్చుకపోకు. ప్రేమించుకోడానికి యీ దేవుళ్లూ, దెయ్యాలూ యెందుకు తీసుకొస్తావ్?'

'పోనీ యే స్త్రీనైనా ప్రేమించావా?'

సుగుణా! యింతవరకేకనూ ఆయన వ్రాసింది! 'తమ్ముడూ! యీ ప్రశ్నకి నీ విచ్చిన జవాబు పనికిరాదు. అహంభావంవలన నా కా జవా బిచ్చావ్. కాని, కరుణాకరం మోహంలో మునిగున్నాడు. రేపు వ్రాశాక యెలా గుంటుందో చూద్దాం పదుకో' మన్నాడు. ఆ మరుచటికోజు మిగతా పూర్తిచేశాక నా చేతి కిచ్చి 'యీ కథ యే పత్రికకీ పంపించాలని లేదు. నీదగ్గరే వుంచుకొని రోజు కొకసారి చదువుకో' అన్నారు. మిగతాకథ యిది.

'లేదు లేదు. నిన్నుతప్ప మరెవరినీ ప్రేమించలేదు'

మల్లెపూల తెప్ప ఒడ్డుకు వచ్చింది. ఆమె కిలకిలా నవ్వుతోంది. కరుణాకరం తెప్ప యెక్కుతాడు. ఆమె గొంతెత్తి పాడుతూ ఆ వెన్నెల్లో మెల్లగా పడవ నడుపుతుంది. సరోవరజలంమీదినుంచి వీచే చల్లగాలి, మల్లెపూలుమీదినించి పరుగులెడుతూ సౌరభంతో మత్తెక్కిస్తున్నాయ్. కరుణాకరం తన్మయుడైపోతాడు. వెన్నెల్లో పడవ పోతోంది. అశ్వనీలోకాలన్నీ తనకి చేరువుగా వున్నాయని భ్రమపడతాడు. ఆమెదగ్గరగా వెళ్ళి కళ్లలోనికి చూస్తాడు. ఆమె తియ్యగా నవ్వి కళ్లు శృంగారంగా త్రిప్పుతుంది. ఒక్కసారి కళ్లు మూసి ఆమెను గట్టిగా కౌగలించుకొంటాడు.

కళ్లు తెరిచేటప్పటికి అంత సుందరమైన ప్రదేశం శ్మశానంలా కనిపిస్తుంది. ఆయనబాహువుల్లో అస్థిపంజరాన్ని చూసి కెవ్వున కేక వేస్తాడు.'

ఇదీ ఆయన వ్రాసిన కథ సుగుణా. యీ కథ నీ కెందుకు చెప్పానంటే యీ కరుణాకరమే అప్పటి కిష్టి అని తెలుసుకుంటా వని.

ఆయన రోజూ వచ్చేవారు. భోంచేశారా అని అడగటం నాకు అలవాటు లేదు. ఎంచేతంటే, నాకు జ్ఞాపకం వున్నంతవరకు భోజనం చెయ్యకుండా ఒక్క పూట వుండలేదు. అప్పుడప్పుడు పస్తుండేవా రని నా కేం తెలుసు ?

ఆయనయెదురుగా ఆడవాళ్లని చూసి వ్రేళ్ళ వేషాలు వెయ్యటంమాత్రం మానలేదు. దొంగచూపులు పారేస్తూ వేవున్నాను. ఏం తమ్ముడూ! తప్పు కాదా అని ఒక్క సారీ అనలేదు. ఆయనని యిప్పటికీ మరచిపోలే దంటే, దానికి కారణం ఆయన పడ్డ కష్టాలే. మహోను భావులను మన జ్ఞప్తిలో వుంచింది వారు పడ్డ కష్టా లేనా ? నాలా ఆయన సుఖపడివుంటే ఆనాడే ఆయన్ని మరచిపోయివుండేవాడిని.

వాస్తవికరచనకోసం ఆయన పడ్డ బాధ, ఆ రచన హృదయానికి హత్తుకుందో లేదో అని గింజు కోవటం—యీ ఫలితంలేని శ్రమంతా చూసి నాకు చిరాకు వేస్తే నవ్వుతూ ఒకనాడు అన్నారు, 'నీ కంటికి కనిపించిన నా శ్రమకు ఫలితం లేదంటే నమ్మను. నా ఆనందంవల్ల వెలువడ్డ యీ కథలమూలాన యెవరికీ న్యాయమైన అపకారం జరగకపోతే చాలు. అదే ఫలితం.'

ఆ బట్టలతో ఆయనను నా యింట్లో వుంచటం నాకే అవమానంగా తోచింది. ఒకనాడు ఒక పేంటూ, బుష్‌కోటూ తీసి తొడగమని బలవంతపెట్టాను ఆ రెండూ చేతపట్టుకొని అంగట నిలుచున్నారు ఎంతసేపటికీ తొడగకపోవటంతో నేను బయటకు వచ్చాను. రోడ్డుమీద యిటూ అటూ చూస్తుంటే యెవరికోసం చూస్తున్నారన్నాను.

'గాడిదకోసం' అన్నారు.

నేను స్తంభించిపోయివుంటే మళ్లా అన్నారు—'గాడిద కష్టజీవి. నే నూరకే యిస్తే పుచ్చుకోదను కుంటాను.'

నా వేపు తిరిగి 'తమ్ముడూ! నాలాంటివాళ్లకి దానం చేసి మన దేశంలో అడుక్కున్నవాళ్ల సంఖ్య వృద్ధిచెయ్యకు. డబ్బున్నవాళ్లు ఎలా ఖర్చుపెట్టడమో తెలుసుకోవాలి' అని తిరిగి తెచ్చి నా పెట్టెలో ఆ రెండూ పడేశారు.

ఒకనాటి రాత్రి చాప వేసుకుంటూ అన్నారు —'ఆత్మపరిశుద్ధి లేనిది గొప్ప కార్యాలు సాధించ గలవా ? ఇంకా జీవితం మొదటిమెట్టుమీదే వున్నాను. యీ బట్టలతో నీకు తలవంపు తెస్తున్నానుకదూ! ఎవరే బట్టలు వేసుకున్నా శరీరం కప్పుకోడానికే కదూ ! ఎవరే పేర్లు పెట్టి పూజించినా ఒక్క దేవునికోసమేనా ? నివ్వు రాము డంటావ్ గాని అల్లా అనటానికి అసహ్యించుకుంటావ్. అలాంటప్పుడు నీ దేశపు వేషం వేసుకుంటే బాగుంటుందికదూ !' అన్నారు. నే నేమీ జవాబు చెప్పలేనుగాని ఆయన లాలించి చల్లగా చెప్పే విధానాన్ని కొనియాడకుండా వుండలేకపోయేవాడిని. (సశేషము)

---

# ప్రబంధకాలపు ప్రజలు

శ్రీ నాయని కృష్ణకుమారి

దైవప్రసాదితమైన మానవుని హృదయమునం దెన్నో యూహాలు పుట్టును. అవి దైనందినజీవితమున పరిభ్రమించునవి కావచ్చును; లేక మనుష్యాతీతము లగు దివ్యములు కావచ్చును. వాటి నన్నింటిని వెల్లడించుట కాతని హృదయము తొందరించును. కావ్య సంస్కారమే వానికి కలదేని భాష నాధారముగ జేసి కొని యా యూహాలు వెలి కురుకును. ఆ యురుకుట యటునిటు గాదు. సర్వకాలములయందు, సర్వజనుల మధ్య నిలచిపోవున ట్లురుకుట యది. అట్లొకరూపమును బొందిన యాతని యూహయే కావ్యమగును. అది శబ్దార్థసహితమగుట సాహిత్యమున జేరగలదు.

సాహిత్యబీజములు వేదములలో మొలకెత్తినవి. తిన్నగ తీగసాగినవి. కుసుమితమైనవి. కాని యింకను పూవు ప్రఫుల్లము గాలేదు. వెన్నెలనిగ్గులను వెదజల్లలేదు. జ్ఞానమహోదధుల వింతలో వెల్లువెరిగి యుపనిషత్తులను నూడల కిరవైనది. ఆ యూహలనెడుమ వాడిపోవుచున్న కావ్యలతామతల్లిని జూచినాడు వాల్మీకి. కరుణతో నాతనిహృదయము పొంగినది. దానికి ప్రోది చేసి ప్రాణము పోసినాడు—సంస్కృతమున వాల్మీకి యెట్టులో ఆంధ్రమున నన్నపార్యు డట్టుల. ఆయనను మొదలుకొనిన యీ మహాకార్యనిర్వహణము నేటి వరకు పరంపరగ సాగివచ్చుచునేయున్నది—అయిన దీని ఫలమేమి? కావ్యములు, కావ్యరాజములు మన దైనందినజీవితమున నుపయోగపడగలవా? తమకాలము నాటి వింతలను విశేషములను మనతో నోరువిప్పి చెప్పగలవా? అట్టు లవి మనకు జ్ఞానదాయకము లగునా, లేక యుబుసుపోకకు చదివి యానందించుటకే యగునా?

నేటిప్రపంచము మనకవగాహ్యమే. అందలి యాచారాదికములకు మనము సుపరిచితులము. అవి యెంత అసందర్భముగ నున్నను క్లిష్టములుగ నున్నను మన కెబ్బెట్టుగ దోచదు. మీదుమిక్కిలి వాని నభినందించి పురస్కారమిచ్చుట మనకు పరిపాటియై పోయినది. అయిన, ఈ యాచారాదికములే, ఇట్టి దైనందినజీవితములే మనకు పూర్వమునగూడ నుండెడివా, లేక అందేమైన మార్పు లుండెడివా? ఎట్లు తెలియు నీపురాతనచరిత్ర? జీవచరిత్రలను జదువవలయు నందురా! విసుగును పుట్టించు సత్యముల పట్టికవలె నున్న ఆ రసహీనగ్రంథములను జదువుట కెవరయ్యా యిచ్ఛగించునది?

సాహిత్యము లోకవృత్తప్రదర్శకమే యనుకొందము. అయిన మనకు గావలసినది పురాణయుగ వాఙ్మయమా, ప్రబంధయుగసాహిత్యమా యనునది ప్రశ్న. పురాణయుగమువా రందరు నతిపరిశుద్ధవర్తనులు. వారి జీవితములు అతిశయించిన రసప్లావితములు గావు. సుఖదుఃఖముల సమముగా ననుభవించిన యతీతులు వారు. భారత మున్నది. అది దాయాదుల మధ్య జరిగిన కలహాకథాకలితమే. అయినను దానిని జదువుచున్నంతసేపు ధర్మాధర్మముల మధ్య సంఘర్షణ మను స్ఫురణయే మనయం దుండును గాని అన్నదమ్ముల కలహ మనిపించదు. ఆనాటి క్షత్రియులు మానధనులు. వారికి రాజ్యములయందు, ధనధాన్యాదికములయందు మానమే యధికము. ఏతద్రక్షణమునకై రాజ్యము గావలసి పోరిరేగాని నిజముగ నైహికవాంఛలు లేని నిస్పృహులు వారు. ఎన్ని కష్టములు వచ్చినను, సత్యవాక్పాలనదక్షత యన్నది వారి సొమ్ము. తమ గమ్యమును చేరుట కా సత్యసంధత యెన్ని యడ్డంకులనైన గల్పించినీ వారు దానిని విడువరు. అచటనే యున్నది వారి నైతికశక్తి; మన హృదయముల నాచికొను

నమోఘశక్తి!—ఇక నానాటి విప్రుఁడాతఁడు మానవుఁడు కాఁడు. మానవాతీతమైన యొకానొక యపూర్వశక్తిని నరనరముల జీర్ణించుకొని ప్రాచీనహైందవ సంస్కృతికి 'జీవగఱ్ఱ'యై గలచిన యమరుఁడుగాని. అతని హృదయము సకలమనుష్యహితవాంఛాపూరితము. అతని నడకలలో అధర్మము లేదు. చేతలలో కాఠిన్యము లేదు. పలుకులలో వక్రత లేదు. నిలువెల్ల నమృతమూర్తి యతఁడు! ఏనాటికిని నాశముకెందని అమరుఁడు!

అల్లసాని పురాణయుగమున చిత్రితమైన నీతులమును తీసికొన్న అతిలము మహోన్నతమైన దనిపించును.

ఇక ప్రబంధయుగము. ఇందలి పాత్రలును, మనము ఒక్క రేఖలోనివారము. ప్రబంధములలోని నాయికానాయకులు అలౌకికులైనను, వారి లోకపు పరిహద్దులను దాటనేలేరు. వారి జీవితచిత్రణమునందు సత్యమున్నది; అసత్యమున్నది. అసలు సాహిత్యోపాసకులకే సత్యములేని అసత్యముగాని, అసత్యములేని సత్యముగాని యింపుగూర్పదేమో!

ఈ యుగమాంధ్రవాఙ్మయమున స్వర్ణయుగము. కవిజనావర్తితుఁడు కృష్ణరాయలు. అష్టదిగ్గజాలంకృతమైన అతని సభాస్థలి నూహించుకొన్ననే చాలును హృదయము కృతజ్ఞతాప్లావిత మగును. ఆనాటి పెద్దన తిమ్మనాదుల కృషియే ప్రబంధవాఙ్మయమునకు వెన్నెముక యైనది.

ఇక కథలోనికి దిగుదము—అల్లసాని పెద్దనార్యుని ప్రవరుఁడున్నాఁడు. ఆనాటి బ్రాహ్మణుని గాఢశీలము, ఆచారాదికము లాయనయందు ప్రస్ఫుటములు. అతఁడు యౌవనుఁడు! యజ్వ! ధనాఢ్యుఁడు!—"కమనీయకౌతుక శ్రీవిధి కౌఁకటుల్ గొలిచి చేసిన కూరిమిసోమిదమ్మ సౌభాగ్యవహయై" చేయు భజింపు లందుకొను భాగ్యశాలి. అంతటివానికిని తలిదండ్రుల క్రింద వణగియుండుట యిచ్చగింపు. కాననే "దేవియు దేవరవోలె" వారిరువురు నిలుదేర్పగా తన కేమియు పట్టువటుల చేతులకడిగికొని కూర్చొనినాఁడు. అతని కాస్థితియందు కష్టము లేదు. మీఁదుమిక్కిలి అట్టి జీవనమాతనికి వాంఛనీయము!

ఇక నాతని దినచర్య పరికింతమా, "ఃరణాతరంగిణీదరవికస్వరనూత్నకమలకషాయగంధము కహించి ప్రత్యూషపవనాంకురములు పైకొనఁ జేళ వానువస్తుతి పరత్వమున" లేచును. లేచి, "సచ్ఛాత్రుఁడగుచు నిచ్చలు చేగి యరుణోదయమున నఘమర్షణస్నానమాచరించు"ను. అది ముగిసినవెనుక "సాంధ్యకృత్యము దీర్చి సావిత్రి జపియించి సైకతస్థలి కర్మసాక్షి కెఱఁగి" యింటిత్రోవ బట్టును. ఆ వచ్చుటయు నెట్లు! ఒక ప్రక్క ఘనసమిత్కుశకుసుమాది బహుపదార్థతతియు, వఱియొక ప్రక్క నదికీన మడుగుదోవతులును గొని బ్రహ్మచారులగు శిష్యులు వెంటరాగా! ఈ దృశ్యమును ప్రజలందఱును మెచ్చిచూతురట! ఎందుల కామెచ్చికోలులు? అప్పటి విప్రున కంత వైశిష్ట్యమా? దానిని పెంపొందించుకొనవంటిటి పూతచరిత్రుఁడా ఆనాటి అతఁడు?

అతిథిమర్యాద! అనాడు "బధిరపంగ్వంధభిక్షుకబ్రహ్మచారి జటిపరివ్రాజకాతిథిక్షపణకావధూతకాపాలికాద్యనాథు"లకు గృహమేధి యనువాఁడు కడలేని యమృతంపు నడబావి. దొడ్డిపెట్టిన వేల్పుగిడ్డి. మఱియు పండిన పెరటికల్పకము. అంకస్థితారపేటియు. ప్రవరాఖ్యుఁడే తీసికొందము. అతఁడు తీర్థసంవాసులేతెంచినారని వినెనా, ఎంతదవ్వైనను నెదురుగా నేగును. ఏగి తత్పదములకెఱఁగి యింటికి దెచ్చును. తెచ్చి యాతిథ్య మిచ్చును. ఆ యిచ్చుటయు నెట్లు! "పోనిమ్ము తినిపోవును. మనకు పుణ్యము, అతనికి తృప్తి" యని గాదు. "సద్భక్తి"తో నిచ్చుట యది. ఇట్టి యీ సత్కారము బుబుసుపోకకు జేయునది గాదు. ఆనాఁడది విధాయకకృత్యము. కాననే—

"అతిథి కడు నల్పుడైన యత్యధికుడైన
నింటి కేతేర ప్రియమందు నెవ్వఁడేని
వాని గౌరవ మది గౌరవంబుగాని
కాదు గౌరవ మాకారగౌరవంబు"

అను శాసనము శ్రీనాథుని వాక్కునుండి వెలువడినది. ప్రవరుఁ డొక్కఁడేకాఁడు, ప్రబంధములలోని ప్రతిగృహస్థు ఈ శాసనము నక్షరముల పాలించినవాఁడే. విష్ణుచిత్తుఁడున్నాఁడు. ఆయన అతిథికార్యనిర్వ

హోమమునందు ప్రవరునికంటె ఏడాకు లెక్కువ చదివిన వాడు. ప్రవరాఖ్యుని పని అతిథుల నిష్టాన్నసంతృప్తులుగ జేయుటయే. ఈ వైష్ణవు వంటలకాదు. భోజనమునకు ముందు స్నానము చేయించుట కగ్గరనుండి శ్రద్ధా కలితుడ, అతిథు లొడలు తోముకొనుట కిప్పపూముద్దలను, అరటిదొన్నెలతో నూనెయు 'సరఫరా' చేయు నీ భాగ్యశాలి. తరువాత భోజనము. ఈవిషయమున భోక్తల లెక్కపెట లేని సౌఖ్యము! శీతకాలములో వారికి పెట్టు భోజనము వేఱు; వేసవియందు భోజనము వేఱు.

"తెలిపులివెచ్చ యోగిరము
తియ్యని చారులు తిమ్మనంబులున్
పలుచని యంబళుల్ చెఱకు
పా లెడపిళ్ల రసావళు ల్ఫలం
బులును సుగంధిశీతజల
ము లవ్వడబిందెలు నీరుచల్లయున్—"
వెలసెడి భోజనము వేసవియందు.
'పుళుగుండావి సవోదనంబు మిరియం
పుంబొళ్లతో జట్టి చు
ట్ట్యమ నాదాలవి కూరగుంపు ముకుమం
ద్రై యేర్చునావం జిగు
ర్కొను పచ్చళ్లను బాయసాన్నములు నూ
రుంగాయలున్ జేసుబు
క్కను నేయుం .. ........"

ఇది శీతకాలపు భోజనము యొక్క 'సరంజామా'. ఇట్లానాటి యతిథులపని స్వర్గమునకు బెత్తె డెత్తుగ నుండెడి దన్నమాట!

ఇక బ్రాహ్మణుల నియమకృత్యముల బరికించ గలిగిన, ప్రవరు డున్నాడు. అతనికి హిమాచలసీమల నుండి యింటికి మరలుటకు దారియు తెన్నును గాన రాలేదు. అతని వంత చూడవలయు నప్పుడు. ఆ చింత యేకాకి నైతినే యని కాదు. ఇల్లు వదలివచ్చితినే యని యంతకంటె గాదు. సకాలమున నిల్లు చేరక పోతినే, విధాయకకృత్యనిర్వహణకు లోటు కలుగునే యని! అగ్నిహోత్రములు, అతిథిసంతర్పణములును ఏమయ్యెనో యని! హవ్యవాహనార్చనకు ముందితర సుఖము లాతనికి మీసాలపై తేనియలు. అన్నలు, అరణులు, దర్భలు ప్రియమైనట్టు లా బ్రాహ్మణున కింకొకటి ప్రియము కాజాలవు.

అయిన నందఱు నట్టివారేనా? ఆ నాడు దుష్పథగాములు లేనేలేరా యందము.

వెనువెంటనే తెనాలివారి నిగమశర్మ మన కన్నులయెదుట నిలువక తీరదు.

అతడు "ప్రాసను విత్తువంటి నెయ్యపాలుకొలంబున" బుట్టినవాడు. అతని తండ్రి "వేదములు వ్రాసిన గాడు." "శాస్త్రములకు పుట్టినయిల్లు." "కళాకలాపములు దాచిన రచ్చ." నిగమశర్మయు కొంచెపువాడు గాడు. ఒకప్పుడు "భూజనసన్మాన్యవిశుద్ధవర్తనుడే" అతడును. "అనూచానసంతతి నవతరిలిన" యుత్తముడు. "సకలనిగమశాఖారహస్యముల" గనినవాడు. రూపమునను "సమగ్రకాంతిమహిమయందు చంద్రునకు పెన్నిద్ది." అయిన నేమాయె? ఇన్ని మంచిగుణముల కొక్కటే యొక్క మజ్జిగచుక్క! అతడు "వాచాలత నుతోక్కుచు"నట! మనస్సును "శాస్త్రీయపురుషార్థమునకె దార్చినవా"డట!

ఇక చూడవలయును వాని వేషాదికములు. తలగడుగంగ మర్దనము, ధౌతపటావరణము, సంస్కృతోజ్జ్వలకలమాన్నము, చందనచర్చలు, ప్రసూనదామకములు, కపురంపు వీడ్యములు ధూపనసంస్కృతులు—ఇవన్నియు నాతని కేపూట కాపూట యమరవలసినవే! అట్టిరసికుడగుట నా బ్రాహ్మణుడు 'ఉషఃన హోమాగ్ని యూదడు. సంధ్యకు ప్రార్థనాంజలి ఘటింపడు. ఆగమవాదము లాగాదనడు. కంబుభృత్పాదోదకములు గ్రోలడు. పుణ్యచిహ్నము లపఘనంబున ఘటింప నేరడు. కాని విటజనులకు దగిన పనులన్నియు జేయును. తాతముత్తాతలు చీమలవలె గూడబెట్టిన విత్తమును కర్చుచేయును. 'దినవెచ్చము' నకై తన మేనగల సొమ్ములును, తన తల్లి వద్ద నున్న పసిండిని కుదువబెట్టును. తండ్రికడ నున్న పత్రములు ముచ్చిలి వచ్చినంత ఋణము నే రాబట్టుకొనజూచును. ఇవి యేవియు సాగనినాడు,

"వలవకు గూటికినై పి
తల వేడంబోడచౌరవశాల్ప సతతు పూ

పులు ముడిచిన యంగళ్ళనె
కలకల పీదెల్ల నవ్వ కట్టెలు—'

మోయును. అట్టి యా దుర్విదగ్ధుడు 'పదను విడిచిన కస్తూరి.' 'ప్రాచియులరు.' 'పాయబారిన కూపు'. 'నీర్వట్టుమడుగు.' ఇంకను 'గళితమణియగు సొమ్ము.' ఇంతియేనా అతడు చేసినది?—తనవారిని నమ్మించి యున్నటు లుండి యింట గల సర్వమును దోచికొన్నాడు. తరువాత తన ప్రాణదాత, తన కాశ్రయమిచ్చి సాకినవాడు నైన ఆ కాపుబిడ్డకు మిత్ర ద్రోహ మాచరించినాడు.

ఇక క్షత్రియులు—ఆనాటి వసుంధర యేకచ్ఛత్రపాలితము గాదు. శక్తికలిగిన ప్రతిక్షత్రియుడును ఇంతో అంతో భూఖండము గలిగినవాడే. దాని కాతడు కిరీట మున్నను లేకున్నను రాజు. దానిపై సర్వాధికారము లాతనివి. ఆ యధికారములకు గాని, తన రాజసమునకు గాని గోరంత కొంత వాటిల్లెనా ఆనాటి పౌరుషధనుడు రక్తపుటేరులు పారించును. ఆ యుద్రేకమునందు, ఆ యావేశమునందు అతనికి ప్రజాసామాన్యపు కడగండ్లు స్ఫురింపవు. వీరుడిక్కిలి యట్లు చేయుట పాపావహ మనియు నాత డనుకొనడు. అది యాతని విధాయకకృత్యము. దానినుండి వెను దీసెనా యిహపరములకు దూరమగును. తోడివారు నవ్వుదురు.—అట్టి మనస్తత్త్వ మానాటి క్షత్రియునిది. అంతటి పౌరుషధనుడు వాడు.

మూర్ధాభిషిక్తుడగు నొక రాజన్యుని దినచర్యను తెలిసికొన నుత్సహింతుమా, దాని సన్నాహ మొక యశ్వమేధము జేసినంత.—రాజుగారు మేల్కనుట వైతాళికకృతగీతములతో. ఇక స్నానాదికముల నిర్వహణ ముండును. అది సులువుగా దొరునది గాదు. ఒక్క తెరశేతుణ హస్తము కేల నూదవలయును. కంచుకి సముచయంబు 'సముఖా' యనవలయును. అప్పుడే అతడు గద్దియ డిగ్గును. అంత నొక భామామణి పసిడి పావలు దొడుగును. తరువాత,

"కేలిగతి మీఱ మజ్జనశాల కరిగి
శాతమన్యవమణిమయాసనమునందు"

విభూషణోత్కరములెల్ల నొయ్యనొయ్యన సడలించు నన్నమాట!

అంత తనూవిలాసలీల జూపుచు నొక చంద్రనిభానన సంపెంగనూనె యంటును. మఱియొక యంగన కోమలలీల "తెలిగొజ్జగినీ రెడ చల్లిచల్లి గంధామలకంబు" పెట్టును. తక్కిన చెలులు హేమకుంభములతో చేతికి జల మందీయ నొక్క లతాంగి "వినిర్మలబాహుమూలరుచుల్వెలి బోలయంగ" జలకమార్చును.—ఇది స్నానఘట్టము. ఇక నలంకరణ. "చంద్రికపూవన్నె జిలుగుదువ్వలువను తడి యొత్తెడి కాంతాలలామ" యొకతె. "కావనోళ్ల నెఱులు సిక్కులువాపి పెంపున శిరసార్చెడి చిగురుబోడి." యొకతె. "నెన్నొల నిగ్గులు వెదజల్లెడి మడుంగు లందిచ్చు పూర్ణేందువదన" యొకతె. "నవరత్నమయభూషణవ్రజంబులు మేన గీలించు గీరవాణి" మఱియొకతె. ఇంకను విరుల సరు లిచ్చెడివారు, చందన మలందువారు, కపురంపుసురటి విసురువారు, నిలువుటద్దము నెదుట నిలిపెడివారు.—ఓ ఒకటేమి, అతని పని మూడుపూవులును ఆరుకాయలును! ఈరంగమున కంతయు మంగళము బాడుదురు "మౌక్తిక విచిత్రనీరాజనము లిచ్చి" మఱికొందఱు చెలంతలు. తరువాత భోజనము గారుత్మతరత్నపాత్రికలలో, సాధారణముగ నాత డొంటరిగనే భుజించును. తక్క తిరిగినా బంధుమిత్రపరివ్రాతసమేతుడును కావచ్చును. బహుభక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యపానీయము లున్నగాని విస్తరి లేవదు. అంతయు నైన తరువాత చేతులు కడిగికొనుట. అందును గూడ విశిష్టతయే.

"వామనేత్రాకరాంచలావర్జ్యమాన
కనకభృంగారకర్కరికాముఖాగ్ర
గళితగంధోదకములతో గడిగి."

కొను నాతడు. పిమ్మట "వడపంపు తొయ్యలి మడిచియిచ్చు తెలనాకుటీకల" నందుకొని "పలుతెఱంగుల పట్టు తలగడబిల్లలు, మవ్వంపుకుంకుమపువ్వు పలుపు గలిగి మెఱుగులు దిక్కులు గడలుకొనగ మించు దంతపు టుయ్యేల" మంచమున హాయిగ నట్టిటు లూగుచుండును. అప్పుడు "సభాగృహసమాగమనార్థులు కొల్వుసేతకై యెప్పటియట్ల యందఱు బహిస్థిన

తులై" యొఱిగించి పంపుదురు.— ఇక నాపాటున రాజుగారు సభాప్రవేశ మొనరించు నన్నమాట! ఆసమయమున వందిమాగధుల జయకీర్తనలు చెలగవలయును; మంగళ నాదములు భోరన మ్రోగవలయును. మధ్యమధ్య నట్టువరాండ్ర నృత్యములు, గాయకగణికావచస్సీధురసములు అన్నియు నమరవలసినదే!—ఇట్టి దానాటి రాజుల దైనందినచర్య. ఇది నిజమా యనిన, అంత వైభవము, అంత యసామాన్యత ప్రతిరాజునకు వచ్చునా యని సందేహింపవలయునే కాని, పేరువోసిన రాయలవంటివారి కది దుస్సాధ్యము కానేరదు.

ఇక నాకాలపు స్త్రీలు! వారికి స్వాతంత్ర్య మున్నది; అస్వాతంత్ర్య మున్నది.

పారిజాతాపహరణనాయిక సత్యభామ. ఆమెది రాజసప్రవృత్తి. పతి యామెకు దైవముగనో కాదో గాని ప్రాణములకన్న ప్రియముగూర్చు చెలికాడనునది స్పష్టము. అతని వియోగమును, విశ్లేషమును సుంతయైన నోర్చుకొనలే దామెమనసు. అట్టియామె యవమానమే చేసెనా ఇక చెప్పవలయు నామెస్థితి! "పతి కడు మీర దప్పెనే కులకాంతల కిక నేమి గతి" యని వాపోయినది. శ్రీకృష్ణుడు తమార్పణ గోరుచు "తత్పదద్వయీ పాటలకాంతిమాళీమణిపంక్తికి?" వన్నె పెట్టునటుల మ్రొక్క నా లతాంతాయుధు కన్నతండ్రి శిరమును తొలగద్రోచినది ఆ ద్రోయుటయు వామపాదమున. ఇది యుచితమా, అనుచితమా యని ఆలోచింపనీయలే దామె రాజసము. వినుడు మిక్కిలి—

"మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మాన మఖిల స
న్మానములకు మూలంబగు
మానరహితమైన బ్రతుకు మానిని కేలా?"

అని మనచే నవు ననిపించుచున్నది. ఎంత గడసరి ఆనాటి స్త్రీమూర్తి! ఆగడుసుదనములోని స్వాతంత్ర్యచ్ఛాయలైనను ఎంత స్నిగ్ధములు!—అప్పటి స్త్రీలందరును సత్యవలె సత్రాజిన్నందినలు కాకపోవచ్చును. విష్ణురూపుడగు శ్రీకృష్ణుని పతిగ పడయకపోవచ్చును. కాని వారును పతిప్రాణైకజీవులై యుందురు. అతని నుండి కించిదవమానమును సహింపలేని యసహనలై యుందురు. తాము పట్టిన పట్టు విడువక సాధించు ప్రౌఢలై యుందురు. తన్నిర్వహణమున నేర్పైన నడ్డంకులు కలిగిన సత్యవలె సరసముగ సమాధానము చెప్పునంతటి యుదాత్తలై యుందురు వారు.

ఇట్లే యింకొక యుద్భుతవ్యక్తి 'నిగమశర్మ అక్కగారు.' అమరమైన యిట్టి శిలచిత్రణమున ధన్యత గాంచినవాడు రామకృష్ణుడు. ఈమె సత్యవలె రాజవంశోద్భూత గాదు. ఆమె కున్న రాజసము లీమెకు లేవు. ప్రాసకు విత్తువంటి నెలపాలుకొలంబున జన్మించిన బ్రాహ్మణి యీమె. గృహకార్యములందు దక్ష. ఏ పని యెప్పు డెటుల చేయవలయునో యెఱిగిన ప్రౌఢ. ఎవ్వరి మనస్తత్వము లెట్టివో తెలియగలుగు నేర్పరి. ఈయమను నిగమశర్మ అక్కగారుగ సూచించినదానికంటె, ఆనాటి బ్రాహ్మణయువతీప్రతినిధిగ, రూపుదాల్చిన చాతుర్యనిధిగ మన హృదయముల నిలచిపోవును. అత్తయింటినుండి వచ్చిన దా బ్రాహ్మణి. ఆ వచ్చుట దుశ్శీలుడగు తమ్ముని శిక్షించుటకు. అంతకుముందు ఆమె చేసిన పని "కొడుకు చెడువడవడికి నడలు కడలింబడి సుడివడియెడి తలిదండ్రుల దీండ్రగల వచనరచనాచమత్కారముల నుదారముదారోపణకరణోపచారంబుల" కొంత వంత దొలగించుట. తరువాత అతిథి సంతర్పణాదికముల నేర్పున బచరింపించినది. పుస్తక భాండాగారమును చోరాగ్ని యాచకాదిప్రమాదముల నుండి రక్షించినది. తరువాత విగళితసన్నాహంబగు గేహంబు యథాపూర్వనిర్వహణమనోహరముగ నను సంధింపించి చదువుసంత సాగించి నడిపించినది—ఇక తమ్మునికడ నామె ప్రవర్తనము. ఈనాటివారలైన అట్టి దుష్ప్రవర్తనుడు కన్నుల బడినంతనే తలవాయ చీవాట్లు పెట్టియుండెడివారు. ఉచితజ్ఞ ఆమె యట్లు చేయలేదు, సరిగదా ఒక్క కరుకుపలుకైన నాడలేదు. ఆదరమున భోజనము పెట్టి తాను దని 'ఇంతలు నంతలు నగు తన సంతానము చంటవెంట సందడిసేయగా' వచ్చి కుశలాశయ యైనది. ఎన్నాళ్ల

నుండియో పరిగ దువ్వక చీదపట్టిన తమ్ముని తలను శుభ్రపరచినది. మెదమన్ను నలచి యలకలు ముడిచినది. నిజపాణిపద్మములు గరగరగా గడిగికొన్నది. ఈ పని యంతయు తమ్మునితో నేమియు పలుకకయే చేయుచున్న దన్నమాట! అతని భావములు తన యెడ నింక స్నేహార్ద్రములై యుండు నన్న నమ్మకము కుదిరిన తరువాత మొదలుపెట్టినది మందలింపు. చెప్పిచెప్పి చివరకు, 'మామకబుద్ధిపద్ధతి నడుపుము నీవు గావలసెనా వారికొస్తుథమైన దచ్చెద' అని ధీరయై పలికినది. అహో! ఎట్టి ఆత్మవిశ్వాస మామెది! భారతీయస్త్రీ జీవనపథమున కాంతులుజిమ్ము అట్టి పవిత్రచరిత్ర లెందఱో అనాడు?

ఇక ప్రవరాఖ్యుని సతీమణి! ఆమె యౌవనమును ప్రవరునకు తూకటుల్ కొలిచి చేసిన సోమిదమ్మగాన యువతియై యుండవలెను. కాని మన మనోనేత్రముల కామె యట్లు గోచరించదు. వేదకాలపు ముసలిము త్తైదువవలె అన్యము పుణ్య మెఱుగని సోమిదేవిగలెమాత్రమే మన మూహించుకొనగల మామెను. తోడి నిగమశర్మ అక్కగారి కున్నంత గడుసుదన మామె ఎఱుగదు. ఉత్తమయిల్లాలు పాపము! కుల కాంత! వేపురు వచ్చినను వండనలయదు. అన్నపూర్ణవు నద్ది యను మాట అతిశయోక్తి గాదు. అట్టి సత్త్వగుణశాంతస్వరూపిణి యామె! ఇట్టివా రెందఱో ఆనాడు?

ఇంతవఱకును స్త్రీల కెక్కడను కట్టుబాట్లు లేవు. వారికి సంఘ మడ్డుకమ్ములు బిగించలేదు. స్వతంత్రులే వారు.

ఇక పరికింతము శ్రీనాథుని కాశీఖండమును. అచ్చటి స్త్రీ కక్కరకుమాలిన నియమములు. కేవల మామె పురుషునిచేతి కీలుబొమ్మ. అట్లు తయారు చేయుట వారి యుద్దేశ్యము గూడను. ఆమె "పతి పిల్వబంచిన పని యేమి యని వచ్చి చెప్పిన యుడిగంబు సేయవలయు." "ప్రకృతిబంధువకైన భర్తయానతి లేక యే పదార్థంబును నీఁగి" చెట్ట. శివిదేశ్వరుడు డించిన యోగిరమును గత్నసేయక భుక్తిగొనవలయును. అనుష్ఠానభంగముల దక్క సుఖసుప్తుడైన నిశేశుని ప్రబోధించరాదు. ఒంటి పెచ్చోటి కరుగుట యుక్తి గాదు. తడుపు గట్టక నీరాడ తగవు గాదు. కడప మీదను మరి సన్నికంటిమీద జక్కిమీదను గూర్చుండ జాడగాదు.

ఇంకను—

"కాంతుడు సంతోషించిన
సంతోషింపంగవలయు సతి కత వాత్మకా
సంతాపించిన పట్టున
సంతాపింపంగవలయు జలజేక్షణకున్."

ఓహోహో! ఏమి ధర్మబోధన మయ్యా యిది! పతియం దనురక్తయైన యే సతికైనను బొట్టును కాటుకయు బెట్టి యీ ధర్మములు నేర్పవలయునా? అనురక్తలు కానివారి కందురా, అట్లు కానివారికి నేర్పిన పట్టుబడునా? భర్తకు ప్రియముగూర్చు భార్యయే యైన భర్త సంతాపించిన నామె సంతాపింపక సంతోషించునా? లేదు, సంతోషించునే యనుడు! అప్పుడు "బొల్లిబొల్లి యేడుపైన నేడువవలయునే తల్లీ!" యని చెప్పుటయా యిది?

ఇక విధవలు!"—యుప్పింఢిరుపవాస" మున్నను నిష్ఠాజపపరాయణలైనను, సన్నుక్తి దేవతార్చనాదికముల నిర్వర్తించినను మగవారికి సరిపోలరట! నిజమే, ఎటుల సరిపోలుదురు లెమ్మని యూరకొందుము. పోనీ, అంతటితోనైన యాగినదా ఆ నిర్భాగ్యజీవిపై సాము!

"జీవముతోడ బాసి యశుచిత్వము నందిన మేన గందతో
యావభృథాభిషేకము సహస్రసమటంబుల నాచరించినం
బావనమౌనె యట్ల పతి బాసి వితంతుత నందినట్టి రా
జీవదళాయతాక్షి యశుచిత్వము వాయదు పేయిభంగులన్."

అని ఆమెను ప్రాణమెడలిన కళేబరముతో బోల్చినారు. "మఱి యా నైచ్యస్థితినుండి యామెకు విముక్తి?" అని యేదయార్ద్రహృదయులైన ప్రశ్నించిరా, ఒకటే జవాబు! అది సహగమనము. ఆ సహగమించుట యెట్లట! నిండుచంద్రుని చంద్రికవోలె, తొలుకరి మెఱుగులు విద్యుల్లేఖయునుబోలె. "నిప్పులలో

బడి ప్రసూతి బాధాకరము గాదటయ్యా!" అని యే వెఱ్ఱి మనిషైన ప్రశ్నించెనా, ఓసి పిచ్చికోమలీ—

"పితికికంత యొకింత లే కఱమి వేక్క-
చిచ్చులక బోవు వికచరాజీవనేత్ర
శక్వమేధంబు ఫలము తథ్యంబు గలుగు."

అని చెప్పి, అప్పటికిని నమ్మదేమో యని "వద పదమ్మన కిది వేదభాషితమ్మ" అని ధ్రువపరచును. అప్పటికి ఆమె వెనుదీయునా—

"ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు
దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి
నాకభువనంబునం దాత్మనాథు గూడి
వెలి పోకింతయు లేక చిచ్చుతీకవేవి"

అని యూరించును. అట్టిది కాబోలు నప్పటి విధవల దురవస్థ.

ఇక స్త్రీల పోట్లాటల చిత్రింపు. ఆనాటి స్త్రీలు పోట్లాటలకు దిగిరా ఇక చెప్పవలయును. నేటి మన వారికంటె వారదే పైచేయి. 'ఓసి పోవే యన్న ఓసి పోవే' యనుచు బుగ్గలుపొడుచుకొనుచు మెటికలు విఱచుకొనుచు రంగమునకు దిగుదురు. ఈ సత్యమును మనోజ్ఞముగ చిత్రించిన అనుభవశాలి పింగళిసూరన. నలకూబరు నెక్కడ ఎగురవైచికొనిపోవునో యని కలభాషిణి సుండై కొట్టుకొనుచు నేయున్నది. సాత్తు తనది కాకపోయినను ఎటుబోయి ఎటువచ్చునో యని "ఎక్కడి దిక్కుమాలిన పిశాచివో" యని శాపే మొదలుపెట్టినది. దానిమీద అసలు రంభ ఎత్తు కొన్నది—'అంత మదింపకువే' యని. కలభాషిణి కేమన వలయునో తోచదు. తప్పు తనదిగదా! కల్మష హృదయు లెట్లు సవాలు పలుకగలరు? ఊరకున్న తన గుట్టు బయటబడునేమో! ఏ దిక్కును తోచక రంభ యన్న మాటలనే ఏకరువుపెట్టసాగినది.

"అంత మదింపకువే యని పలికిన
అంత మదింపకువే యనుచుఁ
రంతుల నేమి ఫలంబని పల్కిన
రంతుల నేమి ఫలం బనుచుఁ
పంతము చూడగదే యని పల్కిన
పంతము చూడగదే యనుచుఁ
గంతు లడంచెద లెమ్మని పల్కిన
గంతు లడంచెద లెమ్మనుచున్."

అంత మనోజ్ఞముగ బోట్లాడుకొందురు వారు.

ఇక స్త్రీలు తమ భర్తల నాదరించు వైఖరి ప్రశంసాపాత్రము. వారు తమ పతులయందు నిత్యము ననురక్తలు. 'దూరము పోయి యెండవడి దూపిలి వచ్చిన ప్రాణనాథునికి ద్వారకవాటదేహళులదాక నెదుర్కొని తీర్థ' మొసగుదురు. ఆహారమును బెట్టుదురు. విహారశయ్యా-సూరువులొత్తి చిత్తమున శుభ్రాన్నసరింతురు. ఇంకను తమ పతులు నిత్యము శోభనపురస్సరులు గావలయు నని వాంఛించి—

"పసుపుం గుంకుమ కజ్జలంబు నునుగూ
ర్పాసంబు తాంబూలముం
గుసుమంబుల్ కబరీభరంబు చెవియా
కుల్ మంగళాలంకృతుల్
విసువాక్కింతయు"—

లేక దాల్తురు. మఱియు భర్తల కాయురభివృద్ధి కరంబు భూషల నేమరక దాల్చుట యని వారి విశ్వాసము. ఈ నమ్మకమును విడువకయే ఏ మెఱుగని గోల సూరవార్యుని సంగాత్రి పాప మన్ని పాట్లు పడినది.

అట్లే పతులు గూడ సతులం దత్యంతప్రియము గలిగినవారు. సత్యభామావిధేయుడు శ్రీకృష్ణుడు, రంభామనోహరుడు నలకూబరుడు నిందులకు సాక్షి. అంత యెందులకు! ఆముక్తమాల్యదయందలి విష్ణుచిత్తుడు మన్మథవికార మెఱుంగని వైష్ణవుడు. అయినను తన భార్య కష్టపడునే యని ఆమెకన్నులకు పొగ తగల కుండ నుండుటకై వానకాలమునకు నారికేళపు టొక్కలు సేకరించి ఎండబెట్టినాడు.

ఆనాటి ప్రజలందఱును భక్తిస్వభావులు. చాలవఱకు రసికులు. అల్పత్వమున కసలు వారిభావమున చోటు లేదు. అట్లనినంతమాత్రమున మానవసహజములైన యార్షాదికములకు వారు లొంగకపోలేదు.—శ్రీనాథుని కాశీఖండమున వింధ్యుని నోట నీ మాట లని పించును కవి.

"తెగువమీఱి ప్రతిజ్ఞ సాధింపదేని
జ్ఞాతిజయ మంద దేని తజ్ఞుడు జనుడె"

అనిన, పట్టు సాధించు కార్యదీక్ష, అన్నమాట నిలబెట్టుకొను పంతము నుండెడివి. ఇక పగబట్టిరా, "శిష్యాదుల వంటక మిందదు, ఇతరవైభవములు పది వేలును మానసము నంటవు"— తనకంటె గొప్పవా డుండెనా "నాకంటె తాను ఘనుడె" అని యాక్రోశించును వారి మనస్సు.

ఇక వివాహాదికార్యకలాపములు. అవి యీనా డెట్లో ఆనాడును అట్లే. మధుపర్కముల నిచ్చుట, కన్యాదానము, వరుని యూరేగింపు, తెలిముత్తి గింజలు, తలబ్రాలు పోయుట, మంగళసూత్రధారణము, చెలుగులు ముడివెట్టుట, ధ్రువవీక్షణ మివన్నియు పాతపాటలే. పెద్దనార్యుని స్వరోచి షని నన్నిటిని చాటించినవాడే. ఈ తతంగమంతయు ముగిసినవెనుక చదివింపుల గోలయు లేకపోలేదు.

ఆనాటి ప్రజలందఱును రసికులు. తదనుగుణముగ వేషాదికముల నమర్చుకొనెడివారు. వారి వస్త్రములు సామాన్యముగ చెంగావిరంగు గలవి. పసిడియంచుల మిసమిసతో చెలలాటలాడు కావిరంగుబట్టను ప్రవరుడు ధరించినాడు. అతని వలయించిన వరూథిని శశికాంతమణిపేటిక కంగదట్టపు కావిరంగుచే నారుణ్య మాపాదించినది.— తెలుపావాడు కోపసూచకమో ఏమో! మారువిగించుకొన్న సత్యను చూచి 'తెలుపేటికి గట్టితి' వని శంకించినాడు గోపాలచక్రవర్తి.

సర్వసామాన్యముగ స్త్రీల కాభరణాదులం దాస్థ మెండు. నిగమశర్మ అక్కగారంతటి అనుభవశాలి-మూర్తిత్వముదాల్చిన గాంభీర్యము తమ్ముడు తన ముక్కర దొంగిలగా "క్రొత్తగా చేయించుకొన్న ముక్కరయే" యని యడలినదట! ఆ అడలుటయు నెట్లు? దుర్వారముగ. అట్లే కాటికి కాళ్లు చాచిన మూడుకాళ్ల ముదుసలి నిగమశర్మతల్లి. తన అత్తగా రిచ్చిన 'హరిసుదర్శనపుపేరు పోయె నయ్యో' అని వనట బొందినది. ఈ విషయమున పురుషులును తక్కువ వారు గారు. వారికిని నగలయందు మోజు గలదు. తమ తమ జాతిసొమ్ములను ఇచ్ఛావిలసనముగ ధరించు రసికులు వారు.

కేశసంపద ఆడువారికివలె మగవారికిని ప్రీతిపాత్రమే. మనుచరిత్రకారుని ప్రవరునకు తెగబారెడు జెంట్రుకలు. విజయవిలాసకర్త అర్జునుని కేశసంపదచే నాక్రమితమైన గంగానది యమునతో గూడిన దానివలె శోభిల్లినదట! నిడువపెన్నెఱిగుంపు జడగట్టగా తపము గైకొన్నాడు సగరు ముమ్మనుమడు. ఇట్టి కేశపాశాభివృద్ధికి కారణ మభ్యంజనము.

ఆనాటి ప్రజల స్నానము లభ్యంజనస్నానములే. దాని సుగుణముల వర్ణించుట కాయుర్వేదమునకు వాక్కు చాలదు.

సుగంధద్రవ్యముల నుపయోగము లా ప్రజల కెక్కుడు. వాని ననేకములను కలిపి కలపములు తయారు చేయుటయం దానాటి ఆంధ్రుడు సిద్ధహస్తుడు. శ్రీనాథుని కృతిభర్త అవచితిప్పయ రెడ్డిరాజు కుమారగిరికై విదేశములనుండి పరిమళద్రవ్యముల గొనివచ్చెడి వాడట!

వారికి గల పుష్పప్రీతియు నెక్కుడే. ప్రతి గృహమువెనుక నొక్కొక యారామము. దానిలో కలకల నవ్వు విరులు. ఈ పుష్పముల నమ్మెడివారు పుష్పలావికలు. శృంగారరసాధిదేవత లన నొప్పును వారిని. ఇంకొకవింత - ఆకాలపు చెంగలువలకు సువాసన యుండెడిదో, లేక ఇదియు కవిసమయమోగాని, వానిని సుగంధయుతము గావించి రామణీయకత గల్పింతురు.

ఇక భోజనాదికములు! అమృతము త్రాగి ఆకలి చెఱుంద తప్పించుకొన్న దేవతలుగూడ 'జిహ్వాతృప్తుల నడెంచుకొనుట' కీ యామెతలను వాంఛింతురట! ఎవరి జాతియన్నము వారికి రుచి. ఆనాటి ఆప్రజలు కాలనియమానుసారముగగాని, వెంగనోటమికైగాని తినినట్లు లేదు. ఆకలివేసినప్పు డారగించు మనస్తత్త్వము వారిది. భోగపరులైన పురుషులు "మామిడికాయలు పండిన మూసెలో గమ్మమనునటుల దిరుగబోసిన చేపలతో భోజనము చేసి త్రేపులు విడువగ, నవి కసరుగ నుండునుగాన నా కసరు గట్టువడుటకుగా శృంగారవనములయందలి యిసుకలో స్థాపించియుండుటవలన శీతలములగు టెంకాయనీళ్లను సంధ్యాకాలములందు

త్రాగుదురు. తాము తిను ఆహారపదార్థములవలన జ్ఞానాభివృద్ధి కలుగునో, లేదో వారికి తెలియును. యామునాచార్యులు రాజయిన తరువాత వైష్ణవధర్మ సర్వస్వమును విస్మరించుటచేసి ఆతని శిష్యుడు తన గురువును ముండ్లముస్తెకూర దినుమనినాడు. దానివలన జ్ఞానము కలుగు నని ఆతని భావన కాబోలు !

ఇక మిగిలినది తాంబూలము. సుగంధద్రవ్యములతో గూడిన తాంబూల మతీర్తిహరమట ! ఇట్టి తాంబూల మానాటి ప్రజలకు మిక్కిలి ప్రియము. అల్లసాని పెద్దన ప్రియదూతికాంగన తెచ్చియిచ్చు కపురంపు విడె మున్నగాని కవనమే రా దనినాడు. మన చరిత్రమున, హిమనగముపై నుంచి మలయమారుతము బర్వ్య వేళ సుగంధముల విసురు చందనవృక్షము లాగుచున్నను, ఆ గంధముల నన్నిటిని తలదన్ని వరూధిని నోటితాంబూలపరిమళము ప్రవరాఖ్యుని పిల్చినదట !

అప్పటి శయ్య లన్నియు హంసతూలికాతల్పములు, లేక చివురాకుసెజ్జలు. ఇది ప్రాబంధికమగు వర్ణనయేగాని, మానవజీవితమున గాన్పించు విషయము కాదేమో ? ఈ చివురాకుసెజ్జలు విరహిణులైన నాయికలు హాయిగా మూర్ఛపోవుటకుమాత్రమే పనికి వచ్చును.

ఇట్టి దానాటి ప్రజల చరిత్ర! వారి దైనందిన జీవితపరిభ్రమణమున మన మనోనేత్రములకు గోచరించు మెఱుగులు ! దీనినిబట్టి వారు మనకంటె విశిష్టులా ? అల్పులా ? హెచ్చా ? లొచ్చా ? ఆ నిర్ణయించు బాధ్యత మనది. అట్టి మహాకార్యనిర్వహణ కుపయోగించు సాహిత్యముమాత్రము లోకారాధ్యము.





ఇంద్రసభలో ఇంద్రాణి—ఎల్లోరా శిల్పము.

# తేజోలహరి

శ్రీ పింగళి లక్ష్మీకాంతం

వికచపంకరుహప్రవేశదోహలమత్తపుష్పంధయముల కామోదభరము
విప్రయోగవ్యథావికలమానసచక్రవాకసుందరికి సౌభాగ్యగరిమ
అస్తంగమితచేతనాంతఃప్రభావదుస్తామసచ్ఛటల కుత్పాతఘటన
నిద్రాతమోవశాంధీభూతనేత్రయుగ్మమ్ములకును స్వప్రకాశమహిమ
వర్ణనాతీతనానాప్రభావదివ్య - ధామసంఘాతమార్తాండనామమహము
సర్వజాంతవజీవరక్షణకుఁ బూని - యదిగో! యుదయించు నుదయధరాగ్రసీమ.

శీతార్తిఁ బాపు సంజీవిగాఁ దొలిగట్టుచఱియందు మొలచు నోషధి యనంగ
ఉభయసంధ్యోపాసనోర్జస్వులకు బ్రాహ్మి చాచిన యభయహస్తం బనంగ
వన్నె మాసిన పద్మవనికి నూతనవర్ణలేపం బొసఁగు తూలిక యనంగ
కారొక్రన్న నిబిడాంధకారపాటనము సేయఁగఁజొచ్చు వజ్రశూలాగ్ర మనఁగ
దినమహాలక్ష్మి కుంకుమతిలకరచన - చేసికొన విశ్వకర్మ సృష్టించినట్టి
కాంచనశలాక యనగ దోతెంచె నదిగో! - తరణితొలికిరణమ్ము, వేదధ్వజమ్ము.

అబ్జసౌభాగ్యాపహరణోద్ధతములైన ధవళాంశుకళల దొడవుల దరిమి
తేజోవిహీనధాత్రీమహాదేవికి లజ్జావకుంఠన ముజ్జగించి
అనునిమేషోన్మిషదరుణిమోద్రేక దేదీప్యమానంబులై తేజరిల్లి
మందేహనామదుర్మదయాతుధానసంహారవీరవిహార మనుమతించి
వాలఖిల్యాది తాపసవ్రతివితతికి - నమృతపారణసంతర్పణము పొనర్చి
అవిగో! సాగుచున్నవి యబ్జహితుని - కరసహస్రము లంతరిక్షమ్మునందు.

# 'తాత విరహంల్లోంచి-'

●

శ్రీ మాచిరాజు దేవీప్రసాద్

౧ శ్రీమాన్ తాతగారి మహాకృతి.
౨ శ్రీమతి మామ్మగారి స్వీకృతి
3 శ్రీమదాంధ్రమహాకృతికి బహూకృతి

అను

త్రైకృతీయమ్, లేక త్రైకృతీయం

౧

రీముకాగితాల మనుచరిత్ర వ్రాసి
వారికై వారె ఊరేగినారు దివికి
బ్రతికి మోయగా కృష్ణరాట్ప్రభువు లేని
కోవతాపార్ద్రికృద్ధనంతావవృద్ధి.

౨

పుష్కరశతజరతాంగికి
కిష్కింధాపురశ్రుతనవకిన్నరగళకున్
శుష్కాంకితవదనాబ్జకు
నిష్కామాంభోధికి తెగనీలుగు పతికిన్.

ఆవిష్కృతకటియానకు
సేవానంసిద్ధవృద్ధసిద్ధాంగనకున్
కేవలదంతవిహీనకు
భావించగ నాదు సొంతభార్యామణికిన్.

అభ్యుదయపరంపరాభివృద్ధిగ నామొన
ర్పంబూనిన... హా ప్రబంధమునకు... ధా క్ర
మం బెట్టిదనిన వగెరా.
అంచు వస్త్యంతముల్ రచియించి వారు
పుచ్చుకొమ్మని అంకిత మిచ్చినారు.

3

శ్రీమహాకావ్యరాజమున్ చించిపెట్టి
సాంద్రసాయంతనారుణసాంధ్యరాగ
రంజిమ వెలార్చు పాత్రాంచలాల బట్టి
పరమశాంతనై దించితి పవ్వగిన్నె.

...ఇవి ఉంచినచోట్లలో - చోటుకు ఒకటి చొప్పున - రెండుఅక్షరములు స్థాలిత్యములు. కారణం: అట్టనుంచి అట్టకు ఒకారెండుచదపురుగ్వులు శైత్రయాత్ర సాగించుచుండగా యీ అక్షరములు మార్గమధ్యమమున నిర్భయముగా నిలుచుండుటయే. వీటిని పహప్రాధికగ్రంథపరిష్కర్త తంజావూరు తేవప్పెరుమాళ్ళయ్య (తం. తే.) గూడ పరిష్కరింపలేకపోయి. ఈ బ్రాకెట్లలోనివి బ్రాకెట్లలోనే చదువవలెనుగాని విడిగా కలిపి వడిగా చదువుట దురన్యాయము.

---

# కృష్ణదేవరాయల దేవేరులు

•

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

గోలకొండసురదుర్గస్థలమందు తురకలపై విజయమును బొందిన పిమ్మట కృష్ణదేవరాయలు కళింగదేశముపై దండయాత్ర బయలువెడలినట్లు రాయవాచకమునను, కృష్ణరాయవిజయమందును జెప్పియున్నది. గజపతి తన కుమార్తెను దనకిచ్చి పరిణయము సేయ నిరాకరించుటవలన గోపించి కళింగముపై కృష్ణరాయలు దండువెడలె నని కొన్ని యైతిహ్యములవలన దెలియుచున్నది; కావున నీ యైతిహ్యముల నిచట సంగ్రహముగ బొందుపఱచి వాని సత్యాసత్యములను బరిశీలించి తెలిసికొని యక్కల కృష్ణరాయల కళింగ జైత్రయాత్రా చరిత్రను వివరించుట యుక్తము.

(౧) కృష్ణరాయలు దాసీపుత్రుం డను నపవాదము గల్గినది; క్షత్రియు లెవ్వరును దమ కూతు నాతని కిచ్చి వివాహముసేయ నొల్లరైరి. తిమ్మరుసు పెక్కైన సత్కులజాతియగు క్షత్రియకన్యను దెచ్చి రాయలకు వివాహముసేయ నిశ్చయించి సేనాపరివృతుడై వినుకొండకు బోయి యచ్చట దమ కరిగాపై రాజ్యము సేయుచుండిన గజపతిని గలిసికొని, తన యుద్దేశము నతని కెఱుకపఱచక, నతనిచే దాను చెప్పినట్లు చేసెద నని మాటగొని, యటుపిమ్మట కృష్ణరాయల కాతని కూతు నిచ్చి యుద్వాహముసేయవలయు నని యాన తిచ్చెను. ఆడినమాట తప్పజాలక యత డందుల కంగీకరించి గృహమునకు వచ్చెను; సమాచారమంతయు విని రాణి కోపించి తక్కువజాతివానికి గూతు నిచ్చుట తగ దని పల్కెను; కాని గజపతి దన మాటచొప్పున నడపెద నని పట్టుబట్టెను; రాణివాస స్త్రీ లందుల కియకొనక కృష్ణరాయలను జంపియైన పెండ్లిని జరుగనీయక నిలిపివేయుటకు నిశ్చయించిరి.

ప్రధానతాంబూలము గొనుటకు తిమ్మరుసు పరివారముతోగూడ పెనుగొండనుండి తరలివచ్చి వినుకొండను జేరెను; అడపగానివలె కృష్ణరాయలతనితో గూడ మారువేషముతో కోటను బ్రవేశించెను; తిమ్మరుసు దమకు రాణిగాబోవు నా కన్యను జూడ గోరెను; గజపతియాజ్ఞపై సర్వాలంకారభూషితయై యామె యచటికి వచ్చినది; చూచినది; అడపగాడే కృష్ణరాయలని గ్రహించినది. వెంటనే లోపలికి బోయి యీ వృత్తాంతము నంతఃపురమందు ప్రకటించినది. కృష్ణరాయలను కోటవెలుపలికి బోనీయక వధించుటకు అంతఃపురస్త్రీజనము ప్రయత్నముసేయగడగిరి; కాని తిమ్మరుసుచే సంరక్షితుడైన కృష్ణరాయలు వారిచేజిక్కునా? గజపతికుమార్తె యంతఃపురము లోనికి బోవ నెప్పుడు వెనుదిరిగెనో యప్పుడే తిమ్మరుసు సామెచిత్తవృత్తిని గ్రహించి రాయలకు గనుసన్న జేసి, యడపమువాడు తాంబూలమున సున్న మెక్కువ వేసినా డను మిషమీద వానిపై నాగ్రహించి తఱుము కొనుచు నంతఃపుర స్త్రీల యాజ్ఞచొప్పున గోట దర్వాజా మూయబడుటకు ముంగే వెలుపలికి బోయెను. కృష్ణరాయల కపాయ మిట్లు తప్పిపోయినది.

లగ్నము నిశ్చయమైనది; కృష్ణరాయ లుద్వాహమునకు రాజధానికి బోయి తిమ్మరుసుసలహాప్రకారము దన బాకును పెండ్లాడబంపెను; సుముహూర్తమున బాకునకు బాషికము గట్టించిరి. పెండ్లి ముగిసినది. గజపతికూతు రత్తవారింటికి కాపురము సేయవచ్చినది; పునస్సంధానమునాటి రాత్రి రాయలను గడతేర్చుటకు నిశ్చయించి కత్తుల మొలనూలు ధరించి పడకటింట బ్రవేశించినది; కృష్ణరాయ లాకాంత కట్టుకొని

యుండిన పావడను దన కాలిర్రేళ్లతో నొడిసిపట్టి చెంతకు జేరదీసెను. కత్తులమొలనూ లూడి క్రిందబడినది. ఆశ్చర్యముతో కృష్ణరాయలు 'అప్పా యేమి చిత్రము' అని యడిగెను. చెంతనే దాగియుండిన తిమ్మరుసు 'జాగ్రతో భయం నాస్తి' యని ధైర్యముజెప్పెను.

అంతట కృష్ణరాయలు దన్ను జంప నుద్యుక్తురాలైన భార్యను విసర్జించి సైన్యముతోగూడ నామెను తండ్రియింటి కంపెను; కాని యామె పుట్టింటికి బోలేదు. తన దుష్కృత్యమునకు బశ్చాత్తాపమంది భర్తయనుమతి వడసి మార్గమధ్యమునం దొక వనమున నివసించుచు భగవద్ధ్యానపరాయణురాలై కాలము గడుపుచుండెను. ఆమెపేరు వరదరాజమ్మ; విశేషధనము వెచ్చపెట్టి కర్నూలుజిల్లాలో కంభముకడ నొక చెఱువును గట్టించెను. ఆమెకే తుక్కాజీ యను నామాంతరము గలదు. ఆమె తుక్కాపంచక మను నైదుశ్లోకములను రచించి కృష్ణరాయల కంపెనట; రాయలందులకు సంతసించి యామెను దన యనుగ్రహమునకు బాత్రురాలిని గావించెనట.

ఇట్టిదే మఱియొక కథ కలదు :—

(ఆ) కృష్ణరాయ లుత్కలదేశముపై దండెత్తి పోయి యా దేశాధిపతిని జయించెను; ఉత్కళరాజు సంధిని గోరెను; కూతు నిచ్చి తన కుద్వాహము గావించిన సంధి కొడబడెద నని కృష్ణరాయలు వర్తమానమంపెను. అతడందు కంగీకరించి వివాహప్రయత్నములు చేయగడగెను; కాని కులహీనుని బెండ్లాడ నొల్లక యా రాజకుమార్తె యతనిని వధించి తానును జచ్చుటకు నిశ్చయించెను. ఆమె మనోనిశ్చయము క్రమక్రమముగ దిమ్మరుసు కెఱుకపడినది. అతడు కృష్ణరాయలకు దెల్పి రాయల సమ్మతిమీద పునస్సంధాన గృహము మంచముపై దేనెతో నింపిన కృష్ణరాయల విగ్రహమును బండబెట్టి, యుత్తరీయమును గప్పి 'రాయలు డస్సి నిద్రించుచున్నాడు. అతని నిదురలేపవల'దని దాసీజనములతో జెప్పెను. అది విని వారెవరి దారిని వారు పోయిరి. అంతట దిమ్మరుసు మంచము క్రింద దాగియుండెను. ఉత్కళేశ్వరుని పుత్రిక పడుకటింట బ్రవేశించినది; మంచముమీద పండబెట్టి యుండిన విగ్రహమే కృష్ణరాయ లని భ్రమించి, చేనున్న చిక్కటారితో నొకపోటు పొడిచినది. ఆపోటుగంటునుండి తేనె పైకెగజిమ్మి యామె నోట గొన్ని బిందువులు పడెను.; తేనెను రక్తమని యెంచి, 'ఈ రాజురక్త మెంత తియ్యగ నున్నది! ఇట్టివాని ననుభవింపజాలక చంపితినిగదా' యని చింతించెనట! అప్పుడు మంచముక్రిందనుండి తిమ్మరుసు వెలువడివచ్చి యామెకు ధైర్యముజెప్పి, ప్రక్కగదిలో రహస్యముగ బరుండియుండిన కృష్ణరాయలను దోడ్కొని వచ్చి వారికి మైత్రి గల్గించెను. ఆయుత్కల రాజకుమార్తె పేరు తిరుమలదేవి. 1

పైగాథలకంటె భిన్నమైనది ఇంకొక కథ కలదు :—

"రాయ లొకనాడు యేనుగుపై నెక్కి నగరమున విహారము సేయుచు నొక భోగకత్తియ (గాండ్లసంగ) ను జూచి మోహించి దానిని తన యంతఃపురమునకు రప్పించి భోగించుచుండెను. ఇట్లుండ నొకతరి రాయలు పట్టపుదేవితో సంభాషించుచు దన భోగకాంత నామెతో సరిగా బోల్చి యేదో ప్రశంసించెను. అందుల కాయమ రోషమూని, 'తెచ్చినది గజపతివారి కుమార్తె కాదు. భోగకాంతయొకదా' అని నిరసనభావము సూచించెను. అది రాజు గ్రహించి పౌరుషావేశము నొంది 'గజపతి పుత్రికను దేజాలనా? తెచ్చెదనుగాక' యని ప్రతిజ్ఞ బలికి మంత్రియగు సాళువతిమ్మరసును బిలిపించి 'పూర్వదిగ్విజయయాత్రకుం బోదలంచితిమి. ముహూర్తము నిశ్చయించి సేనల రావింపు' మనెను...సుముహూర్తమని రాజాన తెలిగించి సేనల గూర్చి తాను సేనానియై దండువెడలించెను."2

పై నుదాహరింపబడిన కథలు మూటిలో మొదటిది ఎంతమాత్రము విశ్వాసపాత్రము గాదు. ఈ కథ

1. చూ. గురుజాడ శ్రీరామమూర్తి 'కవి జీవితములు' పుటలు. ౫౪౮—౫౦౫.

2. కొండవీటిదండకవిలె. చూ. మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ: కొండవీటిసామ్రాజ్యము, పుటలు. ౮౨-౮౩.

ననుసరించి కృష్ణదేవరాయల రాజధాని పెనుగొండ, గజపతిరాజధాని వినుకొండ; మఱియు నతడు కృష్ణదేవరాయలకు గప్పముగట్టు సామంతరాజు; అతని కుమార్తె పేరు వరదరాజమ్మ; ఆమె కంఠముచెఱువు త్రవ్వించినది; తుక్కా యని యామెకు మాఱు పేరు. తుక్కా పంచక మను శ్లోకపంచకము వ్రాసి కృష్ణరాయల కంపినది. ఇం దొక్కటియు నిజము గాదు. కృష్ణదేవరాయల రాజధాని విజయనగరముగాని పెనుగొండ కాదు; వినుకొండ గజపతి సామ్రాజ్యములోని దుర్గమే యైనను అది యతని రాజధాని కాదు; మఱియు కృష్ణరాయలకు గజపతి యరిగాపు కాదు; గజపతికుమార్తె పేరు వరదరాజమ్మ కాదు; వరదరాజమ్మ యను పేరు గల రాణి కృష్ణరాయలకు లేదు; వరదరాజమ్మ యచ్యుతదేవరాయల పట్టమహిషి. ఆమెకు గాని, యప్పటి విజయనగరాంతఃపురస్త్రీలయం దెవ్వరికిగాని తుక్కా యను మాఱుపేరుండె నని తలంచుట కెట్టి యాధారమును గానరాదు. తుక్కాపంచకశ్లోకములు తుక్కా వ్రాసినవి కావు; ప్రాచీనఅలంకారగ్రంథములనుండి కూర్చిన శ్లోకములు. కావున నీకథ సత్యమైనది కాదు; కల్పన. చరిత్రరచన కిది యుపయోగించదు.

రెండవకథ చాలవఱకు సత్యమైనదే. కృష్ణదేవరాయలచే బరాభూతుడైన యుత్కళభూపాలుడు ప్రతాపరుద్రగజపతి. పరాజయమందినపిమ్మట నతడు సంధిగోరినది వాస్తవమే. ఈ యంశములు సమకాలికాంధ్రగ్రంథములందును, న్యూనిజుచరిత్రయందును జేర్కొనబడియున్నవి[3]. గజపతికుమార్తెవివాహవిషయమునుగూర్చి న్యూని జిట్లు వ్రాసియున్నాడు:

"అతని (వీరభద్రుని) తండ్రి (ప్రతాపరుద్రగజపతి) తన కుమారుని మరణవార్తను విని, యతని మరణానంతరము కృష్ణరాయల చెఱయం దింకను బందీకృతురాలైన దన భార్యను చెఱను వదలించుటకు 'దా నేమి చేయవలయునో తెల్పవలయు'నని సాశ్రులతో పత్రము వ్రాసెను; దాని కతడు 'మీ పుత్రికను మా రాజుగారికిచ్చి యుద్వాహము సేయున ట్లేర్పాటు జేసితిరేని, తరువాత మీసతిని విడిచిపెట్టి మీరాష్ట్రమును మీకు మరల నిచ్చివేయుదుము'అని జవాబు వ్రాసెను. ఈ సలహా నతడు (గజపతి) అంగీకరించి, రాయలకు దన కూతునిచ్చి వివాహముసేయుటకు దగిన యేర్పాటులను గావించుటకు దన రాయబారులను విజయనగరమున కంపెను. కృష్ణరాయల కీ వివాహమువలన సంతుష్టి కలిగినది. ఉత్కళేశ్వరునికి కృష్ణరాయల యభిప్రాయము దెలియవచ్చినంతటనే యతడు దన కుమార్తెను రాయలకడ కంపెను. ఆమెరాకతో వారిరువురికి మైత్రి గల్గినది...అంతట కృష్ణరాయ లుత్కళరాజుతో సంధిజేసికొని యాతని కుమార్తెను పెండ్లాడెను."[4]

ఈ వివాహప్రస్తావన యల్లసాని పెద్దనామాత్యుని చాటువులందు గలదు:—

'ఘనతరనిర్ఝరగండపెండెర మిచ్చి కూతు రాయల కొడగూర్చు వాడు' అను సీసపాద మీ వివాహము నుద్దేశించి చెప్పినదే. మఱియు నాదిండ్లగోప మంత్రి తన ప్రబోధచంద్రోదయవ్యాఖ్యయందిట్లే వివాహవిషయమును బ్రస్తావించియున్నాడు :

'ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య
పుత్రీం పవిత్రీకృతభూతధాత్రీం,
ప్రత్యగ్రహీ ద్యః ప్రకటప్రతాపో
భద్రాం సుభద్రామివ పాండవేయః'[5]

అర్వాచీనగ్రంథములను విజయనగరసామ్రాజ్యరాయవాచకకృష్ణరాయవిజయములలో గూడ నీపెండ్లి విషయము గలదు[6]. కావున పూర్వోక్తకథయందలి వృత్తాంత మింతవఱకు సత్యమనుటకు సందేహము లేదు; కాని పునస్సంధానమునాటి రాత్రి కృష్ణరాయల

3. Sources. P. 145.

4. Nuniz (Sewall: Forgotten Empire.) P. 320.

5. Sources P. 145.

6. కాని, న్యూనిజు చెప్పినట్లు విజయనగరమందు కాక గజపతి రాజధానియగు కటకమునందే వివాహమునడచిన ట్లీ గ్రంథములందు కలదు. సమకాలికుడగు న్యూనిజువార్తయే విశ్వాసపాత్ర మని తలచెదను.

నామె పొడిచి చంప బ్రయత్నపడినట్లుగాని, కృత్రిమ ప్రతిమమూలమున దిమ్మరి పాతనికి జావు తప్పించి యవ్వల నాసతీపతులకు సఖ్యము గల్పించినట్లుగాని తెలుపు సాధనాంతరము లెవ్వియు గానరావు; మూలని జాగాని, రాయవాచకకృష్ణరాయవిజయ రచయితలుగాని ఈవిషయము నెఱుగరు. కావున నిది యంతయు ధర్జటివారి కల్పన యని తోచుచున్నది. మఱియు నీకథయందు గజపతికుమార్తె పేరు తిరుమలాంబ యని కలదు. ఇది తప్పు. కృష్ణదేవరాయల పెద్దభార్య పేరు తిరుమలాంబయే; కాని ఆమె గజపతికుమార్తె కాదు. 'భద్రాం సుభద్రామివ పాండవేయః' అను నాదిండ్ల గోపమంత్రి మాటల నాధారము జేసికొని కొందఱామె పేరు 'భద్ర' యని యభిప్రాయపడుచున్నారు. బలరామకృష్ణులతోపాటు సుభద్రయు గజపతుల కిష్టదైవమే యగుటవలన నొకవేళ నామెకా పేరు తలిదండ్రులు పెట్టియుండవచ్చును; కాని నిశ్చయమని తలచుటకు వీలులేదు. ఏలనగా నిచట 'భద్రాం' అను మాటను వ్యక్త్యాత్మకనామధేయముగ గాక 'సుభద్రాం' అను మాటకు విశేషణముగ నన్వయము జేసికొన వచ్చును.

రాయవాచకమునందు గజపతి కుమార్తెపేరు 'జగన్మోహిని'యని చెప్పియున్నది. 'గనక గజపతివారు తమ కొమార్తెఅయిన జగన్మోహిని అనే కన్యకను దారపోసి యిచ్చే సమయాన,'అని7. కుమారధూర్జటి తన కృష్ణరాయవిజయమును రాయవాచకము ననుసరించి రచియించినను, గజపతి కుమార్తెపేరు జగన్మోహినియని చెప్పలేదు; తుక్కాయని వక్కాణించినాడు.

"అమ్మ కర్ణాటసింహాసనాధ్యు డగుచు
నెలగు శ్రీకృష్ణరాయల కిట్టనట్టి
మాదృశాశ్రితజనులు నీమహిమ నుతులు
సేయ వర్ధిల్లుమని పల్కె జెలువమిగుల.
అల తుక్కారమణీమణి
జలజాస్యలు వెంటగొల్వ జనకుని యాజ్ఞన్
నెలయగ నంతఃపురికిన్
విలసితగతి నరిగె నపుడు వేడుక మీఱన్8."

క్రీ. శ. ౧౫౭౫ వ సం॥నకో, యించుక తరువాతనో రచియింపబడిన విజయనగరసామ్రాజ్యమున కృష్ణదేవరాయలు 'గజపతిమీదికి దండుయెత్తి తర్లిపోయి గజపతికుమార్తె లక్ష్మీదేవమ్మవారిని హవాలా చేసుకొని, విజయనగరమునకు మరలివచ్చినట్లు చెప్పియున్నది9. ఈ గ్రంథముల సాక్ష్యమునుబట్టి గజపతి కుమార్తె వాస్తవనామ మెద్దియో తెలియరాకపోయినను తిరుమలాంబమాత్రము గాదని విస్పష్టమగుచున్నది. కృష్ణరాయలు పెండ్లాడిన గజపతికుమార్తెయొక్క వాస్తవనామధేయము లక్ష్మీదేవి యగునేమో యను సంశయము గల్గుచున్నది. ఆముక్తమాల్యదపీఠికయందలి,

"తూరిమి కృష్ణరాయనృప
కుంజర చేరి కళింగరాజ్య ల
క్ష్మీరమణీలలామ నిను
మిన్నులుముట్టిన మోహనాలతో
గారణమట్ల లక్ష్మి గను
గందని వేడుక కృష్ణరాయనిం
జేరునకాక, వావిసెడ
జెందుని పోదరుడైన రుద్రునిన్."

అను పద్యములోని 'లక్ష్మికనుగందని వేడుక గృష్ణరాయనిం జేరునకాక' అను వాక్యమున రాయలు పెండ్లాడిన గజపతికుమార్తెపేరు లక్ష్మీదేవి యని సూచన కలదని తలచెదను. కాని ఈ యూహ నిర్బాధకముగాదు. 'వావిసెడ సోదరుడైన రుద్రునిన్' అను మాటలవలన లక్ష్మికి సోదరుడు రుద్రుడని విదితమగుచున్నది. వాస్తవముగ కృష్ణరాయ లుద్వాహము జేసికొన్న గజపతికూతురి పేరులక్ష్మియే యైనచో 'రుద్రు'డనుమాటకు వ్యాఖ్యాతలందఱివలె 'ప్రతాపరుద్రు'డని యర్థము చెప్పక 'వీరభద్రు'డని చెప్పవలెను. ఈ సందర్భమున గమనింపవలసిన ముఖ్యవిషయ మొకటి కలదు. కృష్ణరాయల దండయాత్రకు పూర్వమే 'కళింగరాజ్యలక్ష్మీరమణీలలామ' ప్రతాపరుద్రగజపతిని గూడియుండెను. వ్యాఖ్యాతలు

7. రాయవాచకము, పుట. ౧౦౮.

8. కృ. రా. విజయము. ౪ : ౩౪-౫.

9. *Further Sources. II No. 123.*

చెప్పినట్లు 'రుద్రుడు' ప్రతాపరుద్రుడను పేరి యాపె యప్పటికి వానిపెడ వారిని గూడి చిరకాలము భోగించు చుండెను. ఇక నప్పుడు వాని పెడనీయక కృష్ణ రాయని గూడె ననుటయం దేమి సారస్యము గలదు? వీరభద్రు డప్పటి కింకను రాజు గాలేదు; ప్రతాపరుద్రుని యనంతరము రాజ్య మతనికి జెందవలసి యుండెను; కాని రాజ్యము నతని కెందనీయక కృష్ణరాయలు జయించెను. తత్కారణమున లక్ష్మి వానిపెడనీక కృష్ణరాయని గూడినది. కావున పద్యములోని 'రుద్ర' శబ్దమునకు 'వీరభద్ర' యని యర్థము చెప్పుకొనుట యుక్త మని తలచెదను.

ఇక మిగిలియుండునది గాండ్లసంగకథ. సంగ పేరు వినుకొండ దండకవిలె యందు తప్ప మఱియెచ్చటను గానరాదు; కాని కృష్ణరాయలకు ప్రియురాలు భోగకాంత యొక్కతె యుండెనని రుజువుసేయు ప్రబలమైనవి సమకాలికాధారములుగలవు. ఆకాలమున విజయనగరమునకు వచ్చియుండిన పోర్చుగీసువర్తకుడగు డోమింగో పయసు రాయల భార్యల వృత్తాంతము నిట్లు వర్ణించియున్నాడు:—

"ఈ రాజునకు ధర్మపత్నులు పన్నిద్దఱు గలరు; అందు ముఖ్యలు ముగ్గురు......ముఖ్యభార్యలయం దొక్కతె యుత్కలరాజపుత్రిక; మఱియొక్కతె యీరాజుసామంతులలో నొక్కడగు శ్రీరంగపట్టణ ప్రభువుకుమారిత; ఇంకొక్క భార్య వేశ్య: రాజ్యమునకు రాకముందాతని కామె యుంపుడుకత్తెగ నుండినది; రాజైనపక్షమున దన్ను భార్యగ జేకొందునని యతనిచే వాగ్దానము గొన్నది; ఈరీతిగ వేశ్యయొక్కతె రాజమహిషియగుట సంభవించినది. ఆమెయందు గల యనురాగాతిశయముచే నత డామె పేర నొక పట్టణము గట్టించెను10."

నూనిజుచరిత్రయం దీ భోగకాంతవిషయ మింకను విపులముగ వర్ణింపబడియున్నది:

"ఈ కృష్ణరాయలు పసివాడుగ విజయనగరమున పెరుగుచుండిన కాలమున జిన్నాదేవి యను వేశ్యతో నతనికిదగులాటము గలిగి యామెయం దత్యంతానురక్తుడైయుండెను; ఆమెయెడ నతనికి గల ప్రేమాతిశయముచే దానే రాజగుపక్షమున నామెను దప్పక పెండ్లిచేసికొందు నని పెక్కుమారులు వాగ్దానముజేసెను. పరియాచకమున కట్లతడు చెప్పినను దరువాత నది నిజమాయెనని చరిత్ర వలన దెలియవచ్చుచున్నది. ఎట్లన, సింహాసన మధిష్ఠించినపిమ్మట పసితనమం దాసక్తిగొనియుండిన వ్యాపారములన్నిటిని నతడు విడనాడినను, ఆమెమీది వలపును మఱవజాలడాయెను; కావున రహస్యముగ రాజమందిరమును విడిచి యామెయింటికి బోవువాడు. ఒకరాత్రి యీ రహస్యమును అతని మంత్రియగు సాలువ తిమ్మయ కనుగొనెను; ఆ భోగకాంత యిలు సేరువఱకును నతని వెంబడించి పోయి, యతని కది తగదని బుద్ధి చెప్పి మరల రాజమందిరమునకు గొనిపోయెను. అపుడు రాజు దానా కాంతపై నెంత గాఢముగ మరులుగొని యున్నదియు నతనికి దెలిపి, తానామెను వివాహముజేసికొందునని వాగ్దానముజేసితి ననియు, దానిచ్చిన మాట నెట్లైన నెఱవేర్ప నిశ్చయించితిననియు జెప్పెను. అంతట మంత్రి రాజుయొక్క పట్టుదలను గాంచి యతని యిష్టప్రకారము నడచు కొన నీయకొని యేలినవారి కపనింద రానీయక దానాకార్యమును నిర్వహింతునని పల్కెను. అట్లు చేయుట కతడు రాయల కొఱకు, నరసింగదేశరాజకుటుంబమునకు జెందిన సౌందర్యవతియగు కన్య నొక్కతెను వెదకి తెచ్చి పెండ్లిచేసి, వివాహకార్యములన్నియు ముగిసినపిమ్మట, భోగకాంతను దోడ్కొనివచ్చి యామెతోగూడ నొక్క సౌధమునందే కాపురము సేర్చి, యా సౌధముపై నున్నతమైన గోపురమును గట్టించి యందా భోగకాంతకు నివాస మేర్పఱచెను. తరువాత......కృష్ణరాయలు నలుగురు భార్యలను పెండ్లాడెను; కాని వారందఱికంటెను నతని కామెపై మక్కువ యెక్కువ11."

సమకాలిక పోర్చుగీసురచనలవలన గాండ్లసంగ కథ చాలవఱకు సత్యమైనదని తేలుచున్నది. రాయలు భోగకాంతను మోహించుట వాస్తవము; రాజమంది

10. *Sewell: Forgotien Empire.* p 247-8.

*11. Nuniz, See Sewell Forgotten Empire, PP 362-3.*

రమునకు దెచ్చి యామె కచట నివాసమేర్పఱచుట వాస్తవము. అటు తరువాతి విషయము సత్యమని వేఱుగ జెప్పవలసిన యావశ్యకత లేదుకదా. కాని యొక భేదము గలదు. కథయందలి భోగకాంత పేరు సంగ; పోర్చుగీసురచనలలోని భోగకాంత పేరు చిన్నాదేవి. ఈభేదమునకు సమన్వయమెట్లు? రాయలను పెండ్లాడుటకు బూర్వము ఆమెపేరు సంగయై యుండవచ్చును; రాజమహిషియైన పిమ్మట చిన్నాదేవి యని పేరును మార్చుకొనియుండవచ్చును. ఇట్టి మార్పు లింకను జరుగుచున్నవి; కావున సంగయే చిన్నాదేవి కావచ్చును.

సంగకథయందు గమనింపవగిన విశేష మొకటి కలదు. కృష్ణరాయలు సంగను ప్రశంసించినందులకు గినిసి పట్టమహిషి, 'తెచ్చినది గజపతివారి కుమార్తె కాదు. భోగకాంతయొకదా' యని యెత్తిపొడిచినదట. గజపతి కుమార్తె యనవేల? మఱియొక రాజపుత్రికను పేర్కొనరాదా? గజపతికూతును పేర్కొనుటకు గారణము లేక పోలేదు. గజపతి విజయనగరరాయలకు బద్ధశత్రువు; బలసంపదలయందు సమానుడు; రాయరాజ్యములోని భాగములను జయించి స్వాధీనపఱచుకొన్నవాడు; వాలైదుతరముల విజయనగరప్రభువు లాతనితో బోఱియు విజయులు కాజాలరైరి. ఇంతకు మించిన విశేష మింకొకటి కలదు. ఆ పట్టమహిషి నరసింగదేవాధీశ్వరుల యింటి యాడబడుచు; పూర్వము గజపతి పురుషోత్తముడు దక్షిణదిగ్విజయార్థము వచ్చియుండి నప్పుడు వారి యింటి యాడబడుచు నొక్కతెను—సాళువనరసింగరాయలకుమార్తెనే యేమొ—బలాత్కారముగ గొనిపోయి వివాహమాడియుండెను. తనపుట్టింటి వారి దగు వజ్రసింహాసనముపై గూర్చునియుండు కృష్ణరాయలు గజపతికుమార్తెను బలాత్కారముగ దెచ్చి పెండ్లాడి పాతనూడును దీర్చుకొన్న మురియవచ్చును; కాని భోగకాంతను—వెల కమ్ముడుబోవుదానిని—దెచ్చినందున కింతగ నుప్పొంగవలయునా? యని యామె భావము. ఆ మాటలకు నొచ్చి కృష్ణరాయలు కళింగ దిగ్విజయార్థము వెడలుట సంగతమే.

పైనుదాహరించిన కథలవల్లను, సమకాలిక పోర్చుగీసు రచనలవల్లను కృష్ణరాయలకు తిరుమలదేవీ చిన్నాదేవు లనుభార్య లిరువు రుండిరని తెల్లమగుచున్నది. మఱియు గళింగ దిగ్విజయయాత్ర ప్రారంభమగునప్పటికి కృష్ణరాయలు కృతిగొన్న యాంధ్రప్రబంధము లీ యంశమును స్థిరపఱచుచున్నవి:

మనుచరిత్రయందు—

"తిరుమలదేవీచరణో
దరలాక్షాకల్పకల్పితస్థలకమల
స్ఫురదిందీవరబంధుర
హరిహయమణిమలయకూటహర్మ్యవిహారీ12."

పారిజాతాపహరణమునందు—

"శ్రీ వేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
జీవితనాయకకవితా
ప్రావీణ్యఫణీశ కృష్ణరాయమహీశా13."

అని తిరుమలదేవీ చిన్నాదేవులు పేర్కొనబడి యున్నారు. కృష్ణరాయల కపఖ్యాతి రానీయక సాళువతిమ్మయ నరసింగనృపాలుర యింట బుట్టిన కన్యకను—తిరుమలదేవిని—దెచ్చి యతని కుద్వాహము గావించినను 'నతడు చిన్నాదేవినే తన, పట్టమహిషిగ గ్రహించిన ట్లున్నది. ఈ విషయ మీక్రింది మనుచరిత్రయందలి పద్యమువల్లను, శాసనములవల్లను దెల్లమగుచున్నది.

"అవిభు నవంతరంబ ధ
రావలయము దాల్చె కృష్ణరాయడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునా దనకు గూర్చు దేవేరులుగా14."

---

12. మను. 3 : ౧౪3. వావిళ్లవారి ముద్రిత ప్రతియందు 'వలయకూట'యని యున్నది. వ్యాఖ్యాత "వలయ=చంద్రుని, కూటహర్మ్య=యంత్రాల మేడ యందు, విహారీ=విహరించువాడా"యని యర్థము వ్రాసి యున్నాడు. 'మలయకూట'మని యుండవలయును. ఆ హర్మ్యము పేరు 'మలయకూటము.' నందితిమ్మన గూడ ఈ సౌధమును పేర్కొనియున్నాడు. 'మలయకూట ప్రాసాదనివేశ' పారి. ౨ : ౧.

18. పారి : ౪ : ౧.

14. మను. ౧ : 33

ఇందు పెద్దన మొదట చిన్నాదేవిని, యటు వెనుక తిరుమలదేవిని చేర్కొనియున్నాడు; ఇందు వలన జిన్నాదేవియే పట్టమహిషి యని యూహ పొడముచున్నది. శాసనములందుకూడ నిట్లే మొదట చిన్నాదేవియు దరువాత తిరుమలదేవియు, చేర్కొనబడియున్నారు.

"శ్రీకృష్ణరాయమహారాయలు విజయనగరాన నుండి పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి......కృష్ణవేణ్యాతీరమందు అమరేశ్వరదేవుని సన్నిధిని తులాపురుషమహాదానమును శాయ నవధరించి తమ దేవుళ్లు చిన్నాజీదేవమ్మ తిరుమలదేవమ్మగారిచేతను మహాదానాలు శేయించ నవధరించి......15."

"శ్రీ కృష్ణదేవమహారాయలు విజయనగరాన నుండి పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి......కృష్ణవేణ్యాతీరమందు అమరేశ్వరదేవుని సన్నిధిని తులాపురుషమహాదానం శేయ నవధరించి తమ దేవులు చిన్నాదేవమ్మచేతను రత్నధేను మహాదానమున్ను తిరుమలదేవి అమ్మవారిచేతను సప్తసాగర మహాదానమున్ను సేయించ నవధరించి...16"

ఈ శాసనవాక్యములవల్ల చిన్నాదేవియే కృష్ణదేవరాయల పట్టపురాణి యను నూహ బలపడుచున్నది; కాని కాలక్రమమున చిన్నాదేవి గతించినది. మనుచరిత్ర పారిజాతాపహరణములు రెంటియందు నామె చేర్కొనబడియున్నను, ఆముక్తమాల్యదయం దామె ప్రస్తావము గానరాదు. అప్పటి కామె స్వర్గవాసిని యైనది. ఆవల తిరుమలదేవి పట్టపురాణి యాయె. ఆముక్తమాల్యదయందలి—

"ఆవిభువనంతరంబ ధ
రావలయము బూని తీవు రహిపై దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియు గమలాబ్జముఖులు దేవేరులుగాఁ 17."

అను పద్యమువలన విదితమగుచున్నది. ఇది మనుచరిత్రనుండి గైకొన్న పద్యమే. రచయిత పెద్దనయే; సందర్భము ననుసరించి మార్చి వ్రాసినాడు. చిన్నాదేవి గతించిపోయినది. అందుచే నామెమాట యెత్తలేదు. ఇందు తిరుమలదేవిని మొదట చేర్కొనియుండుట వలన నామె యప్పుడు పట్టపురాణి యాయెనని యూహ కలుగుచున్నది. తిరుమలదేవితోగూడ చేర్కొనబడియుండు నన్నపూర్ణాదేవీకమలాబ్జముఖుల వృత్తాంతము దెలియదు. నూనిజు చెప్పిన రాయల నలుగురు ధర్మపత్నులలో వీరిద్ద ఱనుటకు సంశయ మంద బనిలేదు. వీరిద్దఱిలో గజపతి కుమార్తె యొక్కర్తుక. ఆమెయెవ్వరు? అన్నపూర్ణాదేవియా, లేక కమలాబ్జముఖియా? నిర్ధారించి చెప్పుటకు వీలులేదు; కాని విజయనగర సామ్రాజ్యమున నామె పేరు లక్ష్మీదేవి యని యుండుటచే గమలాబ్జముఖియే గజపతికుమార్తె కావలయును. కృష్ణరాయవిజయమందలి 'తుక్కా' వ్రాయసగాండ్రు ప్రసాదించిన పేరని తలచెదను. 'లక్కా' (లక్ష్మీ) యనునది సరియైన రూపమైయుండవచ్చును. అగునేని కృష్ణరాయలు పెండ్లాడిన గజపతికుమార్తె పేరు 'లక్ష్మీదేవి' యని యంగీకరింపవచ్చును.

---

15. *Tirupati Devasthanam Inscriptions. Vol. III., No. 76.*

16. *South Indian Inscriptions, Vol. VI. No. 248.*

17. ఆముక్త. ౧ : ౩౩.



తిరుచానూరులోని పద్మావతీ దేవాలయము, కొలను.

# వీణావాసవదత్త

[నాటిక]

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

## ౧-వ రంగము

[స్థలం : కౌశాంబీనగరం. శ్రీఉదయనమహారాజరాజభవనం. ప్రాగ్భాగంలో మహామంత్రికార్యాలయం. యౌగంధరాయణమంత్రి ఒక రత్నకంబళంమీద పట్టుదిండ్లు ఆనుకొని తీవ్రాలోచనలో మునిగిఉంటాడు.

వెనుక రాజభవనంలోనుంచి సన్నని వీణాగానం. దాని మంద్రమధ్యమతారకాలవల్ల మంత్రి ఆలోచనల నిమ్నోన్నతాలు స్ఫురిస్తూఉంటాయి.

రాజభవనంవైపు ద్వారపాలిక విజయ నిలుచుని ఉంటుంది. ఒక భృత్యుడు ఆజ్ఞకోసం చేతులుకట్టుకొని ఉంటాడు.

వీణాధ్వని క్రమంగా హెచ్చి పాటగా సాగుతుంది. మహామంత్రి హఠాత్తుగ లేచి పచారుచేస్తూ—]

యౌగం : ఏమి? ఈ వీణాధ్వని. ఏమి! ఈ సంగీతప్రభావం! సంపంగిపూల మత్తువాసనలాగు ఈ గానం నా ఆలోచనలను ఒక్క శ్రవణేంద్రియంలోకి లాగి పారవశ్యం పుట్టిస్తున్నది. సంకులరాజకార్యాల్లో నిత్యము ఘూర్ణిల్లే నా మెదడు కరిగి సంగీతంపై ప్రవహిస్తున్నది.

కనకనే ఉదయనప్రభువు ఈ కళలను ఎంత చేరదీస్తే నే నంత దూరంచేస్తాను. అట్టి రసికప్రభువులకు తప్ప మావంటి నిరంతరరాజ్యభారవాహులకు ఈకళల ఆనందానుభూతి పనికిరాదు కాబోలు. (బిగ్గరగా) విజయా—విజయా!

(ప్రవేశం విజయ)

వి : ఏమి సెలవు?

యౌ : (నిలిచి) ఎక్కడినుంచి ఈ వీణానాదం?

వి : శ్రీ ఉదయనప్రభువు రచించిన కొత్తగీతాలను అంతఃపురగాయనులు సాధన చేస్తున్నారు. ప్రభువు వేటనుంచి తిరిగివచ్చేసరికి వీణలో వినిపించవలెనని వారి ఆజ్ఞ.

యౌ : ఓహో! అట్లానా? మంచిది. ప్రస్తుతం కొంతసేపు ఆపవలసిందని...

వి : మహామంత్రివారి ఆజ్ఞగా...

యౌ : కాదు కోరికగా చెప్పు.

వి : (నిష్క్రమణం)

(వీణాధ్వని టక్కున ఆగుతుంది)

యౌ : (మళ్లా ఆలోచిస్తూ) సేసే......... స్వయంగా...... వేణువనానికి ఒక అక్షౌహిణిసేనతో వెడితే... ఊహుం... పనికిరాదు. ఈ వక్రస్థితిలో రాజధానిని విడిచిపెట్టడానికి వీల్లేదు. ప్రభువుతో కుశలబుద్ధి మంత్రి రుమణ్వంతు డున్నాడుగదా—ఇపుడు కర్తవ్యం... ఒకటే—పరరాజకుతంత్రం సూచిస్తూ లేఖ వ్రాసి అతిత్వరితంగా ఒక వార్తాహరుణ్ణి మహారాజువద్దకు పరుగు పెట్టిస్తే...(పైకి) పాలకా—పాలకా!

(ప్రవేశం పాలకుడు)

పాల : ఏమి ఆజ్ఞ దేవా.

యౌ : ఇదిగో ఈ ఉత్తరం తీసికొని వెళ్లగలిగినంత వేగంగా సత్తాన్ని పరిగత్తించి ప్రభువు వేణువనాన్ని దాటకుండా... ఉండు ఎవరో తొందరగా వస్తున్నట్టున్నది!

పా : (నిదానించి చూచి) చిత్తం. ప్రభువువారితో వేణువనానికి వెళ్ళిన హంసకుడు...

యౌ : హంసకుడా—ఏమి! హంసకుడా. సరే నీవు వెళ్లు.

(పాలకుడు నిష్క్రమణం)

యౌ : హంసకా! వేణువనంనుంచేనా? రా లోపలికి. కుశలమేగదా ప్రభువువారికి?

హం : చిత్తము. మహారాజులుంగారు—(పెద్ద నిట్టూర్పు) క్షేమంగానే ఉన్నారు. ఇంతవరకు—

యౌ : (ఆందోళన కనబడనీయకుండ) ఇంత వరకా ! ఏమిమాట అది ! పిచ్చిమాట—యౌగంధ రాయణమంత్రిప్రాణము లున్నంతవరకు ప్రభువు పట్ల అకుశలవార్త పుట్టవలెనా ? సరేలే—నేను తలచి కొందరపడుతున్నట్లుగానే వేటలో శత్రుకుతంత్రం పారిం దన్నమాట. కానీ—వివరాలు చెప్పు. అయితే మేధావంతుడు రుమణ్వంతు డేమైనాడు ? వెళ్లిన రాణువంతా గొడ్డుపోయిందా ?

హం : ఏమి చెప్పను దేవా, మన సైన్యమంతా ప్రభువువారికి శాసటగా ఉంటే ఈకీడు పుట్టి ఉండునా ? అంతా ఒక చిత్రకథలా జరిగిపోయింది.

యౌ : ఏమిటి...వెళ్లిన సైన్యం. రుమణ్వంతుడు ప్రభువును విడిచిపెట్టినారా ? వివేకశీలి ప్రభువుమాత్రం ఎట్లా ఒంటరిగా శత్రుహస్తగతులైనారు ?

హం : దేవా, నిన్న ఉదయం ప్రొద్దు పొడవ కుండానే మహారాజులుంగారు పరిజనాన్ని సైన్యాన్ని వేణువనంలోనే విడిచి, చిన్నసైన్యముతో మంత్రి గారితో నాగవనానికి బయలుదేరారు. జాముప్రొద్దు ఎక్కేసరికి నాగవనమధ్యానికి చేరాము. అక్కడ కను చూపుమేరలో సాలవృక్షాల గుబురులో ఒక యేనుగు గుంపు—దానితోపాటు గోళ్లు, దంతాలు తప్ప శరీర మంతా నల్లని ఒక విచిత్రగజము కనపడ్డాయి.

యౌ : (అసహ్యంగా) కనబడ్డదీ ! మన దుర దృష్టమూర్తి ?

హం : (ఆశ్చర్యంతో) ఆ ఏనుగుసంగతి తమ కెట్లా తెలుసు ?

యౌ : (విసుగుగా) తెలుసునోయీ—తెలుసు. ఈవశ్కాలవిపర్యాసంతో నాఎదుర్కొడ్డిన తంత్రం విఫలం ఐంది. కాని మహారత్నాన్ని మింగిన మీనువలె హానేసుడు శ్రీ ఉదయనప్రభువును ఎన్నాళ్లు దాచ గలడో చూస్తాను. ఊఁ తరవాత ?

హం : అంతే, వెంటనే ప్రభువువారు పట్టలేని ఉత్సాహంతో ముందడుగు వేసి "ఘోషవతిని" చేబట్టి "సుందరపాటలాన్ని" ఎక్కి మమ్మల్ని ఉన్నచోటే ఉండమని సుత్రాన్ని దూకించారు. చిన్న మంత్రిగారు 'వద్దు ప్రభూ' అని ఘోషించినా వినక ఇరవైమంది సైనికులనుమాత్రం వెంటదీసుకుని ఆయేనుగును సమీ పించబోయారు. వెంట నేనూ వెళ్లాను.

యౌ : (గంభీరంగా) ఏనుగు కాదు— వత్స రాజ్యముధూమకేతువు—

హం : చిత్తం తమ మాట అక్షరాలా నిజం అయింది. ప్రభువు సుత్రం దిగి 'ఘోషవతిని' అద్భు తంగా వాయిస్తూ ఆ కపటహస్తిని సమీపించేసరికి దాని పొట్టను పగుల్చుకొని వందమంది సైనికులు ఆయుధా లతో ప్రభువును చుట్టుముట్టారు.

యౌ : (ఆత్రంగా) మీరంతా చూస్తూ నిలుచు న్నారా ?

హం : లేదు మహామంత్రీ ! సరిగ్గా అదేసమ యానికి పులిమీద పుట్రలాగు ఒక బొబ్బరింత విన పడ్డది. దానితో సిగ్గులేనిసైనికులు భీరువులై పరు గెత్తారు. నేను నిర్జీవంగా ముందువెనుకలకు కదలలేక రాపడి నిల్చున్నాను. నేను కటారి సర్దుకుని ముందుకు దుమికేసరికి అప్పటికే దురితాత్ములు చెల్లతీగలతో ప్రభువుభుజములను విరిచికట్టి...

యౌ : (బాధగా) అబ్బా—అవు—వత్సరాజ మహామంత్రి జీవించే— యీ మాటలు వింటున్నాడా !

సాధుజనవందవాదిక సాధకములు,
భరతవంశ-చిరఖ్యాతిపాలకములు,
సఖసమాగమసుఖపరిష్వంగదములు,
వత్సరాడ్బాహువుల కేయవస్థ కలిగె !

హం : ఆ దుష్టులు రాక్షసులవలె శ్రీవారిని కటికిరాసేల నడిపించుకొని తీసుకువెళ్ళుతుండగా, మహాసేనమంత్రి సాలంకాయనుడు, ఎదురువచ్చి సైనికు లను మందలించి కట్లు విప్పించి ప్రభువువారిని ఒక పల్లకిపై కూర్చుండబెట్టి ఉజ్జయినికి కొనిపొండని ఆజ్ఞాపించాడు.

యౌ : (ఖేదంగా) అభిమానధనులు శ్రీఉదయ

నులు ఆ అమానుషకృత్యానికి ఎంత ఖిన్నులైనా రోకదా! ఏమి దుర్విధి!

హం: మహారాజులుంగారు గంభీరముద్ర వహించి వాకనులలో తడి చూచి ఇట్లా అన్నారు. హంసకా, పురుషలక్షణం అధైర్యం కాదు. మాసంగతి యౌగంధరాయణ...

యౌ: సందేహించకు. ప్రభువువారన్నమాట గదా.

హం: మహామంత్రితో చెప్పు. అని

యౌ: వద్దు. యిక ఏమీ చెప్పనక్కరలేదు—

"ఇనుడు పశ్చిమదిశ నుదయింపలేదు;
తెగిన హారమ్ములోని ముత్తెములరీతి
తారకావళి నేలపై జారలేదు;
వత్సరాజన్య వరులకు పట్టువడునె?"

హంసకా! నీవు వెళ్లు.

(హంసకుడు నిష్క్రమణ)

(ప్రవేశం విజయ)

వి: దేవా! నిన్నరాత్రి శ్రీరాజమాతకు ఏదో పీడకల వచ్చిందట, ఆమె ప్రభువునారికి ఏదో కీడు శంకిస్తూ వ్యాకులపడుతున్నారు. ఈవిషయం తమతో మనవిచేసి రమ్మన్నారు.

యౌ: (బరువుగా నవ్వుతూ) విజయా, మాతృశ్రీవారి దుఃస్వప్నానికి తగిన మూలం లేకపోలేదు. మేఘం లేని పిడుగు నేటికి వత్సరాజ్యంమీద పడ్డది. దాన్ని నేను పిడికిట పట్టబోతున్నాను. అని అమ్మగారితో మనవిచెయ్యి.

వి: అంతా అగమ్యంగా ఉంది దేవా. ఏమని చెప్పను?

యౌ: నీవు తెలవు కావు. గ్రహించు (చెవిలో ఏమో చెప్పి) ఇక కొలదికాలంలో మాతృమూర్తిదర్శనానికి నేనే వస్తున్నానని చెప్పు.

వి: చిత్తము. (నిష్క్రమణ)

యౌ: ఇప్పుడు నాకర్తవ్య మేమిటి? మహాసేన రాహుగ్రస్తుడైన మా రాజచంద్రుణ్ణి విడిపించడానికి—

(రాజమార్గంలో కలకలం)

"ఓహో రాజపురుషులారా! పట్టుకోండి. పట్టుకోండి. ఎవడో పిచ్చివాడు నాకు రాజదర్శనం కావాలని కోటలోపలికి తోసికొనివస్తున్నాడు. మహారాజులుంగారికి, అతనికి స్నేహమట!"

యౌ: ఓహోహో—ఏమిస్ఫురణ! వత్సరాజ్య మహాధురంధరయౌగంధరాయణప్రధానమంత్రికి నేటికి ఉన్మత్తుడు ఉపదేష్ట అయినాడా?

(విజయ తిరిగి ప్రవేశించి)

వి: దేవా, రాజమాత తమతో ఇట్లా మనవిచేయమన్నారు—నాయనా, నీవే నా పెద్దకుమారుడవనుకున్నాను. ఆపదలో చిక్కిన తమ్ముణ్ణి ఎట్లా విడిపిస్తావో నీదే భారం.

యౌ: (ఆవేశంతో లేచి)

"ఒక అకాలాన రాహుదంష్ట్రికలలోన
పడిన యమృతాంశు బోలిన వత్సవిభుని
శత్రునేత్రాంతముల మసిజల్లి తేర
నైతినేని యౌగంధరాయణుడ గాను."

..................

ఒకసారి రాజమాతదర్శనం చేసి ఆమెకు ఊరట పలికి అచిరకాలంలో కర్తవ్యోన్ముఖుణ్ణి కావలె. ఊఁ...విజయా, అమ్మగారి దర్శనార్థం వస్తున్నానని చెప్పు.

వి: చిత్తం. (నిష్క్రమణ)

౨ వ రంగము

(ఉజ్జయిని, ప్రద్యోతరాజభవనం-ఉద్యానంలో ఒక చంద్రశిలావేదికమీద మహాసేనరాజపుత్రి వాసవదత్త, చెలికత్తె కలహంసి కూర్చునిఉంటారు. ఎదుట ఒక నిర్మలసరోవరం. దానిలో మొగ్గలుగా కొన్ని విచ్చినవి కొన్ని తామరలు, కలువలు. వాటిమధ్య చిత్రంగా కూస్తూ దూరదూరంగా రెండుబాతులు ఈదుతున్నాయి.)

వాసవదత్త: హంసీ! చూడుచూడు, ఆ మొగ

బాతు ఆటేమకంలో తామరతంపరలో చిక్కుకుంది. ఎంత విదల్చినా కాలికి చుట్టుకొన్న తామర తూడు పాపము వదలటం లేదు. అక్కడనుంచి కదల లేక తామరాకుచాటున తన జంటతో దాగుడుమూత లాడుకున్నది.

కలహంసి : అమ్మా! మంచిపని జరిగింది. లేక పోతే ఆ మొగబాతుకా అక్కడ నిల్చునా?

వాస : ఓసి నీహృదయం ఎంతకఠినమే—

కల : కాదమ్మా. ఒకప్పుడు కాఠిన్యంలోంచే అనుకోని మంచి ఫలితాలు కలుగుతూఉంటాయి. గ్రీష్మ రాజు కరకుమనస్సులోనుంచి ఎన్ని మధురచూతఫలాలు ఉద్భవిస్తున్నాయో చూడడంలేదా! శ్రీ ఉదయన ప్రభువును పట్టి బందీచేసిన మీతండ్రి మహాసేనమహా రాజులుంగారి హృదయంలో ఏ కోమలభావం యిమిడి ఉందో ఎవరికి తెలుసు?

వాస : (కొంటెగా నవ్వుతూ) నీకు తెలుసు ఒక ప్రపంచాన్ని యింకో ప్రపంచంలోకి మార్చడం. సరేగాని వీణాచార్యులు శ్రీ ఉదయనప్రభువు ఇంకా ఎందుచేతనో రాలేదు.

కల : (నవ్వుతూ) అమ్మా! మీ కిటీవల ఎంత సంగీతకళాభిరుచి యేర్పడ్డది! మీ మనస్సులోని రాగ వాహిని వీణతీగల్లో ప్రతిధ్వనించడానికి ఎంత తొందర పడుతున్నదోగదా!

వాస : (ప్రణయకోపంతో) మనస్సులో ఏదో పెట్టుకు మాట్లాడుతున్నావులే. నీ కుటిలవ్యాఖ్యానాలు యిక చాలించు—

కల : (గంభీరంగా) రాజకుమారీ! నా దగ్గరనా దాపరికం? ఈ వీణాభ్యాసకాలంలోని మీ వికాసాన్ని నేను కనిపెట్టడంలేదనుకుంటున్నారా? ఆ నల్లని కళ్లలోని క్రొత్తకాంతిని, నున్నని చెక్కిళ్ల మీద విరిసే రాగరేఖలను ఎవరిదగ్గర దాస్తారు?

వాస : అబ్బా, పోవే! గాలిలో కవిత్వం అల్లు తావు—

కల : అదుగో ఉదయనులు వస్తున్నారు. నేను కాశికకు ఫలహారము, పానీయం పెట్టడం మరచి వచ్చాను. మళ్లా వస్తానమ్మా; మీ వీణలో క్రొత్త రాగాలు ఫలించుగాక. (నవ్వుతూ వెళ్లిపోతుంది)

(ఉదయనుడు ప్రవేశం)

వాస : (లేచి) నమస్తే.

ఉద : కల్యాణమస్తు. రాజకుమారీ! ఏదీ వీణ తియ్యి. ఆఁ...శృతి కొంచెం హెచ్చించు. వ్రేళ్లను కొంచెం వదులుగా మృదులంగా పారించు. జయంత శ్రీరాగం—

వాస : (వీణ వందుకొని మధురంగా పలికిస్తూ ఉంటుంది)

ఉద : (గీతం)

"ఏపువ్వు పూసినా ఏపాట పాడినా
ఎందుకో ఈ హృదయ మింత కళవళపడును...
నీలాల నింగిలో పూలవెన్నెలమేడ
పైని జాబిలిరాజు పకపకా నవ్వితే
ఈ హృదయ మెందుకో ఇంత కళవళపడును."

వాస : (పైఉదయనగీతాన్ని పరవశంగా అద్భుతంగా వీణలో వాయిస్తుంది.)

ఉద : ఓహో...వాసవా! నీచేత ఇట్టి మధుర గానం పలికించడానికే దేవతలు నా కీగాంధర్వవిద్య ప్రసాదించారేమో. ఏదీ అట్లాగే ఆ నీలికళ్లను బరువుగా అరమోడ్పుగా వాల్చుతూ...చిరునవ్వుతో దీపశిఖలవంటి వ్రేళ్లతో తంత్రులను మీటుతూ ఏ గంధర్వ లోకంనుంచో హఠాత్తుగ దిగివచ్చిన అప్సరఃకన్యలా, భూపావతిని పలికించు.

వాస : (హఠాత్తుగా తీగలు విడచి ఉదయన ముఖసౌందర్యం చూస్తూ వీణావాద్యం మరిచిపోతుంది)

ఉద : (నవ్వుతూ ఆశ్చర్యంగా) రాజకుమారీ! అదేమిటి, నీవు తీగలమీద మీటటంలేదు. వట్టి గాలిలో వ్రేళ్లు కదుపుతూ పరధ్యానంగా నావైపు చూస్తున్నావు!

వాస : (సిగ్గుపడుతూ) నేను చెప్పలేను. మీ సన్నిధానంలో ఇక నేను సంగీతం పలికించలేనేమో.

ఈపాటలకు, మాటలకు అందనిది, నామనస్సును దేహాన్ని ఏదో చెప్పలేని మాధుర్యంతో నింపి బలంగా తనవైపు ఆకర్షించేది ఏదో భావం నన్ను పరవశను చేస్తున్నది. ఎప్పుడూ పాడుతూన్నట్టు ఉండే మీ కళ్లను, పెదవులను ఏకాగ్రంగా చూడనివ్వండి. నాకీపాటలు వద్దు.

ఉద : రాజపుత్రీ! పిచ్చిదానవై పోకు. నన్ను ఈ నీచమైన చెరలోనుంచి అనుకోని ఆనందసీమలకు ఎత్తేది నీ సంగీతమేగదా. నీవు నాతోను, నేను నీతోను చెప్పలేని, వివరించలేని స్నేహదాహాన్ని, బాధామాధుర్యాన్ని తన దివ్యగానంతో వ్యాఖ్యానించి ఉభయులను ఒక వృంతమునకు తెచ్చినది ఈ మాతృమూర్తి "ఘోషవతి" కాదా? లే...ఒక్కసారి ఘోషవతి నారాధించు.

వాస : (మళ్లా వీణను చరిచేసి తన్మయంగా)

(గీతం)

ఈ జీవితపు వీణ నీవె పలికింపుమా
నిలువునిలువున కరగి వలపుపాటై విరియ. ఈ॥
తీయతీయని కలగ, తీగతీగను సాగయు
పాట కొనగోటితో, మీటి మేల్కొల్పుతూ. ఈ॥
పలుకరించే వీణ, పులకరించే వీణ
నీబాహువల్లిపై, నిశ్వసించే వీణ. ఈ॥

(వీథిలో ఒక పిచ్చివాని పాట)

ఉద : (హఠాత్తుగ లేచి) రాజకుమారీ! ఒకసారి ఆపు. ఇప్పుడే వస్తాను. ఆ పిచ్చివాడు పాడినప్పుడల్లా దగ్గరగా వినవలెనని ఉంటుంది. (తన కారాగారభవనంవైపు వెళ్లి పోతాడు)

(గీతం)

లేమి విడిచి తరివచ్చె తరలిరావోయీ
తమ్మిపూచెరలోని తుమ్మెదలరాజా!
మధుపాయి, నీ కింత మమత తగదోయి
విధియాన నీవింక వెడలిపోవోయి!

(ఒక అజ్ఞాతపురుషుడు రహస్యంగా కారాగారభవనపు గవాక్షంవద్దకు వచ్చి)

పురు : ప్రభూ! ఈ పిచ్చి వేషంతో ఇంకెంతో కాలం ఇక్కడ ఉండడానికి వీలులేదని మహామంత్రి తెలిపిచ్చారు. అంతా సిద్ధమైంది. కౌముదీవిహారపు మిషతో తమరు రాజకుమారితో సరస్తీరానికి రాగానే అంచెలమీద కౌశాంబికి......(నిష్క్రమణ)

ఉద : సరే! ఈ కారాగారవాసం నేటితో ముగిసిం దన్నమాట. రాజపుత్రి గాంధర్వవ్యాజంలో పూర్తిగా చేజిక్కింది. (తిరిగి వాసవదత్తదగ్గరకు వచ్చి) రాజపుత్రీ! తరుగులేని ఈ కారావాసంలో విసువు పుడుతున్నది. శరదిందుచంద్రికాసుందరమైన నేటి రాత్రి సరస్తీరాన నీతో గాంధర్వోపాసన చేయవలెనని ఉంది. జనకులవద్ద లాలనగా అనుజ్ఞ బడసి ఒక్కసారి నాతో రాగలవా?

వాస: ప్రభూ, మీ అధీనరాలైన నన్నింతగా కోరవలెనా! కాని తండ్రిగారి పేరు చండమహాసేను లని మీరు మరచిపోకూడదు. కాని, మీవద్ద గజహృదయం నేర్చుకొనే నెపంతో తప్పకుండా రావడానికి ప్రయత్నిస్తాను.

ఉద : (సంతోషంతో) జనకులకు నీయందున్న వాత్సల్యం దేనినైనా సాధించగలదని నాకు తెలుసు. ఇక సందేహించకు.

వాస : (నవ్వుతూ) మీమాట నాపాలిటి వేద వాక్యంకదా!

3 వ రంగం

(ఉజ్జయినీపట్టణరాజవీథి—సంకెలలతో బంధింపబడిన యౌగంధరాయణమంత్రిని తీసుకొని వస్తూ ఇద్దరు రాజభటులు.)

౧ రాజభ : తప్పుకోండి. తప్పుకోండి. ఈయన వత్సరాజమంత్రి యౌగంధరాయణులు. మహాసేనమహారాజులుంగారు బందీగా పట్టుకొన్న ఉదయనప్రభువును కుట్రపన్ని రాజకుమారి వాసవదత్తాదేవితోకూడ కౌశాంబికి పంపివేసినందువల్ల రాజద్రోహనేరానికి ఈయనను పట్టుకొని తీసుకొనిపడుతున్నాము.

౨ రాజభ : ఏమి అట్లా చూస్తారు! ఉజ్జయినీ ప్రజలు, వెర్రివాళ్లల్లా. తప్పుకోండి.

యౌగం: (ప్రవేశము)

సెరగుపడుచు నన్ను—వీక్షించు నజ్జయి
నీపురసులార, నిలిచి వినుడు!
రాజభక్తి జేసి ప్రాణమ్ము నోడుదు
నరసి మంత్రిపదవి నందుకొనుడు.

(రాజపురుషునితో) ఏమయ్యా, మన మిప్పు డెక్కడికి పోవలసిఉంది?

రాజపు: శ్రీ భరతరోహకమహామంత్రి మిమ్ములను ఆయుధాగారంలో బంధించిఉంచమన్నారు. వారు వచ్చి స్వయంగా మీతో మాటలాడవలసిఉన్న దట. ఇదే ఆయుధమందిరం. మహామంత్రులు వస్తున్నారు.

యౌ: (నవ్వి) భరతరోహకుడు ఎంత అమాయకుడు!

ఉదయనప్రభు పేరింటి ఉగ్రవహ్ని
పట్టి బంధింపదలచిన ప్రముఖు లపుడె
కనుమలపి నిద్రపోవగా జవదు గాని
రత్నము హరింప పెట్టెకా? రక్షణమ్ము.

భరతరోహకుడు: (ప్రవేశించి హేళనగా) వత్సరాజమహామంత్రులకు స్వాగతం.

యౌ: (గంభీరంగా) ఓహో......భరతరోహకులా! నమస్తే.

భరత: ఇంతవరకు యౌగంధరాయణు లనే అక్షరాలే విన్నాం. ఇప్పుడు ప్రత్యక్షంగా చూడగలిగి నందుకు చాలా సంతోషం.

యౌ: ఇదేమిటి నే ననవలసిన మాట మీరంటున్నారు? కాని ఈ రక్తసిక్తశరీరంతో, గాయపడ్డ అవయవాలతో మిమ్ములను చూడవలసివచ్చినందుకు మాత్రం కొంచెం సంకోచపడుతున్నాను.

భరత: మిత్రమా! మా ప్రభువుపట్ల నయవంచన చేసిన మీ యెడల చూపవలసినంత కాఠిన్యము మేము చూపలేదనుకుంటాను.

యౌ: ఓహో...నయవంచన? మహామంత్రులు ఏమి వింతగా శెలవిచ్చారు! నాగవనంలో సాల వృక్షాలమధ్య లోహగజాన్ని స్థాపించడం, మా ఉదయన ప్రభువీణావ్యసనాన్ని అవకాశంగా తీసుకొని కారడవిలో బంధించడం రాజకీయపరిభాషలో ఏమని చెప్పవలసిఉన్నదో కదా! సుహృన్మణీ! మీరు ముందు తీసిన త్రోవనే మేం మనుసరించాము.

(భటుడు ప్రవేశం)

భ: మహామంత్రీ! జయము. శ్రీప్రద్యోతన మహారాజులుంగారు యౌగంధరాయణమంత్రులను చూడడానికి స్వయంగా వేంచేస్తున్నారు.

భరత: ఓహో...మంచిది.

(మహాసేనుడు ప్రవేశం)

మహా: (కట్లల్లో ఉన్న యౌగంధరాయణుని చూచి ఆశ్చర్యంగా) ఏమిరా, ఎంత అపచారం చేశారు! వెంటనే ఈయనకట్లు విప్పండి.

యౌ: మహారాజా......అపరాధియెడల మీరు చూపే గౌరవం ఈ గాయాలకంటె ఎక్కువ బాధ పెడుతున్నది.

మహా: (నవ్వి) మహామంత్రీ! మీ ప్రభుభక్తి ఎంతైనా ప్రశంసింపతగ్గది. మీ సామర్థ్యసాహసాల వల్ల ఉభయరాజకులములకు నిరంతరాభ్యుదయం ఏర్పడుగాక. శుభముహూర్తము సమీపిస్తున్నది. ఈ పట్టువస్త్రములు ధరించి సువర్ణాక్షతలు తీసుకొని మా భవనప్రాంగణానికి దయచేయండి.

యౌ: (ఆశ్చర్యంగా) మహారాజా! ఏమిటిది? ఎందుకోసం అపరాధి కీ బహూకరణం?

మహా: శ్రీవత్సరాజును నేను రాజ్యలోభంచేత బంధించలేదు. ఆయనతో బంధుత్వం చిరకాలంనించి అభిలషిస్తున్నాను. కాని మీ ప్రభువు మహాభిమాని; సులభసాధ్యుడు కాలేదు. కనుక మాయయేనుగుమిషతో పట్టుకోవలసివచ్చింది. వాసవదత్తావత్సరాజుల రాగానుబంధంకోసం వీణాభ్యాసం కల్పించాను. అచిరకాలంలో పరిణయోత్సవం మహావైభవంతో నెరవేర్చి పంపదలచాను. కాని సామనస్యంకంటె వారి అనురాగవేగమే ముందడుగు వేసింది. అయినను వాసవదత్తామాత అంగారవతీదేవిసంతుష్టికోసం వాసవదత్తావత్సరాజుల చిత్రపటాలకు వివాహమహోత్సవం చేయబోతున్నాము. దయచేసి వధూవరుల నాశీర్వదించండి.

యౌ: (ఆనందంతో) మహారాజా! మీ గంభీరమూర్తిలో ఎంత వాత్సల్యనవనీతం దాగిఉన్నది! మేము మీయెడల చేసిన అపచారములకు నిజంగా లజ్జపడుతున్నాము. "శుభస్య శీఘ్రం" పదండి......
(అందరు నిష్క్రమణం) స్వస్తి

(భాసమహాకవి 'ప్రతిజ్ఞాయౌగంధరాయణము' ననుసరించి)

# ఆత్మకథ

శ్రీ పంతుల శ్రీరామశాస్త్రి

ఈ కథ రాసేముందు 'ఆత్మహత్య' అని పేరుపెట్టి, లౌకికదృష్టిలో ఆపని జరగందే ఆపేరు పెట్టడం సబబుకాదేమో నని ఆత్మకథగా మార్చేను. అసలు ఆనాటిరాత్రి నేను ఆత్మహత్య చేసుకోనేందుకు చేసిన ఆలోచనలన్నీ అన్నీ కావు. అప్పుడు నాకు స్ఫురించిన విధానాల్లో ఏవిధంగల్ల ప్రాణం పోగొట్టుకొని ఉన్నా నా కిది రాయవలసిన అవసరం పట్టేది కాదు. అంటే చచ్చిపోయిన మనిషి మరి రాసే దేమిటి అంటారేమో? నా ఉద్దేశం అది కాదు. అలా జరిగిఉండేటట్లయితే నేను ఎంతో గొప్పపని చేసినట్లుగా నన్ను తెలిసినవాళ్లందరూ చెప్పుకొని ఉండరు. అంతేకాక ఏ కవికుమారుడో, నాటకరచయితో నాయెడల తనకు కలిగిన సానుభూతికి చిహ్నంగా ఒక ఖండకావ్యమో, నాటికో రాసి ఉండేవారు— 'త్యాగశ్రీ' అనో, 'త్యాగగరిమ' అనో పేరుపెట్టి. కాని తీరా నేను ఆత్మహత్య చేసుకోక పోవడంవల్ల ఆ అవకాశంఏమో పోయింది. కాని, నేను చేసినది వట్టి సామాన్యమయిన పనిగానే లోకందృష్టిలో ఉన్నా, (అసలు అదీ ఒకపనిగా గుర్తించనివాళ్లుకూడా ఉన్నారు) అందులోనూ త్యాగంచెయ్యడం అనేటటువంటిది కొంత ఉందని నామనస్సు కొంత పీకుతూండడంచేత, దానిని లోకానికి తెలియజేసి నాబరువు వదిలించుకోవాలనే ఉద్దేశంతో నేనే కలంపట్టుకొన్నాను.

నా పేరు శకుంతల. మాతల్లిదండ్రులకి కలిగిన నలుగురు ఆడపిల్లలసంతానంలోనూ నేనే ఆఖరుదానిని. మాముగ్గురు అక్కలూ నాకంటే చాలా పెద్దవాళ్లు. వాళ్లలో వాళ్లకి ఒకటిరెండేళ్లకంటె భేదం లేదుగాని, నాకూ మా చిన్నక్కయ్యకీ, పదకొండేళ్ల వార ఉంది వయస్సులో. అంటే వాళ్లంతా పెళ్లిళ్లయి, తమతమ సంసారాలు దిద్దుకొంటూ, తమ పిల్లల పెళ్లిళ్లగురించి కూడా ఆలోచనలు చేసేకాలంలో, ఇంట్లో పెళ్లి కాకుండా చిన్నపిల్లగా ఉండేదాన్ని నేనొక్కతెనే. మా పెద్దక్కయ్య తన సంసారం పెద్దదవడంవల్ల ఎప్పుడో కాని వచ్చేది కాదు. మూడవఅక్కయ్యను వాళ్ల అత్తవారు ఏడాదికి ఒకమారు పంపి, ఒక్క పది రోజులుమాత్రమే ఉంచేవారు. ఇక, రెండవ అక్కయ్యమాత్రమే ఏడాదికి ఒకటిరెండుమార్లు రావడం, ఒకనెల రెండునెలలు ఉంటూఉండడం జరిగేది. ముఖ్యంగా వేసవికాలం రెండునెలలూ మాబావకీ (ఆయనస్కూలుమాస్టరు), పిల్లలకీకూడా సెలవులవడం మూలాన, కుటుంబాన్ని పుట్టింట్లో విడిచి ఆయన ఏవేవో చరిత్రాత్మకప్రదేశాలనీ, దేవాలయాలనీ, స్నేహితులనికలియడానికనీ తిరుగుతూఉండేవారు. ఈవిధంగా మా రెండవఅక్కయ్యతో నాకు కొంచెం ఎక్కువ కలయిక ఉండేదిగాని, తక్కినవాళ్లంటే ఏదో ఎప్పుడో వచ్చివెళ్లే బంధువులను చూసినట్లే ఉండేది. కాగా, మొత్తం ఏడాదిలో ఇంటిదగ్గర ఉండే చిన్నపిల్లను నేనొక్కతెనే—

నాపన్నెండవఏట మానాన్న ఒకానొక ఎలిమెంటరీస్కూలు హెడ్మాస్టరుపనినుండి రిటైరయేరు.

అప్పటినుండీ, ఇంట్లో నాపెళ్లి విషయించిన మాటలు అడపాదడపా వినిపిస్తూనేఉండేవి. నాకు పెళ్లిచేసి, నన్ను ఒక ఇంటిదాన్ని చేస్తే మా అమ్మకూ నాన్నకూ మరేవిచారం ఉండదన్నది వాటి సారాంశం.

అయితే ఈవిధమయిన మాటలు ఇంట్లో అప్పటి నుండీ సుమారు ఒకేపద్ధతిని నాపదిహేడవసంవత్సరం వరకూ జరుగుతూనే ఉండేవి.

మొట్టమొదటిలో తెలియకపోయినా, క్రమంగా కొన్నాళ్లకి నాకు మావాళ్ల మాటలలోని ముఖ్యమయిన లోపం తెలియడమూ, అవి వినడంఅంటే ఒకవిధమయిన చికాకు ఏర్పడడమూ సంభవించింది. అవి వాళ్లలో వాళ్లు అనుకునేమాటలే కానియ్యండి, నాకు సంబంధించినవిఅయి, నా చెవులలో పడుతూంటే మాత్రం చాలా అరుచిగా ఉండేది. సంగతి ఏమిటీ అంటే మాఅమ్మ, నాన్నా అన్నిటికంటే ముఖ్యమయిన డబ్బు అన్నదానినిగూర్చి ఆలోచనలేకుండా, తక్కిన చిల్లరచిల్లరవిషయాలే అతిప్రధానమయినవి అన్నట్లుగా చర్చిస్తూఉండేవారు.

ఎవరో ఫలానాఅబ్బాయి ఉన్నా డనుకోండి, అతనికి ఇవ్వవలసిన కనీసపుకట్నం ఇంత అని తెలుస్తూఉండి, ఆ కనీసపుకట్నంకూడా మనం ఇచ్చుకోలేమన్నది నిర్వివాదాంశమయినా, ఏవేవో కబుర్లు ఆ అబ్బాయిశరీరపురంగు గురించి, తెలివితేటల గురించి, చేయడానికి వీలున్న ఉద్యోగాలగురించి, వాళ్ల కుటుంబస్థితిగతులనూ సంప్రదాయాలనూ గురించి, వాళ్ల ఇంట్లో ఉన్న ముసలమ్మలు ఇంటికి రాబోయే కొత్తకోడలిమీద చలాయించే అధికారం గురించీ అలా రోజులతరబడీని, చివరకు ఆఅబ్బాయి పెళ్లి ఎక్కడో నిశ్చయం అయేపర్యంతం చర్చిస్తూ ఉండడంమాత్రం నాకు నిజంగా చాలా బాధగా ఉండేది.

ఈబాధ నేను చదువు మానేసినప్పటినుండీ మరీ ఎక్కువయిం దనిపిస్తుంది. ఊళ్లో మిడిల్‌స్కూలుండడమూ, జీతం కట్టక్కరలేకపోవడమూ ఈ రెండు కారణాలవల్లా, నా చిన్నతనపుఏట మూడవఫారమ్ పాసయేవరకూ నిర్విచారంగానే గడిచి పోయింది—చేయవలసిన ఒక నిశ్చయమయిన పని అంటూ ఉండడంచేత. ఆతరవాత నేను ఎల్లప్పుడూ ఇంటిదగ్గర ఉండడంవల్లనే కాదు, మావాళ్లు నాపెళ్లిగురించి పడే ఆతృత మరీ ఎక్కువయి, రోజల్లా అవేమాటలు అడుతూండడంవల్ల వాటిమూలంగా నాకు కలిగే తలనొప్పి మరీ విపరీతమయిపోయింది.

మాఅమ్మకీ నాన్నకీ తక్కిన చిన్నచిన్న సంగతులలో ఐక్యం కుదరకపోయినా, నాపెళ్లికిసంబంధించిన కాలక్షేపపు కబుర్లలోమాత్రం అద్భుతంగా పొత్తు కుదిరేది. ఒకరు ఒకమాట మొదలుపెట్టి సగం చెప్పే సరికల్లా రెండవవారు జంటకవులు శతావధానం చేసినట్టు, అది అక్కడ అందుకొని పూర్తిచేయడం జరిగేది. ఇల్లా అస్తమానం తమలోతాము ఏదో చర్చించుకోడంతో గడిపితే నేనంతగా చికాకుపడకపోయి ఉందును. మధ్యమధ్యను అనవసరంగా కేవలం నా ఒక్కతె ఇష్టమే తరవాయి అయి తక్కిన అన్ని సంగతులూ నిశ్చయమయిపోయినట్లుగా నన్ను సలహో చేస్తూఉండేవారు. ఎందుకు, నన్నడగక్కర్లే దంటే ఊరుకొంటారా? ఏవేవో కారణాలు చెప్పితీరవలసిందే. పోనీ అంతతో ఆగినా బాగుండును. ఒక్కొక్కప్పుడు ఏకో ఎల్లాగూ జరగనిదానికి ఏకారణమయితే నేమి అన్నట్లుగా నేను ఇంట్లో చెప్పిన ఏదోకారణాన్ని పట్టుకొని మా అమ్మ నలుగురిలోనూ ప్రగల్భంగా చెప్పేది: 'మా శకుంతలమ్మకి ఫలానాఅబ్బాయి ఆయాకారణాలవల్ల నచ్చలేదు' అని. కేవలం నా నచ్చకపోవడంవల్లనే పెళ్లి ఆగిపోయినట్లుగా మాట్లాడేది. కాని లోకం మరీ అమాయికమయినదీ, చిన్నచిన్న కారణాలు ఊహించలేనిదీ కాదుకదా! అసలుసంగతిగూర్చి తమలోతాము గుసగుసలు చెప్పుకొని నవ్వుకొంటూఉండేవారు. ఒక్కొక్కప్పుడు నన్నూ నిలవేసి అడుగుతూండేవారు ఇరుగు పొరుగులవారు—"ఏమిటి శకుంతలా సంగతి?" అని. ఇంతకంటే బాధ మరేముంటుంది! నాకు అందుబాటులో లేనివాటిని నేను నచ్చలేదనడంకంటె నవ్వులాటకు పాత్రమయిన సంగతి మరేముంటుంది. నిజంగానే నచ్చకపోయినా అమాట చెప్పడానికి నాకు హక్కు లేదు అనిపించేది.

ఇల్లా ఒక రెండున్నరసంవత్సరాలు గడిచేయి. నాకు పదిహేడవఏడు నడుస్తోంది.

వాళ్ళంటె ఒక ఏడాదిన్నర చిన్నదయినా, కమలతో ఉన్న స్నేహం నాకు మరెవ్వరితోనూ లేదు. నాలాగే వాళ్ల ఇంట్లోనూ అదొక్కతే చిన్నపిల్ల. కాని, భేదం ఎక్కడుందీ అంటే, నేను మా తల్లిదండ్రులకి ఆఖరిసంతానం కావడంవల్ల నా పదహారవ సంవత్సరం వేళకి మా నాన్నకి అరవై ఏళ్లు దాటేయి; మా అమ్మవయసుకూడా యాభైపైనే. ఎంతో నాకు సరిగా తెలీదు. వాళ్ల అమ్మా నాన్నకి అప్పుడు వరసగా ముప్ఫై, ముప్ఫైఅయిదు ఉండేది వయస్సు; పైగా వాళ్ల నాన్న ఒకమాదిరి కవికూడాను. అందుచేత, వాళ్ల అమ్మానాన్నాదృష్టికీ, మా అమ్మానాన్నాదృష్టికీ పిల్లలను చూసేవిధానంలో బ్రహ్మాండమైన భేదం ఉండేది. మా అమ్మా నాన్నా నాకు ఏదో విధంగా పెళ్లి చేసేసి తమ బాధ్యత ఒదిలించుకోవాలని చూస్తూఉంటే, వాళ్ల అమ్మానాన్నా దాని చేత సంగీతసాహిత్యాలలో అమోఘమయిన కృషి చేయించి, దానిని ప్రపంచం-అంటే అధమం తెలుగుదేశం-అంతటికీ వెలుగు తేవలసిన పెద్దనక్షత్రంగా తయారుచేయాలని ఎన్నెన్నో ఆశలు పెట్టుకొనేవారు.

స్కూలులో చదువుచెప్పే పద్ధతివల్ల అనవసరంగా కాలం వృథా అవడంతప్ప ఫలితం అట్టే ఉండదనీ, ఇంగ్లీషు తెలుగు సాహిత్యాలు తానే ఇంటిదగ్గర చెప్తాననీ, సంగీతం శేషమ్మగారిదగ్గర నేర్చుకొంటే చాలుననీ, వాళ్ల నాన్న కమలచదువు రెండవఫారంతో ఆపుచేయించేరు.

కొద్దిరోజులు, అనుకొన్నట్టుగానే, దాని చదువూ సంగీతం జరిగినా, క్రమంగా వాళ్ల నాన్నకి భూముల వ్యవహారాలూ, తన రచనలగొడవా వీటిమూలంగా కూతురుకి చదువుచెప్పే ఓపికా, ఉత్సాహమూ తగ్గిపోయేయి. కొన్నాళ్లకి ఎప్పుడెప్పుడో ఒక్కనాడు ఆయన తనకు నచ్చిన ఏవేవో పుస్తకాలు అక్కడక్కడా చదివి అర్థంచెప్పడమూ, దినపత్రికలలోని వార్తలనూ, నాయకుల ప్రసంగాలనూ చదివి చర్చించడమూ, అంటే తన అభిప్రాయాలను కూతురుకి చెప్పడమూమాత్రంగా తయారయింది దానికి చదువు చెప్పే విధానం. ఇక సంగీతంలోనూ మొట్టమొదటి ఆపట్టుదలా, ఉత్సాహమూ దానికీ, వాళ్లనాన్నకీకూడా అట్టేకాలం మిగలలేదు. అయితే నెలకి ఇంత అని జీతమిచ్చి ఉంచిన ఉపాధ్యాయురాలుండడంమూలాన కొంత ఫలితంమాత్రం కనబడకపోలేదు. వయొలిన్ ఒకమాదిరిగా బాగానే వాయిస్తుంది నేర్చుకొన్నంతవరకూ. కాని, గాత్రంమాత్రం అనువయినది కాదు. ఇక నేను, సంగీతం అని వేరే నేర్చుకోకపోయినా, గాలిపాటగా, అక్కడక్కడ విన్న పాటలన్నీ ఒకమాదిరిగా తిరిగీ అనగలిగేదానిని.

మాయిద్దరికీ ఆరంభంలో స్నేహం కుదరడానికి సంగీతమే ముఖ్యమయిన కారణం. మొదట కొన్నాళ్లు సక్రమమూ, శాస్త్రీయమూ అయిన ఆమెవాద్యాన్ని నేను మెచ్చుకోవడమూ, నా గాలిపాటను చాలా హాయిగా ఉందని ఆమె మెచ్చుకోవడమూ వీటితో ఆరంభమయింది మా స్నేహం. అయితే కొన్నాళ్లకి స్నేహం బలంగా అయినతరవాత, సంగీతం చాలా అప్రధానమయి, ప్రపంచంలో స్త్రీలకు సంబంధించిన అన్నిసమస్యలూ మావే అన్నట్టుగా చర్చించుకొనేవాళ్లము.

ఒకస్కూలు స్థాపించి ఉచితంగా చదువూ, సంగీతమూ, అల్లికపనులూ, కుట్టుపనీ మొదలయినవి నేర్పి స్త్రీలను తమమీద తాము ఆధారపడేట్టుగా చెయ్యాలనీ, మరినలుగురు సంగీతంలో అభిరుచి ఉన్న అమ్మాయిలను పోగుచేసుకొని, దేశంపొడుగునా పాటకచేరీలు చేస్తూ, సక్రమమయిన సంగీతాభిరుచిని జనసామాన్యంలో కలిగించాలనీ, స్త్రీలకి సంబంధించిన సమస్యలను నిర్మొగమాటంగా చర్చించి పరిష్కారమార్గాలను సూచించడానికి ఒక పత్రిక స్థాపించి నడిపించాలనీ, అల్లా ఒకటేమిటి ఎన్నెన్నో పెద్దపెద్ద పథకాలను వేస్తూఉండేవాళ్లము. అప్పట్లో మాకు ఈ మా చర్చలు ఎంతో ముఖ్యమయినవిగానూ, ఇవి సక్రమంగా జరగకపోవడము మొత్తంప్రపంచం అంతటికీ పెద్దనష్టం అన్నట్టుగానూ రూపించేది. ముఖ్యంగా మేము ఎల్లప్పుడూ ఇటువంటి మాటలు మాట్లాడుతూండడం మూలాననేమో, నాకు మాఅమ్మానాన్నా తమలో

తాను నాపెళ్లిగురించి అనుకొనే మాటలు మరీ సంకుచితంగా రూపించి చికాకుకలిగించే వనుకొంటాను.

ఆవిధంగా కేవలం మాటలతోనే ఎంతకాలం గడిచిఉండునో చెప్పలేను. మా అక్కయ్యలు తాము వచ్చినప్పుడే కాదు, అప్పుడప్పుడు ఉత్తరాలలోనూ, ఇంకా నాపెళ్లి చేయకపోవడం అనేది మాఅమ్మ నాన్నా చేస్తూండిన ఘోరమయిన నేరం అని ఉటంకిస్తూ, ఏవేవో వాళ్లకి తెలిసిన సంబంధాలను గూర్చి తెలియజేసి, తమతమ సలహా లిస్తూ ఉండేవారు. ఈ రకంగా బైటనుండి కదలిక వచ్చినతరవాత కొద్ది రోజులు మాఅమ్మ నాన్నా చేసే చర్చలు మరి ఎక్కువరాత్రివరకూ జరుగుతూండేవి. మళ్లీ మరికొద్ది రోజులకి మామూలే మాటలన్నీ — కాలక్షేపసాధనాలు మాత్రం అన్నట్లుగానే తయారయేవి.

నేనూ, కమలా మాపెద్దపెద్ద యావత్ స్త్రీలోకానికీ సంబంధించిన ఆలోచనలూ, మాఅమ్మ నాన్నా నాపెళ్లి నిగురించిన ఆలోచనలూ చేస్తూండిన కాలంలో, వాళ్ల అమ్మనాన్నా దానిగురించి ఏమాలోచించే వారో చెప్పడం కష్టం. కాని, దానిని చదువు మానిపించేటప్పుడు వాళ్ల నాన్న చెప్పిన మాటలనే ఆయన తరవాత మనసులో పెట్టుకొన్నా రనడానికి వీల్లేదు. కమల సంగీతంలో, సాహిత్యంలో పెద్ద విద్వాంసురాలు కొందే పెళ్లి చేసుకోదనీ, అప్పుడైనా, ఆమె తన ఇష్టం ఉంటే తనకు నచ్చిన ఏమహాసంగీతజ్ఞుడినో, మరొక కళాతపస్వినో పెళ్లి చేసుకొంటుందనీ, లేకపోతే కేవలం కళకే తన జీవితాన్ని మీదుకట్టేస్తుందనీ ఆయన మొదట్లో అంటూఉండేవారు. అసలు మాలో ఇంతలేని ప్రపంచాన్ని మరమ్మత్తుచెయ్యాలన్న కోరికలు విస్తరించడానికి ఆయన ఈ అభిప్రాయాలే మూలకందము లయిఉండవచ్చును.

ఆవేళ ఉదయం కమల ఏడుపుమొగంతోనే చెప్పింది, అదివరకు ఇంట్లో అటువంటి ప్రసక్తి ఏమీ లేకుండానే, హఠాత్తుగా ఢిల్లీ వాళ్లనాన్న తన పెళ్లిసంబంధం నిశ్చయంచేసుకొని వచ్చేరని. వాళ్లమ్మ బైటుండడంచేత ఇంట్లో వంటపని తనే చెయ్యవలసి ఉన్నా, ఎలాగో ఒక అరగంట వీలుకలుగజేసుకొని వచ్చి చెప్పింది. నేను వెంటనే ఏమీ చెప్పలేకపోయేను. కాని, ఆ పూర్వాహ్ణం అలా మధ్యాహ్నం పన్నెండుగంటలవరకూ కదలకుండా కూర్చొని ఆలోచించేను. మా అభిప్రాయాలూ, ఆశయాలూ కేవలం ఊహలుగామాత్రమే అంతరించిపోవలసినవేతప్ప, అంతకంటే వాటిని ఆచరణలోపెట్టే సావకాశం ఇద్దరికీ లేదన్న నిశ్చయానికి వచ్చి ఆ మాటలే కమలతో చెప్పాలనుకొన్నాను. ఇప్పుడు నా సలహా, ప్రోత్సాహమూ లేకపోతే ఆమెపెళ్లి ఆగిపోతుందని కాదు గాని, అవి ఇవ్వగలగడం నాకు తృప్తి, పుచ్చుకోవడం ఆమెకు తృప్తి. ఆ మధ్యాహ్నం బయలుదేరి వాళ్లింటికి వెళ్లి నా కొత్త ఆలోచనలన్నీ చెప్పేను. వాటి మూలంగా, నిజంగా నేననుకొన్నకంటే ఎక్కువగానే సంతోషించింది కమల. "అయితే ఇంతకాలం ఇద్దరం ఇంతగా కలిసిమెలిసిఉన్నందుకు ఇప్పుడే నీ పెళ్లి కూడా అయిపోతే ఎంత బాగుంటుందే. ఇదొక్కటే నా విచారం"అంది.

"అన్నీ మనం కావాలనుకొన్నట్లుగానే జరుగుతాయా ? కాక ఇప్పుడు నీపెళ్లి అంటే ముఖ్యంగా వేడుక నాకు; తరవాత నాపెళ్లి అంటే వేడుక నీకు" అని ఏదో నామట్టుకు నాకే తృప్తిగా లేని సమాధానం చెప్పేను.

ఆ తరవాత ఇరవైరోజులూ నా ఆరోగ్యం ఏమీ బాగుండలేదు. ఏదో ఒకవిధమయిన అస్వస్థత. ఆ రోజుల్లో కమల ఒకటి రెండుమార్లు మాయింటికి వచ్చింది గాని, పూర్వం గంటలతరబడిని అంతులేకుండా మాట్లాడే ఆ పద్ధతి తప్పిపోయింది. నేను తనపెళ్లి గురించీ, కాబోయే భర్తఉద్యోగంగురించీ, ఆ సంగతులు ఆమెకు తృప్తికలిగిస్తాయని మాట్లాడేదాన్ని; తను నా అస్వస్థతగురించీ, మాఅక్కయ్యల రాకపోకల గూర్చీ ఏమేమో అడిగేది. ఏమి మాట్లాడినా, ఎన్ని సంగతులు మార్చినా ప్రతి నాలుగేసిమాటలతోనూ సూత్రం తెగిపోయి, ‘మరింకేమిటి సంగతులు’ అని జ్ఞాపకం చేసుకోవలసివచ్చేది.

చివరికి పెళ్లివేళకి నాకు జ్వరం. అయినా బాగుండదని వెళ్లేను. కమలే నావళ్లు పట్టుకొని చూసి,

"వెళ్లి పడుకో శకుంతలా! నిజమే నువ్వు లేకపోతే నా కదేమోలాగుంది. అసలు నా పెళ్లి వేడుకంతా నీదే నన్నావు. అటువంటిది వేళకి నీకే జ్వరం రావాలా? ఉహుఁ, ఇక్కడ వద్దు, గోలగా ఉంది, మళ్లీ బండీ మీదే ఇంటికి వెళ్లి పడుకో—" అంది.

ఇంటికి, తిరిగివచ్చేసిన కొద్దిసేపటికే నాజ్వరం పూర్తిగా తగ్గిపోయింది; కాని చిత్రంగా రెండు ఫర్లాంగులదూరం ఉన్నా పెళ్లిమంత్రాల ధ్వనులూ, వాద్యాలవాదమూ స్ఫుటంగానే వినిపించసాగాయి. ఆ వినిపించడం కేవలం నా చెవులద్వారా మనస్సుకి అందిందో, మనస్సే స్వయంగా విందో నిర్ధారణగా చెప్పలేను...

ఆసాయంత్రం పక్కమీద అటుకాదని ఇటూ, ఇటుకాదని అటూ ఒత్తిగిలి పడుకొంటూ అప్పుడప్పుడే కొద్దిగా మగతనిద్రపడుతూన్న సమయంలో ఆరాత్రంతా నన్ను మేలుకొనిఉండేలాగ చేసిన మాటలు వినిపించేయి.

"అప్పుకు మనం ఇల్లుకొన్నది పదిహేనువందలకి; మరమ్మత్తు పెట్టినది ఒక అయిదువందలకంటె ఎక్కువ లేదు. ఇవాళ వాళ్ళింతట వాళ్లు అయిదువేల అయిదు వందలు ఇస్తామన్నారు; మనం ఇష్టపడితే ఆరువేలకి లోటుండదు. రిజిస్ట్రేషనుఖర్చులుకూడా వాళ్లే పెట్టుకొంటారు. ఆడబ్బు పెట్టి పెళ్లంటూ చేసేస్తే, మన కేముంది, అప్పుడు రమణయ్యసెట్టి తన సేల్సుటాక్సు లెక్కలూ, ఇన్కమ్టాక్సు లెక్కలూ చేస్తే నెలకి ఇరవై రూపాయలిస్తానన్నాడు. నేనే బద్ధకించేసేను. ఇప్పుడీరోజూ చదరంగం ఆడేబదులు, ఓపిక పడి అవి రాసి, మరొకచోటకూడా లెక్కలురాయడమో, ముగ్గురునలుగురు పిల్లలకి ప్రైవేటుట్యూషన్లు చెప్పడమో చేస్తే ఎంతలేదన్నా మరొక ఇరవై రూపాయలు రాకపోవు. ఏదయినా ఇప్పుడీఇంటద్దెవచ్చిన పాటి కాకపోదు. కాక, ఆ ఉన్న ఒక్క మడిచెక్క అమ్మడంకంటె ఇదే మేలు. అక్కడ ఖరీదులు ఏమీ రావడంలేదు. మనల్ని నొక్కుడులో పెట్టి చవగ్గా లాగాలని, కామన్న భుక్తఎత్తు...ఏమంటావు. నేనింకా ఆలోచిస్తానన్నాను మాటవరసకి. రేపు మంచిది కాదు. ఎల్లుండే పురోణీ రాయించేస్తాను—ఆరు వేలకీ కొంచెం అటూ ఇటూలోను. డబ్బంటూ చేతిలో ఉంటే పెళ్లికేం, నెల్లాళ్లలో చేసేస్తాను." అని ఒక పెద్ద ఉపన్యాసం చెప్పేరు. మా అమ్మ అంతా విని, తక్కిన విషయాల్లో తన కేమీ అభిప్రాయభేదం లేదన్నట్లుగా, "ఇల్లంతా అమ్మకుండా ఇప్పుడు మనం ఉన్న ఈభాగం ఉంచుకొందికి వీలుండదా?" అంది..... "అంతా అమ్మితేనే ఖర్చులకీ కట్నానికీ చాలుతుందో చాలదో అనుకొంటూంటే ఇంకా కొంత ఉంచుకోడంకూడానా? నీభయం నాకు తెలియనిది కాదు కాని, మరేం అంత భయపడక్కర్లేదు. నాకంఠంలో ప్రాణం ఉండగా నేను నిన్ను పోషించక పోలేను. తరవాతనా, ఏకూతురుదగ్గరున్నా నీకు మహారాజులా గడిచిపోతుంది. వాళ్లు నీకేం ఉచితార్థంగా తిండిపెట్టకలసిన పనిలేదు. ఆ ఉన్న మడిచెక్క ఎవళ్లు నీకు కష్టానికీ సుఖానికీ అయితే వాళ్లకే ఇస్తావు. మరి నువ్వు కాదనకు. అసలు ఇన్నాళ్లూ ఇంత బద్ధకంగా ఎందుకు ఊరుకున్నానా అనే ఇప్పుడు కించగా ఉంది. రేపు లేదు, ఎల్లుండీ ఈసరికి పురోణీ అయిపోయి వెయ్యిరూపాయలు చేతిలో పడి తీరవలసిందే—" అని పెరట్లోకి వెళ్లిపోయేడు మానాన్న. తరవాత మాటలు మరి వినిపించలేదు, వినిపించవలసిన అవసరంకూడా లేకపోయింది.

ఆరాత్రి నామనస్సులో రేగిన తుఫానుఉద్ధతి ఇంతా అనీ, అది ఆయాప్రకారాలుగా విజృంభించిందనీ నేను నిబ్బరంగా చెప్పలేను. ఎన్నెన్నో ఆలోచనలూ, ప్రత్యాలోచనలూ లేచి ఒకదానితో ఒకటి సంఘర్షణపడి ఏదో బ్రహ్మాండమయిన హోరు ఉద్భవించింది మనస్సులో.

నాకు పెళ్లిచేసి నన్ను సుఖపెట్టడంకోసం అరవై ఏళ్లు దాటిన నాన్న ఈఉన్న ఇల్లు అమ్మేసుకొని, నిశ్చయంలేని నౌఖరీలలో దుర్బలంగా పడికొట్టుకొంటూ ఉండడమా! పాపం, తనకి భోజనంకూడా అక్కర లేదు చదరంగం ఉంటే. అటువంటిది, నామూలంగా ఆట మానుకొని ఈవయస్సులో పాటుపడడమా?

పడినా నొప్పి వస్తుందని నమ్మకం లేదు. తీరా చెయ్యబోతే, ముసలివాడివు సవ్యం చేస్తావయ్యా అంటారు. అటువంటి పరిస్థితులు కల్పించి నాకేమీ సంబంధం లేదన్నట్లుగా చూస్తూఊరుకోవడం అసలే నేను చెయ్యలేని పని.

ఇక మరేమిటున్నాయి సాధనాంతరాలు? ఏదో ఉద్యోగం సంపాదించుకొని బ్రతకడం. వాటిలో స్కూలుమిస్ట్రెస్ పని చెయ్యడానికయితే రెండేళ్లు ట్రెయినింగు కావాలి. అసలది అమ్మకే కాదు, నాన్నకికూడా ఎంతమాత్రం ఇష్టంలేని పని. కాక, నేను ఏమీ బాధపడడం లేదు, నాకెంతో ఉత్సాహంగా ఉందన్నా వాళ్లు నమ్మలేరు. ఇదివరకు రెండుమూడు మార్లు ట్రెయినింగుకి వెళ్తాననడం జరిగింది. ఒప్పుకోకపోవడమే కాదు, ఆరకం ఆలోచన పెట్టుకోవడం కూడా ఎంతో తెలివితక్కువ, అవమర్యాదాకరమయిన పనీ అన్నట్లుగా మాట్లాడేరు వాళ్లిద్దరున్నూ. వాళ్ల ఇష్టానికి విరుద్ధంగా రెండేళ్లు ట్రెయినింగు అవడం అసంభవం; అవందే ఉద్యోగం దొరకదు. ఇక ఏ నర్సు పనిలో ప్రవేశించాలన్నా ఏం చెయ్యాలన్నా బాగా ప్రయత్నించాలి; కొన్నాళ్లు ఓపికపట్టాలి. అంతే కాని అనగానే కావుకదా. అయితే ప్రస్తుతస్థితి అంత నిడివిమీద ఆలోచనలు జరపడానికి వీలుగా లేదే. రేపు లేదు ఎల్లుండి నిశ్చయంగా ఇల్లు అమ్మేస్తారు; ఈ సందర్భంలో నాన్నతో వాదించి ఒప్పించడం బ్రహ్మతరం కాదు.

ఇక మిగిలిఉన్నవి రెండే పద్ధతులు. ఒకటి ఆత్మహత్య, రెండవది, తరవాత ఏవిధంగా పరిణమిస్తుందో తెలియని, నాకు అసలే ఇష్టంలేని పనికి సిద్ధపడడం.

ఆత్మహత్య చేసుకోడం అంటే ఏమంత కష్టమయిన పనిమాత్రం కాదు. ఎంచేతంటే వాళ్లతో నేను, నూతిలో పడి చచ్చిపోయిన మనుష్యులను చూసేను. ఇంకొకామెను నీటిలో పడిన కొద్దిసేపటికే బైటికి తీసినా తెలివి తప్పిపోయిఉంది. వెంటనే డాక్టర్లు వచ్చి కృత్రిమశ్వాస కల్పించడమూ, ఇంకా తగిన శ్రద్ధ తీసుకోవడమూ మూలాన బ్రతికింది. అయితే మాత్రం బైటికి తీసేసరికి ఆమెకి ఒంటిమీద స్పృహ లేదు. అందుచేత పడీపడడంలో ఏకొంచెమో బాధ ఉన్నా తరవాత చచ్చిపోయేవరకూ ఏమీ తెలియదు. సగంరాత్రిప్పుడయితే తెల్లవారేలోపున ఏమీ అనుమానం లేకుండా అంతా పూర్తిఅయిపోతుంది— అయితే మంచి విషం దొరికితే ఇంతకంటే కూడా మంచిదేకాని, తక్కిన రైలుక్రింద పడడం, కాల్చుకోవడం మొదలయిన పద్ధతులకంటే నీటిమూలంగా చావే సులభమయినది. కాగా, ఈ విధానంలో నామటుకు నాకేం అనుమానం లేదు, బాగానే ఉంటుంది. తరవాత నాశరీరం ఉండదు, మనస్సో ఆత్మో అది ఉంటుందో ఉండదో తెలియదు— నిజమే. కాని ఇంతా నేను ఏఉద్దేశం అయితే మనస్సులో పెట్టుకొని ఆత్మహత్య చేసుకొంటున్నానో, అది నెరవేరుతుందా? అమ్మకీ నాన్నకీ నాపెళ్లివల్ల ఇల్లుండదు, తరవాత ఆయన ఏవేవో నౌకరీలు చెయ్యవలసివస్తుంది. అటువంటి సంకటపరిస్థితులు రాకుండా వాళ్లిద్దరూ హాయిగా నిర్విచారంగా ఉండాలనికదా నే ననుకొంటున్నాను. నేనేగాని ఆత్మహత్య చేసుకొంటే తరవాత వాళ్లు హాయిగా మనగలరా? పైగా ఎంత అపఖ్యాతి. నలుగురిలోనూ మరి జన్మలో తల ఎత్తుకొని తిరగగలరా? వీళ్ల చేతకానితనంకారణంగా వీళ్లమ్మాయి ఆత్మహత్య చేసుకొందన్న వాదు భరించి తీరాలికదా... అప్పుడు ఈ కారణాలన్నీ నామనస్సులో మెదిలేయి అనడాని కేమీ అనుమానం లేదు గాని, ఇంత స్పష్టంగా, ఒకదానితరవాత ఒకటి స్ఫురణమాత్రం మనస్సులోకి రాలేదు అని ఒప్పుకోవాలి. ఆ తుపానుపరిస్థితిలో ఇంత శాంతం ఎక్కడిది? మూడుమార్లు తొందరతొందరగా పెరట్లోకి వెళ్లేను; అంతకంటే తొందరగా తిరిగివచ్చి మంచంమీద కూలబడ్డాను. ఒకమారు నూతిదాకా కూడా వెళ్లేను. మరొక్కక్షణం ఆ ఉద్వేగం నిలబడిఉంటే, మరిప్పుడిన్ని ఆలోచనలు చెయ్యవలసిన అవసరం, అవకాశం కూడా లేకుండాపోయేది.

కాక, ఆత్మహత్య చేసుకోవడంవల్ల అమ్మకీ నాన్నకీ ఏసౌఖ్యం కావాలనుకొంటున్నానో,

ఆ సౌభాగ్యానికే వాళ్ళని పూర్తిగా దూరంచెయ్యడం జరుగుతుంది. అంతకంటే ఎల్లా—అయేది అల్లా అవుతుంది, నాకేం పూచీలేదని ఊరుకోవడమూ కొంత నయమే. ఏమంటే ఆపద్ధతిలో వాళ్లు ఎన్ని ఇబ్బందులు పడుతున్నప్పటికీ మనస్సుకిమాత్రం తమ విధిని తాము నిర్వర్తించేమన్న తృప్తి ఉంటుంది.

ఇక మిగిలిఉన్న మూడవపద్ధతివల్ల మా అమ్మకీ నాన్నకీ ఒకప్పుడు నిజంగానే సంతోషం కలగవచ్చును. లేదా, కొంత మనస్తాపమూ, నాయెడల కోపమూ కలగవచ్చును. అంతేకాని వాళ్లు స్వయంగా పెద్ద కష్టనష్టాలు భరించనక్కరలేదు. కాని, అందుకుగాను నేను (పరిస్థితులు ఎదురుతిరిగితే) జీవితం ఉన్నంతకాలం ఫలితం అనుభవించవలసిన ఆత్మహత్యకి సిద్ధపడా లన్న మాట...

నా ఆలోచన అలా ఇంకా జరుగుతూనే ఉంది; ఎటూ ఒక బలమయిన నిశ్చయానికి రాకుండానే తెల్లవారిపోయింది.

అప్పుడు ఒక్కమారు మెరుపు మెరిసినట్లయింది మనస్సులో. అంతరాత్రిపొడుగునా వితర్కించి, మూడుమార్లు నూతిదగ్గరకు వెళ్లి కూడా ఆత్మహత్య చేసుకోకపోవడం ఉందే, మరి ఆపని జరగవలసింది కాదని విధినిర్ణయం అయిఉంటుందని, ఆ స్ఫురణతో క్రొత్తగా ఉత్సాహం, బలం వచ్చినట్లనిపించింది. ఏదో పాడుకొంటూనే పక్కమీదినుండి లేచేను. మా అమ్మ మొగంలో ఆదివరకు కొన్నిసంవత్సరాలుగా కనబడని సంతృప్తి చాలా స్పష్టంగా కనిపించింది. — ఆ వేళ ఉదయం మాఅమ్మ ఇచ్చిన కాఫీఅంత రుచిఅయిన కాఫీ ఇప్పటికి మరి ఒకటి రెండుమార్లుమాత్రమే రుచి చూసేను.

కాఫీ తాగగానే అద్దంలో చూసుకొన్నాను. రాత్రంతా నిద్రలేకపోవడంవల్ల కళ్లు ఎంతో ఎర్రగా ఉంటాయనుకొన్నాను. కాని, కళ్లలో మాత్రం ఏమీ భేదం కనబడలేదు. మొగం మొత్తంమీద కొంచెం బలహీనంగా ఉండడానికి జ్వరం కారణంగా చెప్పుకొన్నాను. అలా కొంతసేపు చూడగాచూడగా, రోజూ కనిపించే ప్రతిబింబంకంటే నీరసంగా ఉండడంచేతనో—ఏమో అల్లా ఉండడమే ఎక్కువ అందంగా ఉన్నట్లనిపించింది.

ఉహుఁ, ఇల్లా కాలహరణం చేసి లాభంలేదు. కార్యరంగంలో దూకాలి. తొలినాటిరాత్రి ఆదివరకు మామూలుగా వెళ్లే నూతిదగ్గరకు వెళ్లడంలో పొందిన మనశ్కల్లోలమంతా ఆ ఉదయం డాబామీదికి వెళ్లడంలో పొందేను. ఒకమారు మెట్లవరకూ వెళ్ళి, మా అమ్మ పిలవకపోయినా పిలుస్తున్నదనుకొని, దగ్గరకు వెళ్ళి 'అమ్మా, పిలిచావా?' అన్నాను. మరొకమారు సగం వరకూ మెట్లెక్కి దిగిపోయేను. కాని మళ్లీ గదిలో వెళ్ళి కూర్చునేసరికల్లా తొలినాటి రాత్రి వచ్చిన ఆలోచనలన్నీ మనసులోకి రావడం మొదలుపెట్టేయి. ఇక మరి లాభంలేదని, తొందరతొందరగా డాబా ఎక్కిపోయేను. అయితే అప్పుడయినా మళ్ళీ కొంతసేపు ఆలోచించవలసివస్తే మనసు ఎటు ఒరిగిఉండునో చెప్పలేను. కాని, ఎట్టఎదురుగా ఆయువకుడు రెండుపెంకుటిళ్ళ అవతల ఉన్న డాబామీద కనబడ్డాడు. అదివరకు డాబామీదికి నేను వెళ్ళినప్పుడల్లా అతను నావంక చూసేపద్ధతిని, దగ్గరగా నాకు వినబడాలనో ఏమో పరంగంగా పద్యాలు చదివేపద్ధతిని నేను చాలా అసహ్యించుకొనేదానిని. అంతే కాదు, వెనకటిలా తరచుగా కాకుండా, ఎప్పుడో బట్టలు ఆరవెయ్యడం వంటి అవసరమయిన పని ఉంటేనే తప్ప డాబామీదికి వెళ్లడం మానుకొన్నా నిటీవల. ఆరోజున చేతిలో ఆరవెయ్యవలసిన బట్టలు ఏవీ లేకుండా డాబామీద నేను కనబడడం అతనికి ఒకింత వింతగా తోచిఉండవచ్చును.

అంతదూరంలో ఉండి మాట్లాడాలంటే గొంతు చించుకొని, చుట్టుపక్కల అయినవారిళ్లవాళ్ళకి వినబడేటట్లుగా మాట్లాడాలి. కాబట్టి అది పనికిరాదు. ఇంకేమిటి చెయ్యడం? అని ఆలోచిస్తూఉండగానే, నా చేయి కదిలింది; పెదవులు చిరునవ్వు నవ్వేయేమో చెప్పలేను... నేను చేసిన చేస్తున్న పని ఏమిటో నామనస్సుకి నాటేలోపునే అతను మా డాబాపక్కన ఉన్న సందులో వచ్చి నిలబడి ఉన్నాడు.

అతని ముఖవైఖరి చూస్తే, దూరంనుండి అంతహంగామాచేసే మనిషి అయినా, దగ్గరకు వచ్చాక

ఏమో మాట్లాడదలచి పైకి అనలేకపోతున్నట్లుగా తోపించింది. నాకూ మాట్లాడ్డానికి సంకోచంగానే ఉన్నా ఆవిధంగా నిలబడడం మరీ బాగుండదని "మధ్యాహ్నం ఒంటిగంటకు వస్తారా, కొంచెం మాట్లాడాలి" అన్నాను. అతను "తప్పకుండాను" అన్నాడు. అంతే...

రివ్వున డాబా మెట్లు దిగి నా గదిలోకి వెళ్లేను. అంతవరకూ తొంగిచూసైనా చూడని సందేహాలన్నీ ఒక్కమారుగా ఉప్పెనలా వచ్చిపడ్డాయి. అతను వివాహితుడేమో! అయితే మొదటి ఉద్దేశానికే భంగం. కాకపోయినా నన్ను పెళ్లిచేసుకొందికి ఇష్టం ఉండకపోతే, ఉన్నా, తన ఇష్టంకంటే వాళ్లవాళ్ల ఇష్టమే ప్రధానం అన్న రకం మనిషి అయితే,...ఊరికే తమాషాకి అన్నట్లుగా నావంక చూస్తున్నాడేమో...

ఉదయం పక్కమీదినుండి లేవగానే మహోనిబ్బరంగా ఏమీ అనుమానించవలసిన అవసరం లేదన్నట్లుగా తోపించిన ఆలోచనలే, మంచు కరిగిపోయినట్లుగా కరిగిపోయేయి—పోనీ ఊరికే ఆలోచనలు ఆలోచనలుగానే ఆగిపోకుండా ఈ తగాదా ఒకటి తెచ్చిపెట్టుకొన్నాను—ఎంత ధైర్యం, పట్టపగలు దగ్గరసా రమ్మని పిలిచేను. మట్టమధ్యాహ్నం బాహాటంగా రమ్మని చెప్పేను. ఎవళ్ళయినా చూసే ఉంటారు. ఇక నిప్పుడు మరి వెనక్కి తిరగడానికి కూడా వీలున్నట్లు కనబడదే—

ఆ ఉదయం ఏమీ భోజనం చెయ్యలేకపోయేను. మా అమ్మ మళ్లీ ఉష్ణం వచ్చింది కాబోలంది. నేను ఎంత లేదన్నా తాను నమ్మలేదు నామాటను.

రోజు ప్రొద్దెక్కుతూ పండ్రెండు గంటలకి దగ్గరపడుతున్నదనగా ఏదో ఫలానా అని చెప్పుకోబడని గాభరా. ఆ గాభరాలోనే నాకు నేను ధైర్యం చెప్పుకొన్నట్లు అనుకొన్నాను. అతని కులగోత్రాలు ఏమయినా సరే, మనిషి ఎటువంటివాడయినా సరే, అవివాహితుడయి కట్నం అక్కరలేకుండా పెళ్లిచేసుకొందికి ఇష్టపడితే చాలును. చివరికి, ప్రస్తుతం పెళ్లిచేసుకొందికి వీలులేకపోతే కలిసి లేచిపోవడానికయినా ఒప్పుకొంటే బాధలేదు, తరవాత సంగతి వెనకనించి ఆలోచించవచ్చును. అని అనిపించింది.

ఆవేళ మామూలుగా పన్నెండుగంటలకి భోజనానంతరం మాఅమ్మా నాన్నా నిద్రపోయేరు. అట్టేసేపు ఎవళ్లయినా చూస్తారేమో నని బితుకుగా కాలంగడప వక్కరలేకుండా అతను వచ్చేడు సరిగా పన్నెండు అయేసరికల్లా.

ఇక మరి అట్టే చెప్పనవసరం లేదనుకొంటాను.

మాఅమ్మా నాన్నా - ముఖ్యంగా నాన్న - నా స్వతంత్రతనుగురించి కొద్దిగా కేకలు వేసినా లోలోపల బాగానే సంతోషించి ఉంటారు.

మరొక్క పదిరోజులలో మా పెళ్లి ఏమీ ఆడంబరం లేకుండా మామూలు చిన్న కుటుంబాలలో బారసాలవంటి అప్రధానమయిన కార్యం జరిగినట్లుగా జరిగిపోయింది. అయితే ఈ సందర్భంలో మామూలు సాంఘిక కట్టుబాట్లకి పొరపొచ్చెం రాని మనిషి మా ఆయన కావడం కేవలం నా అదృష్టం అనుకోండి. అయితేమాత్రం, నా నిశ్చయంలో నేనేమయినా సరే మాఅమ్మా నాన్నా నాకారణంగా ముసలికాలంలో ఆర్థికమయిన ఇబ్బందులపాలు కాకుండా ఉంటే చాలునన్న త్యాగబుద్ధి మిళితమైఉన్నట్లే కనిపిస్తుంది. కాని, ఒకమనిషి హఠాత్తుగా నలుగురికీ విదితమయేలాగ ప్రాణం తీసుకొంటే నేతప్ప, నిత్యకృత్యంలో సామాన్యంగా చేస్తూఉండిన, అంతకంటే క్లిష్టతరమయిన త్యాగాన్ని గుర్తించకపోవడమన్నది ఒక్క నా విషయంలోనే జరగడంలేదన్న సంగతిమాత్రం నాకు తెలియనిదికాదు. అయితే నామటుకు నాకు ఇది నా జీవితంలో ఎంతో ముఖ్యమయిన ఘట్టంగనక నలుగురికీ తెలియవలసిఉందన్నంత ఉత్సాహంతో రాసేను. నిజానికి ప్రతివాళ్ల జీవితంలోనూ వాళ్లమటుకు చాలా ముఖ్యంగా తోచి, లోకం ఏమీ గుర్తించని ఘట్టాలు ఉంటూనేఉంటాయి కాబోలు.

---

# పరిణామవాదము

౨

### శ్రీ వేలూరి శివరామశాస్త్రి

ఈ సత్త్వమునకును, రజస్సునకును, తమస్సునకును ఇంకను చాల స్వభావములు కలవు. నైర్మల్యము, లఘుత్వము, అనామయత్వము మొదలగునవి సత్త్వస్వభావములు. చాంచల్యము, ఉపష్టంభకత్వము మొదలగునవి రజస్స్వభావములు. గురుత్వము, నిద్ర, ఆలస్యము, ఆవరకత్వము మొదలగునవి తమస్స్వభావములు.1 చందమామనుగాని, వెన్నెలనుగాని, చూచినచో మన హృదయములలో వికాసము, ప్రసాదము, శాంతి, సంతోషము మొదలగు గుణము లుద్బుద్ధము లగును.

సృష్టిలో నున్న వస్తువు లన్నియు త్రిగుణాత్మకములుగదా చందమామను జూచినపుడు సాత్త్వికగుణములే ఉద్బుద్ధము లగుటకు కారణ మేమి?

చందమామగాని, వెన్నెలగాని త్రిగుణాత్మక మయినను వానిలో రజస్తమస్సుల పాలు తక్కువ. సత్త్వము పా లెక్కువ. కావున నీహృదయములోని సత్త్వగుణములే యుద్బుద్ధము లాయెను. కాగా ప్రకాశము, ప్రసాదము మొదలగు భావముల నభివ్యక్తము చేయు వస్తువులతో సంపర్కము కలిగి తన్మయత చెందుచో మనహృదయమున నుపాదానకారణమగు సత్త్వగుణ మభివ్యక్తమగును. కావుననే మన హృదయమునం దలుదు వికాసప్రకాశాదు లనుభూతము లగును.

రజోగుణమునకు దుఃఖమే కాక క్రియ, శక్తి మొదలగు గుణములుకూడ గలవు. ఈ స్వభావములు కల బాహ్యవస్తువులతో సంబంధము కలిగినపుడు మన హృదయములందును ఆయా భావము లుదయించుచుండును. ఇటులే తమఃప్రధానము లగు వస్తువుల సంపర్కముచే జడత్వము, మోహము, అవసాదము మొదలగు గుణములు మన హృదయములం దుద్బుద్ధము లగును.

ప్రపంచ మంతయు ఈ మూడు గుణములచే నిర్మితమగుటచే నీ గుణముల యర్థము తిన్నగా తెలియదని కొంద రందురు2.

ప్రకృతిలో పలు తెరగులగు పెక్కు గుణముల పరిశీలనము చేయు పదార్థవేదులును (*Phisicists*), రసాయనవేదులును (*Chemists*), మనోవేదులును (*Psychologists*) 'ఏగుణఅడుగున అన్ని అడుగులు నిముడునటులు లోకమున గనబడు ద్రవ్యము లన్నియు సత్త్వరజస్తమస్సులలో నిముడునా? క్వైసైక్ ఏగుణములో జేరును? నీ రేగుణముచే నంచుగడ్డ యగును? సత్త్వము జ్ఞానమునకు ప్రకాశకమై, తమస్సు జ్ఞానమున కావరకమై యుండు ననినపు డీక రజస్సు నంగీకరించు టెందులకు? ఇటులే రజస్సు కర్మశీల మనియు,

---

1. సత్త్వం లఘు ప్రకాశక మిష్ట ముపష్టంభకం చలంచ రజః గురు వరణక మేవ తమః...

(సాంఖ్యకా. ౧౩.)

2. "*I have tried to explain the meaning of the three gunas before, but I am bound to confess that their nature is by no means clear to me, while unfortunately, to Indian Philosophers they seem to be so clear as to require no explanation at all...*" (*The six systems of Indian Philosophy.* P. 857.)

తమస్సు జాడ్యకమ్య మనియు చెప్పినపుడు సత్త్వము నకు స్వత్వ మెచట?' అని యడుగుదురు3.

గౌతముడుగాని, కణాదుడుగాని, కపిలుడుగాని 'ప్రకృతి ఎట్టిది? ప్రకృతి ఏగుణముచే పురుషు నరికట్టును?' ఈ మొదలయిన ప్రశ్నలకు అనుమాన ప్రమాణముచే సమాధానము చెప్పుటకు ప్రయతించిరి. ఇప్పటివారి పరీక్షాగారము లేబరేటరీ4. అప్పటివారి పరీక్షాగారము మనఃకోశము. కపిలుని లేబరేటరీలో ఈ గుణములకు, లేక యీ మహదాదికార్యమునకు ఇది ప్రయోగము:—

మహదాదికార్యము సుఖదుఃఖమోహాత్మకము. దేనిచేత? కార్య మెల్ల సుఖదుఃఖమోహాత్మక మగుట చేత. ఉదా. వెన్నెల, ముల్లు, కల్లు 5.

ఇక ప్రకృతము.

ఈ మూడు గుణములయు సామ్యావస్థ ప్రకృతి. ఇదియే మూలప్రకృతి. ఇదియే ప్రధానము. గంధము కంటె వేరయిన నేలకు గంధము గుణమయిన చందముగా సత్త్వము మొదలగు గుణములకంటె వేరయిన ప్రకృతికి సత్త్వాదులు గుణములు కావు. సత్త్వాదులు ప్రకృతిస్వరూపములు కాని ప్రకృతిధర్మములు కావు6. గుణము లసలు ద్రవ్యరూపములే. ఏలన, నివి మహదాదుల కుపాదానకారణములు. మరియు సంయోగమునకును, విభాగమునకును ఆశ్రయములు. ఈ మూటిలో రజోగుణము తమస్సత్త్వముల నతిక్రమించి కార్యోన్ముఖ మగును. ఈ గుణవైషమ్యమే సృష్టికి ప్రథమావస్థ. గుణత్రయరూప మగు ప్రకృతి యపుడు కార్యావస్థలో నుండును. దీనికి మహత్తత్త్వ మని పేరు7.

సృష్టిలో గల సకలజీవాత్మలయు, అతిసూక్ష్మములగు నంతఃకరణములయు శక్తియే పరిణామవాదులగు సాంఖ్యుల మహత్తత్త్వము. జీవాత్మల సమష్టిబుద్ధిశక్తికే మునిముందుగా ఈ వికాసము కలుగనిచో విచిత్రమగు నీ జడప్రపంచ ముద్భవించియుండ దను విశ్వాసము కలుగబట్టి సాంఖ్యాచార్యులీ సమష్టిబుద్ధిశక్తినే ప్రకృతిప్రథమపరిణతిగా నిర్దేశించి కణాదుని పరమాణువులు జగత్కారణము కావని అనిరి.

## ప ర మా ణు వు

గవాక్షరంధ్రములగుండ ప్రసరించు సూర్యకిరణములలో గాలికి లేచుచు దిగుచు పరుగిడుచు కనబడు

3. సాంఖ్యప్రవచనసూత్ర. ౬-౨౫...౩౯ సాంఖ్యసమాససూత్ర. ౧. చూ.

4. *Atom* చెం. వాని విషయమున వీరును అనుమానప్రమాణ మవలంబింతురు.

5. వెన్నెల మొదలగునవి సుఖాద్యుత్పాదకములుగాని సుఖస్వరూపములు కావే అని అనినచో నిక్కువమే. కారణగుణములు కార్యమునందు గుణాంతరము నారంభించు నను న్యాయముచే మనోధర్మము లగు సుఖాదులు కారణగుణపూర్వకములు గాన అట్టి సుఖాదుల నారంభించుటచే పరంపరా కారణమగు మూలకారణమునందు, అనగా మూలప్రకృతియందు సుఖాదిధర్మము లున్నవని అంగీకరింపవలెను. ఆ మూలప్రకృతియందలి సుఖాదిధర్మములు ఉక్తన్యాయమున కార్యవిశేషమగు మనస్సునందువలె భౌతికమగు కార్యాంతరమునందును సుఖాద్యారంభకము లగును. సుఖాదిసిద్ధిలో ధర్మమునకును ధర్మికిని అభేదమువల్ల భౌతికములగు వెన్నెల మొదలగునవియు సుఖాత్మకము లని సాంఖ్యుల అభిప్రాయము. దీనిని మాయావాదులు నోట గిల్లివయిచిరి. దానిని మాయావాదమున జాతము సుఖదుఃఖమోహములకు సత్త్వరజస్తమస్సులు ప్రతిభువులనుట తండి మాట.

6. 'సత్త్వాదీనా మతద్ధర్మత్వం తద్రూపత్వాత్' సాంఖ్యప్రవచనసూత్ర—౬-౩౯. 'ప్రకృతిసంభవాః' అను ౧౪ అధ్యాయమునందు గీతలో చెప్పబడిన గుణములు విషమావస్థాపన్నములు. కొందరు సాంఖ్యశాస్త్రజ్ఞులు అష్టావింశతితత్త్వపక్షమున విషమావస్థాపన్నమగు గుణత్రయము ప్రకృతికంటె వేరొక తత్త్వమని ఉపపాదించిరి.

7. మహత్ అనునది సంజ్ఞ. కావున 'అన్మహతః...' అను సూత్రము ప్రవర్తింపలేదు. ఈ తత్త్వము చిదచిదాత్మకము.

రేణువులే పరమాణువులు. అణుత్వమున కదియే ఆట్టడు గని ప్రత్యక్షప్రమాణవాదు లందురు.

ఈ రేణువులు కంటికి కనబడును. 'కంటికి కనబడునవి వలుదెరగులగు పరమాణువుల కలయికవలన నేర్పడును' అను అనుమానమువలన అవి పృథివ్యప్తేజో వాయు పరమాణువుల సంఘాతము, లేక చేరిక. కాన ఆ రేణువుల అవయవములు పరమాణువు లని సౌత్రాంతికులును, వైభాషికులు నగు బౌద్ధు లందురు. వీరిదే సంఘాతవాదము-సంఘాతవాదస్తు భవంతపక్షః.[8]

మూలభూతము లగు పరమాణువులు వలుదెరగు లవి కావు. మరి అవి ఏకరూపములు. ఇది పృథివీపరమాణు వనియు, ఇది యప్పరమాణు వనియు భేదము ఘటపటాదిభేదమువలె తరువాతదరువాత కలుగు నని జైను లందురుకి.

గవాక్షాదులగుండ ప్రసరించుచుండు సూర్యకిరణములలో కనబడు రేణువులు మహత్పరిమాణము కలవి. మహదారంభకముల కవయవము లుండవలయునుగాన ఈ రేణువులకును అవయవము లుండవలయును. మరియు ఆ అవయవములే పరమాణువులు కావు. ఆ యవయవముల కును అవయవము లుండును. వానికి మరి కారణము లేదు. ఇవి వలుదెరగులు; మరియు రూపాదిసహితములు అవియే వలు దెరగులగు భూతములకు మూలకారణము. రెండు పరమాణువుల కలయికచే గలుగు కార్యము ద్వ్యణుకము. మనకు గనబడు రేణువునకు ఈ ద్వ్యణుకములే అవయవములు. మూడుద్వ్యణుకముల కలయికచే త్ర్యణుక ముత్పన్న మగును. గవాక్షరంధ్రములనుండి ప్రసరించు కాంతిలో కనిపించు రేణువు లీ త్ర్యణుకములు. కావున పరమాణువు ఆ రేణువులో ఆరవవంతు, అని ఆరంభవాదులగు వైశేషికులు చెప్పుదురు.[9]

ఇంత గొప్ప పరమాణుకారణవాదు లణుత్వమున కింతకంటె సూక్ష్మతిసూక్ష్మమగు అవధి నూహింపలేకపోయిరా యని అందరకును సామాన్యముగా తోచును. వారు ఊహింపకపోలేదు. ప్రత్యుత చాల లోతుగా నూహించిరి. మనకు కనబడు నీ రేణువులో ఆరవపా లని అంగీకరించిన పరమాణువుగూడ విభాజ్యమే. అటులు విభజింపగా నేర్పడు విభాగము గూడ మరల విభాజ్యమే. ఆ విభాగముగూడ విభాజ్యమే. ఇటు లీ విభాగమునకు అం తను మాట ఉండదు. ఇది అనవస్థ. కావున నెదోయొకచోట మన మాగవలయును. ఆ యాగుట యీ యారవవంతగు అణువుకడనే ఆగుట మేలు అని వారు చెప్పిరి. ఈ చెప్పుట ప్రక్రియాలాఘవమునకు విభాజ్యము కాని చరమసీమయే పరమాణువు. అది నిరవయవము.

మరియు పరమాణువునకు మరొక పేరు పరిమండలము. దాని పరిమాణము పారిమాండల్యము.

రెండు పరమాణువులు ద్వ్యణుకము నారంభించును. ఆ ద్వ్యణుకము అణువు. మరి హ్రస్వము. ద్వ్యణుక పరమాణువులు ద్వ్యణుకమునందు కారణగుణమగు తమ పారిమాండల్యమును ఆరంభింపవు. విరుద్ధధర్మాక్రాంతముగనుక.

ఇటులే నాలుగు ద్వ్యణుకము లొక చతురణుకము నారంభించును. అది మహత్తు. మరి దీర్ఘము. వెనుకటి కారణమువనే యీ ద్వ్యణుకములు తమ అణుత్వహ్రస్వత్వములను చతురణుకములో నారంభింపవు. ఇది ఆరంభవాదుల ప్రక్రియ.

---

8. తత్త్వత్రయ భాష్యం.

9. నవ్యవైజ్ఞానికు లిటులు చెప్పుదురు.—మూల పదార్థములు తొంబదిరెండు. వీని పరమాణువు లన్నిటిలో ఉదజనిపరమాణువు చిన్నది. ఇది ఒక ఎలెక్ట్రాను, ఒక ప్రోటాను: వీని కూడిక. ఒక అంగుళమును ఇరువది కోట్లచే విభాగించుచో అందొక భాగము పరమాణువ్యాసము. ఇరువది కోట్ల పరమాణువులను వరసన పెట్టినచో ఒక అంగుళ మగు నన్నమాట. దీని బరువు [illegible] గ్రెయిన్. గ్రెయిన్ ఒక పౌనులో ౭౦౦౦ వ పాలు. అట్టి [illegible] గ్రెయినును ఒకటికి ఇరువదినాలుగు సున్నలు చుట్టగా వచ్చిన సంఖ్యచే భాగింపగా ఏర్పడు లబ్ధమునకు పైజెప్పిన పరమాణువు బరువు సరిపోవును. ఎలెక్ట్రాన్ ప్రోటానులలో ఎలెక్ట్రాన్ సూక్ష్మతరము. ఇది పరమాణువులో ౧౮౦౦౦ వ పాలు.

పృథివ్యప్తేజోవాయుపరమాణువులలో వాయుపరమాణువు తేజఃపరమాణువునకును, తేజఃపరమాణువు అప్పరమాణువునకును, అప్పరమాణువు పృథివీపరమాణువునకును కారణము. ఈ పృథివీపరమాణువు మరల అప్పరమాణువులోను, అది తేజఃపరమాణువులోను, అది వాయుపరమాణువులోను, ఇదియు త్రిగుణాత్మక మగు మూలప్రకృతిలోను10 లయమగును. కావున ఈ పరమాణువు లనిత్యములు. ఇవి జగత్కారణము కావని పరిణామవాదు లందురు.

## సృష్టి బోధము

ప్రపంచమునందే కార్యమునందేని ఒకానొక నియమకౌశలము కనిపించినచో అది బుద్ధిపూర్వకము గనే జరిగియుండవలె నని దార్శనికులలో పలువు రంగీకరింతురు. ఆకాశగహ్వరమున గిఱ్ఱున దిరుగు నీగోళములను, గోళములలో గల నియమములను ఒకింత మనసునకు పట్టించుకొనినచో ఇది ఏ కల్పనారాజ్యమునుండియో ప్రసరించుచున్న దని తోపకుండునా? ఈ ప్రపంచము తనకు దా నూడిపడె నని ఎవ డేని అనుకొనునా? పలు దారములు కూర్పులతోడను, చేర్పులతోడను అనగి పెనగి యున్న యీ విశ్వములో పరమాణువు మొదలుకొని పర్వతమువరకును గల ప్రతివస్తువు కార్యకారణభావ సంబంధముతోడను, ఉత్పత్తిస్థితిలయములతోడను బిగిసియున్నది. కావున 'ఇచట నన్నియు నందరును అన్నిటి కొరకును అందరకొరకును అన్నిటితోడను అందరతోడను కలిసి అనుక్షణమును వింతయగు భవిష్యత్తుదెస ఒకే నియమములో ముందుముందునకు నడచుచున్నా' రని తెలిసి అభివ్యక్తికి పూర్వ మీ ప్రపంచ మంతయు ఏ కారణములోనో ఎవనిబుద్ధిలోనో ప్రతిఫలింపలే దని ఎవరు చెప్పగలరు?11.

సరే, మంచిది. ఈ బుద్ధి ఎవరిది? భోక్తది. భోక్తయే జ్ఞాత. కాన, ఈ భోక్తయు జ్ఞాతయు జీవుడే. ఈ బుద్ధి జీవునిది.

అమ్మో, కొసంత జీవు డీ బ్రహ్మాండమును సృజించుటా అని వింతపడ నక్కరలేదు. ఈ జీవుడును అంత జీవుడు.

జీవు డొకడా లేక పలువురా?

పలువురు. కావున అసంఖ్యాకులగు జీవుల అసంఖ్యాకములగు బుద్ధిశక్తుల అభివ్యక్తియే యీ బాహ్యప్రపంచసృష్టికి పూర్వరూపము.

మహత్తత్త్వము సృష్టమగుడు: అవ్యక్త మహంకారరూపముగా నభివ్యక్తమగును. బుద్ధికి వికాసము కలుగగనే మనకు నహంభావ మభివ్యక్తమగును. దీనినిబట్టి సాంఖ్యాచార్యులు అహంతత్త్వము మహత్తత్త్వమునుండి అభివ్యక్తమాయెనని ఊహించియుందురు.

అహంతాభివ్యక్తికి పిదపనే మన కింద్రియాభిమానమును, విషయములును గోచరించును. దీనజేసి సాంఖ్యదర్శనము అహంతత్త్వమునుండి యింద్రియసృష్టియు, సూక్ష్మభూతసృష్టియు కలిగె నని చెప్పెను.12 జ్ఞానకర్మభేదముచే ఇంద్రియములు ఇరు

---

10. ఈ ప్రలయప్రక్రియయందు మతభేదము లున్నవి. వానిని ఆకరములలో జూచునది.

11. నవ్యవిజ్ఞానచరిత్రలో అనిర్దేశ్యవాదము అరయునది.

12. విశేషములు సామాన్యప్రకృతికము లను న్యాయము ననుసరించి బుద్ధిసామాన్యభూతమగు మహత్తత్త్వమునుండి బుద్ధివిశేషభూతములగు తత్త్వములు పుట్టును. అహంతయు, ఇదంతయు అనగా నేనను భావమును ఇది యను భావమును బుద్ధివిశేషములు. వీనిలో అహంతవినా ఇదంత పొడసూపదు గాన తొలుత బుద్ధివిశేషరూపమగు అహంతత్త్వము పుట్టును. మహత్తత్త్వమువలెనే యిదియు త్రైగుణ్యముచే ముత్తెరగులు. అందు సాత్త్వికము వైకారిక మనియు, రాజసము తైజస మనియు, తామసము భూతాది యనియు చెప్పబడును. ఇందు వైకారికము తైజసాంశసాహాయ్యమున ప్రవృత్తిధర్మము కల తన్మాత్రపంచకమును సృజించును. తన్మాత్రము లనగా శబ్దస్పర్శరూపరసగంధములును, తదాశ్రయములగు సూక్ష్మభూతములును. తామసతైజసములనుండి తన్మాత్రపంచకోత్పత్తి యని వ్యపదేశము. ఇచట మతభేదము లున్నవి. వానిని ఆకరముల నారయునది.

చెరగులు. త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములు జ్ఞానేంద్రియములు. వాక్ పాణిపాద పాయూపస్థములు కర్మేంద్రియములు. మనస్సు అటు జ్ఞానేంద్రియములను, ఇటు కర్మేంద్రియములను నడపునుగాన సాంఖ్యులు మనస్సును జ్ఞానేంద్రియముగను, కర్మేంద్రియముగను వ్యవహరించిరి.[13]

అహంతత్త్వము విషయముగా పరిణమించుచు, అనగా భోగ్యవస్తువుగా పరిణమించుచు దానిని రెండుగా విభజించి సూక్ష్మభూతము లనియు, స్థూలభూతము లనియు నందురు. సూక్ష్మభూతము లనగా శబ్ద స్పర్శరూపరసగంధములు. స్థూలభూతము లనగా పృథివ్యప్తేజో వాయ్వాకాశములు. పంచభూతముల సూక్ష్మావస్థ, లేక కారణావస్థను సాంఖ్యులు పంచతన్మాత్రలని అందురు. వాని అభివ్యక్తావస్థయే స్థూలభూతములు.

కారణము కార్యముగా, మరల నది కారణముగా ఏర్పడి అవ్యక్తము వ్యక్తమై క్రమక్రమమున ఈ జడజగత్తు పరిణామము చెందెను. జడ మనిన నిల్లయు ప్రకృతి మొదలుకొని మహాభూతములవరకును గల యేదో యొక తత్త్వములో చేరును.

వ్యక్తావ్యక్తమగు నీ జడజగత్తునకు స్వయం ప్రకాశము కానరాదు. ఏ ప్రకాశముతో గలిసి ఈ తత్త్వములు ప్రకాశించునో ఆ ప్రకాశమే సాంఖ్యుల ఆత్మ. అతడు నిత్యుడు. మరియు అపరిణామి. అతడు ప్రకృతియు గాడు వికృతియు గాడు. ప్రకాశమే అతని స్వభావము. ప్రకాశశీల మగు నీ వస్తు వవివేకవశమున జడముతో గలిసి వ్యవహారగోచర మగుచు సంసారి యనియు, బద్ధు డనియు బిరుదు సంపాదించుకొనును. అవివేకమూలక మగు జడప్రకాశశక్తుల కలయికయే సంసారము. ఈ సంసారమే పెక్కు చెరగులగు దుఃఖముల కాకరము. నేను దుఃఖిని నా శరీరము నా యిల్లు నీవు సుఖివి నీ శరీరము నీయిల్లు ఈ మొదలగు తెలివితేటలేకదా సంసారము. ఇదియే అనర్థముల కన్నిటికిని కారణాచి.

'నేను' అను మాటచే జెప్పదగిన జ్ఞానమయ వస్తువుతో దేహాదులగు జడవస్తువులు అభిన్నముగా గలిసియే సకలప్రకారములగు జ్ఞానముల కిరవు లగును. ప్రకాశమయుడును, అవికారియు నగు నాత్మతో అప్రకాశమును, పరిణామియు నగు జడమున కెట్టి పొందును పొసగ దని దృఢమయిన నిశ్చయ మొదవిన తత్క్షణము మనకు దుఃఖముతో తెగతెంపు లగును. అపుడవ్యక్తము, లేక ప్రకృతి వ్యక్తత బడసి మనల నీ జడరాజ్యములో పౌరుల జేయజాలదు. నేను జడుడ నను కొని జడరాజ్యమున బ్రవేశించుటయే యాత్మకు బంధము. జడచైతన్యముల స్వభావమును చక్కగా దెలిసికొనుటయే యీ బంధము బాపుకొనుట కేకమాత్రోపాయము.

దానిని చెప్ప తెలియవలె ననినచో పరిణామవాదమును, లేక సత్కార్యవాదమును తిన్నగా నెరుగవలయును. సత్కార్యవాదమునందలి యుక్తులను సరిగా నెరుగుకొనుచో ఆత్మ-అనాత్మ-జీవుల-స్వరూపము క్రమముగా తెలియవచ్చును. అది తెలియుటవల్ల సర్వదుఃఖములకును ఆత్యంతికనివృత్తి కలుగును. ఇది కాపిల దర్శనమునకు సంగ్రహము.

---

13. ఆరంభవాదుల మతమున ఇంద్రియములు భౌతికములు. 'అంతరా విజ్ఞానమనసీ క్రమేణ తల్లింగాదితి చే న్నావిశేషాత్' అను బ్రహ్మసూత్రమును వివరించుచు శంకరులు మొదట భౌతికము లని ఉపన్యసించి పిదప పక్షాంతర మవలంబించి అభౌతికము లయినను కావచ్చునని ముగించిరి. విద్యారణ్యులు పంచదశిలో భౌతికము లని చెప్పిరి. (౧-౧౮-౧౯)

# ఎల్లోరా శిల్పములు



కాళికాదేవి



పార్వతీ పరిణయము

# రాజ జామాత

(గీతికా రూపకము)

శ్రీ శివశంకరశాస్త్రి

## చతుర్థరంగము

(తెలవారిన కొంచెముసేపటికి సుగంధ శయనాగారము ప్రవేశించి, తలుపు మూడుసార్లు తట్టి)

సుగంధ

రాజకుమారీ, రావచ్చునా నే
నొక పర్యాయం బుపకంఠమునకు ?
రాదా మెలకువ రాజకుమారీ !
కర్మం ! బింకను గాఢసుషుప్తియె !
స్వామీ, మీరును స్వాపములోనే
అభిభూతులు కారని భావించెద...
స్వామీ, లోనికి వచ్చెద నొకమా
రానతిపై దమ యంతికమునకే.

ఖంఖుడు (తలుపు తెరచి)

ఏమి సుగంధా, యిటు వచ్చితివే
తెలియనె లేదే, తెల్లవారినద ?

సుగంధ

ఇంచుకైన దీపకాంతి
హీనము కాలేదు స్వామి
అర్ధరాత్ర మనసిత మయి
అర్ధఘటిక కానె లేదు.
ప్రాణాంతక మైన మహా
ప్రబలఘటనవలన మిమ్ము
ప్రబోధింప వచ్చినాను
భయవిహ్వలచిత్తమ్మున.

ఖంఖుడు

భయము విడువుమా సుగంధ !
ప్రాణాంతక మైన ఘటన
తెరగు సవిస్తారముగా
తెలుపు నెడల నివారింతు.

సుగంధ

అరుదెంచి జామాత యాదృచ్ఛికమ్ముగా
ఏకశయనమ్మునం దిరువురను మిము గాంచి-

ఖంఖుడు (సంభ్రమముతో)

ఈక్షించినయెడ ఏకశయ్యపై
మము, జామాతకు మనఃపీడనము !
పాపము, యోగ్యుడు : భార్యవర్తనము
కనుగొనునెడలను కడు వ్యథపాలగు
జాయాంతికమున శయనముపై నను
వీక్షించినచో విరసంబేకద.
శ్రమ యొదవించుట సరళవర్తనున
కుచితము కాదన యుక్తంబేకద.
అయిన, సుగంధా, అతడు మమ్ముల
వీక్షించుట యేవిధముగ దెలిసెను ?

సుగంధ

నా కెటు తెలియును ? నయమే స్వామీ !
వీక్షించితి నా విప్లవ మెల్లను.
మరచెనో రాజకుమారిక శయ్యా
భవనబంధనము పాలుమాలికను ?
జామాతయు మీ శయ్యాగారం
బర్గళహీనం బగుటం జొచ్చెను.
ఏకతల్పమున నిదురర గనుగొని
నిండురోషమున నిప్పులు గ్రక్కుచు—

ఖంఖుడు

ఎంత ప్రమాదం ! ఇదివర కెన్నడు
ఘటియిల్లని యొక గండము పుట్టెను!
రాజపుత్రి యీ రాతిరి వేళను
అహో, మరచెనె అర్గళబంధము !

సుగంధ

"ఖడ్గము ఖడ్గము ! ఖండ ఖండములు
చేయవలయు నీ చెడిపెను వేగమె !
కామినిసైతము కరవాలమునకు
ఎర చేయగవలె నీక్షణమందే—"
అని త్రుటిలోపల అస్మదీయకటి
లంబిఖడ్గమును లాగెను బలిమిని.
బంధించెను ద్వారమ్మును—
పాదమ్ములపై వ్రాలెను
ఆయూత వసంతలేఖ !
అడుగులపై బడితి నేను.
బహువిధాల నుభయులమును
ప్రార్థింపగ ప్రార్థింపగ
సహజయోగ్యు డైన యతడు
శాంతించెను కొంతవడికి.
"వధ్యు లైన నిక్కముగా
వారల క్షమియించినాను"
అనువరకును జామాతృని
యంఘ్రులు నే విడువనైతి.
సౌధాంతర్భాగమునకు
జామాతను సాగనంపి
అర్గళములు వేసి యిచటి
కరుగుదెంచినాను స్వామి !

అనంగలేఖ (కన్నులు తెరచి)

కునుకుపట్టెనో లేదో కోలాహలమ్ము !
శయ్యాగృహమ్ములో నందడి యేమి ?
అసమయమ్మున నేల యరుదెంచినావు ?
స్వామికోరికమీద చనుదెంచినావో ?

ఖంఖుడు

అనంగలేఖా, అత్యాహితమే
ఘటిల్లినది యొక ఘటికకు పూర్వము.
జామాతృం డెటో శయ్యాగృహమున
కాకస్మికముగ నరుగుదెంచి మన
నేకతల్పమున వీక్షించిన వా
డని వచియించిన, దడుగు సుగంధను.

అనంగలేఖ (రోషముతో)

ఇంతటి లజ్జాహీనుం డని నే
నీక్షణమ్మువర కెరుగనైతిగద !
మగటిమి కలిగిన మనుజుం డగుచో
నిజముగ జూచునె నిద్రాపరులను ?
శయ్యాగతు లగు చానను పురుషుని
ఈక్షించినవా డేటి పూరుషుడు !
ఎటు రానిచ్చితి విచ్చటి కాతని ?
నిదురనుంటివా నీవు సుగంధా ?

ఖంఖుడు

ఏగతి దెలియునో యీ కవాటమును
నిరర్గళమ్ముగ నీ వుంచితి వని ?

అనంగలేఖ

స్వామియాగమన సంభ్రమదశలో
పరాకుపడితిని బంధించుటలో.

అయినను జామా తర్ధరాత్రమున
ఏటికి రావలె నీ సదనమునకు ?

ఖంఖుడు

భార్యమీద ననురాగము
పాలువోలె పొంగిపొరల
అడుగుదెంచి యుండనోపు
నాకస్మిక కాంక్షలూర.

అనంగలేఖ

ఎడనెడ నా గాత్రవల్లి
నిచ్చుచునే యున్నదాన,
పొరపడినా, నీమీదట
పూర్ణనిషేధంబె మేలు.
అత్యాహిత మంటిరి మీ,
రంత యేమి మునిగిపోయె !
ఈక్షించియు శయనముపై
నేమి చేయగలడు మనల ?

సుగంధ

జామాతకు కడు సంభ్రమ మొదవగ
ఒడలు కోపమున నూగిపోయినది——

అనంగలేఖ

అనుభవించు తాను నాదు
యౌవనసౌందర్యంబులు.
ఏల నేను ప్రియునితోడ
ఇష్టసౌఖ్య మొందరాదో ?
ఏవగింపు కలుగుచుండు
ఈ పతిత్వ మన్న నాకు !
భామినులకు నిత్యవిధిగ
పాణిపీడనమ్ము తగదు.
కోపమటే జామాతకు !
కులము లేనివాని కేల
కోపము ? న న్నేమి చేయు ?
కుమిలిపోవు లోలోపల!

సుగంధ

కన్నతల్లి సుస్నాతట,
కర్కోటక నాగరాజు
జనకు డనుచు తెలిసె నంట,
క్షత్రియోత్తముండె కదా !

ఖంఖుడు (ఆశ్చర్యముతో)

సుస్నాతాకర్కోటక
సుతు డౌ దుర్లభవర్ధను
డకలంక క్షత్రియుడే
అగుటె నిజము రాజపుత్రి.

అనంగలేఖ (వింతగా జూచి, కొంచె మాగి)

వార్త పంపకుండ తొలుత
వచ్చువాడు కాడు; నేటి
యాకస్మికమైన రాక
అనుమానముచేత నేమొ ?

సుగంధ

చూచుటలేదా శుష్కించినవా
డాధిచేతనే అతడు కుమారీ !
అనురాగము లే దని గ్రహించెనట;
ఆపల నేదో అనుమానంబట.
కాని యెరుగడట ఖంఖామాత్యులె
హృదయేశ్వరు లని యేమాత్రమ్మును.

ఖంఖుడు

జామాత పాపము, చాల యోగ్యుండు,
అనుదినం బతని దీనాననం బెట్లు
విగతత్రపుండనై వీక్షింపగలను
శయ్యారహస్యంబు స్పష్టమైపోవ !

అనంగలేఖ

జామాతకె మీసందర్శనమున
సిగ్గు జనించును స్మృతిచే స్వామీ !
భార్యావర్తనము పరిశీలించెడి
కాపురుషునకే కాదగు శాస్తి !

సుగంధ

కాదు కుమారీ, "ఖండఖండములు
కావించెద" నని కసలుచు బలికెను.

అనంగలేఖ (మండిపడి)

నిజరహస్యము బయలుపడగా
నేటితో చలి తీరిపోయెను!
స్వామి రాదగు నింక నిచటికి శంకలేకుండన్.
చూడవలయు సుగంధ, ఏత
ద్భూరసింహం బేమి చేయునో
ప్రమదమొందుచు నుండ నే ప్రియ
బాహుబంధమునన్.
కత్తి యెత్తినయంతమాత్రన
కంపమొందెడువారు లేరిట.
క్రమింగి యంతయు శాంతి పూనుట
మేలు తన కనవే!

(సంజ్ఞ చేయుగా సుగంధ నిష్క్రమించును)

మనకు నిద్రాభంగ మైనది;
మరచిపోయి అనాంతరమ్మును
స్వామి, శయ్యాతలముమీదికి
సత్వరము రండు.

(విలాసముగా జూచును)

ఖంఖుడు

(నిమద్యపై మెల్లగా గూర్చుండి)

జామాత నిజముగా సదయహృదయు డనంగ!
వధియింపకే మనల వదలిపెట్టినవాడు.

అనంగలేఖ

వీరుండు జామాత విడిచిపుచ్చక మనల
నిజముగా వధియింపనేర్చు నని యెంతురా?

ఖంఖుడు

అట్టు లనకు మనంగ, ఆతండు క్షత్రియుడు,
నిజభార్య ప్రియునితో నిద్రించుచుండగా
కనుగొన్న పురుషుండు కరవాలమును దూసి
విదళించుపశ్చాత వేరు ది క్కే ముండు?
ప్రథమకోపమ్ములో భగ్గుమన్నను, తుదకు
శమియించి వధ్యులన్ క్షమియించినాడంట.
మరచు టెట్లు తదీయమహనీయకార్యంబు?
ఇపుడు పునర్జన్మ మెత్తినారమునుమ్మి.

అనంగలేఖ

వింతవాక్కులతోడ వేధింప కిక నన్ను
త్వరితమ్ముగా రండు తల్పోపరిస్థితికి.

ఖంఖుడు

ఆయుదారుని ధనము నంటుకొందునదేని
నే కృతఘ్నుడ నౌదు నిజముగా ప్రభుపుత్రి!

అనంగలేఖ

ఆహాహః నే నాయనధనమున?
జడపదార్థమున? స్వామీ, చెప్పుడు.
కల వనురాగము, కామితములు. నే
నస్వతంత్ర నని అనుకొనబోకుడు.

ఖంఖుడు

రాజపుత్రీ, నిందురాగ మున్నను నీకు
మగనిమీదికె దాని మరలించు టుచితమ్ము.
భర్తకన్నను వేరె పరదైవతము లేదు,
పతిసేవలో భార్య ప్రతిఘటిక గడపదగు.

అనంగలేఖ

స్వామీ, మే లగు చంపిన నను! మీ
ధర్మవాక్కులకు తాళంజాలను!
కడచు నమూల్యక్షణములు వ్యథ యయి
దయచేయందగు తల్పముమీదికి.

ఖంఖుడు

ప్రాణదాతకు జేయు ప్రత్యుపకృతి వాని
జాయతో నత్యంతసౌఖ్యంబు నొందుటా!

అనంగలేఖ (చిరునగవుతో)

ఆతని భార్యకు నధికసుఖమ్మును

ఒనగుటమాత్రము ఉపకృతి కాదా !
జామాత మిమున్ సంహరించు నని
బ్రాహ్మణహృదిలో భయము జనించెనె ?

ఖంఖుడు

[ముల
ప్రవహించుచునెయుండు బ్రాహ్మణావయవ
శూరరక్తం బెపుడు శ్రుతి మించిపోకుండ,
రాజపుత్రీ, తృణప్రాయమ్మ మరణమ్మ !
పరవశత్వము సరసభాషణమునకు, కృతికి.

అనంగలేఖ

భాషణమునకే పరవశత్వమా ?
మిము గికురించుట మిక్కిలి సులభము.
మగవారికి ప్రియమహిళామేదుర
బాహుబంధమున పరవశత్వ మగు
వేధింపక నను వేగమె స్వామీ,
దయచేయుం డిక తల్పముమీదికి.

ఖంఖుడు

రాజపుత్రీ, యింక రానీయ కా వాక్కు !
మన పూర్వబంధంబు మారిపోయెను నేడు.

(అనంగలేఖ తల్పమునుండి దిగి, ఖంఖుని నిపద్య కడ నిలువబడును)

అనంగలేఖ

ఏది స్వామీ, చూడు, డింతలో నే మార్పు!...
నమ్మలే కున్నాను!...నామీద ననురక్తి
తొలగిపోయిన దేమి త్రుటిలోన అక్కటా!

(అతడు శిరఃకంపము చేయును)

అనురాగ మున్నచో అక్కునం జేర్చుకొని
కౌగిలింపుడు నన్ను గాఢమ్ముగా స్వామి !

(మీదికి బోవును)

ఖంఖుడు

ఆలింగన మ్మొకటె అనురాగచిహ్నమా ?
గాఢరక్తికి అన్యకార్యముల్ కనరావ ?

అనంగలేఖ

నే నెరింగిన చిన్నె నిక్కమ్ముగ నిదే:
తలప నేను శరీరతర్పణం బొనరింప
నట్టి రాగము నెప్పు డధికానురాగముగ.

(కొంచె మాలోచించి)

అనుమానం బుదయించిన,
దస్మదీయసౌందర్యము
ఆకస్మికముగ తరుగగ
నాకర్షణ కోల్పడె నని.

ఖంఖుడు

శుక్లపక్షచంద్రుబోలె
మాచుచున్న కొలది నీదు
సౌందర్యతరంగంబులు
సర్వతోముఖోచ్చ నెసగు.

అనంగలేఖ

అగుదునేని నే శృంగా
రార్ణవకౌముది నిజముగ,
ఒక్కసారి మీ రందుల
నోలలాడదగదె స్వామి !

(ఖంఖుడు తల త్రిప్పును)

విసువు పుట్టియుండు నొక్క
వేళ మీకు నా కఠోర
యౌవనోర్మ్ములందు పాటు
అంతరంగమందు తోచి.

ఖంఖుడు

నిరుపమానసౌందర్యము
నిత్యయౌవనమ్ముతోడ
విరాజిల్లుచున్న నీవు
విబుధమత్తకాశినివే.
నిష్కల్మషహృదయముతో
నేటినుండి నీని నెల్ల

ధవునకే సమర్పింప
ధర్మ మగును రాజపుత్రి!

అనంగలేఖ

శుష్కించిన దేహముతో
సుఖ మేగతి గాంచగలను?
దీనమైన వదనమునెడ
దిదృక్ష యెటు కలుగు స్వామి!
భర్తతోడ పథ్యంబే!—
భవదీయోన్నత దేహము,
సౌందర్యంబును, ప్రధిమయు,
సరసతయును లేకుండుట!

(అతడు మందహాసము చేయును. ఆమె అతని పాదసన్నిధిని గూరుచుండి, జానువులు కౌగిలించి, ఒయ్యారముతో)

జవ్వనంబు జారు నన్న
శంక కలుగుచుండు స్వామి!
కాని, పుత్రు మీవలనను
కనవలె నను కాంక్ష కలదు.

శంఖుడు (నిదానముగా)

వలదు కుమారీ, వాంఛ విడువవలె,
భర్తవలననే పడయుము కొమరుని.
భరతవర్షమున బ్రాహ్మణబీజము
బహుక్షేత్రముల ఫలితం బయినది.
దీనికి ఫలితము ధిక్కారంబే
వివిధవర్ణముల విస్తృత మయినది.

అనంగలేఖ

బ్రాహ్మణభక్తికి ప్రతిఫలమా యిది!
ఈ జన్మములో నెటు మిము మరతును?

శంఖుడు

నిష్కల్మషమ్ముగా నీకు భక్తియె యున్న
సంపన్న మాసుమీ సకలశుభములు కూడ.

అనంగలేఖ

నా భక్తి నిదర్శనముగ
నన్ను సమర్పించుకొంటి!
ఎవరు రాజజామాత
ఇరువురిలో తథ్యముగా?

శంఖుడు

ఉండుగాక నింపు ప్రేమ,
ఉపపతి పతి యగునొక్కొ?
భర్తృపాదయుగళముపయి
పడుట మేలు రాజపుత్రి.

(అనునయముతో)

ఉజ్జగింపు మభిమానము:
ఉదారహృదయుండు మిగుల,
ఉత్తమకులసంజాతుం,
డుజ్జగింపలేడు నిన్ను.
గోపనమ్ము చేయు నీదు
గూఢవర్తన మ్మతండు.
మంగళమ్ము నీకు నతని
మనస్సు కరగింతువేని.
మరచిపొమ్ము నను కుమారి!
మందహాసకటాక్షములు
ప్రసారింపరా దెదురు
పడినయపుడు నీవు నేను.

అనంగలేఖ

ఎంత కఠినమానసమ్ము!
ఇంక మీకు నామీదను
అనురాగం బున్నయట్టు
లనుకొనుచో మందమతిని!

శంఖుడు (శాంతముగా)

గ్రహియింపలేవు నా గాఢానురాగమ్ము
ఉద్రిక్తహృదయవై యుంట రాజకుమారి!

అనంగలేఖ

అనురాగం బుండునేని
ఆలింగనచుంబనముల
కనుమతి నా కొసగవలయు
అంతిమవారమ్ము స్వామి !

(అతని నాలింగనము చేసి, ముద్దుపెట్టుకొనును. ఖుంఖుడు చలింపడు. కొంతతడవునకు —)

ఖుంఖుడు

క్షణికమైనదికదా కాయికం బగు సౌఖ్య,
మేమి యొరిగె కుమారి, ఇంతలోపల నీకు ?

(గంభీరముగా)

ఇంద్రియమ్ముల నిగ్రహించినపుడే ముదము.

(అనంగలేఖ అతనిపాదసన్నిధిని గూరుచుండును)

మరచిపోవడు పొందు
మాన్యతల్ బ్రాహ్మణుడు,
బహుగుణంబులు శుభ
ప్రదు డగును ప్రీతుడై.

అనంగలేఖ

బ్రాహ్మణసత్కారఫలముగా నశియించు
వితతసామ్రాజ్యముల్ వీక్షించుచుండగనె !

ఖుంఖుడు (వాత్సల్యముతో)

రమణీయకాశ్మీరరాజ్ఞి వగుదువు లెమ్ము.

(ఆమె లేచి నమస్కరించును. అతడు ఛురికను స్పృశించి)

శ్రీమద్బలాదిత్యక్షితినాయకుని పిదప
ధ్రువముగా రా జగును దుర్లభుండె అనంగ!
నిరుపపదంబుగా నే నున్న దుర్లభం
డగు ప్రతాపాదిత్యు డచిరకాలములోనె.
వదలి గోనందాన్వవాయలతికను లక్ష్మి
ప్రాలు కర్కోటకాన్వయభూరిశాఖపై.

(ఆమెవదనము వీక్షించును)

పోదునా యిక రాజపుత్రి ? నీ మానసము
కలతదేరినయట్లు కానబడుచున్నయది.

(అతనిని కౌగిలించుకొనబోయి, జంకి, వంగి, నమస్కారము చేసి, గంభీరముగా)

అనంగలేఖ

చిత్తము చిత్తము సేవించెద నిను
ఇష్టదేవతగ హృదయకుహరమున.

(అర్ధనిమీలితనేత్రయై)

అవనిస్థలిలో అనర్గళమ్ముగ
పరమోత్కృష్టము బ్రాహ్మణవాక్యము !

(ఖుంఖుడు గంభీరముగా నిష్క్రమించును)

---



కైలాసాలయపీఠమున అంకితమైన మదకరీంద్ర సంహతి



సీతాస్నానఘట్ట సమీపమందిరమున కైలాసమును కదపుతున్న రావణుడు

# కలకాదుసుమా!

[కథానిక]

●

'అమరేంద్ర'

వాన పొద్దుటినించీ ఒక్క వరసన కురుస్తోంది. ఆకాశంకేసి చూస్తుంటే ఇంతలో వెలిసే ఆశలు కనిపించటం లేదు. వర్ష దేవత ప్రతాపమంతా అపూరితశక్తి ఇవాళే చూపిస్తోంది. గాలికి ఎగిరిపోయిన కప్పు సందుల్లోంచి లోపలికి వాన కురుస్తోంది. మరీ ధారలుగా కురిసేచోట దుర్గ బిందె పెట్టింది. ఆ బిందె మీద జలతరంగిణి వాయిస్తూ వానచినుకులు ధనధనా పడుతున్నాయ్. "వానా వానాలు కురవాలి, వరిచేలు పండాలి, మా అమ్మ వండాలి" అంటూ పెద్దకొడుకు రంగడు గంతులేస్తున్నాడు. అన్నగారి పాటకి అనుగుణంగా తమ్ముడు కృష్ణుడు నీళ్లతో నిండిన బిందెమీద వెదురు కర్రతో తాళం వాయిస్తున్నాడు. పిల్లల అల్లరి చూసే సరికి తండ్రి శ్రీహరికి శివాలు ఎత్తినయ్. పెద్దకొడుకు చెవి గట్టిగా పిండుతూ "వెధవా, ఎప్పుడూ వెధవ ఆట లేనా? పద, వెళ్లు, ఎక్కడైనా దోసకాయలు కోసుకురా. అల్లా చూస్తావేం? నీకే చెప్పేది; వెధవా, కదులు ఇక్కణ్ణుంచి" అని అరిచాడు.

పదేళ్ల రంగడు తండ్రిచీవాట్లకీ, దెబ్బలకీ లొంగక నదురూ బెదురూ లేకుండా ముఖం చిట్లిస్తూ తలబిరుసుగా "నువ్వు పోరాదూ? ఇంట్లో నువ్వు చేసే పనేం మునిగిపోతోందీ? నువ్వు పో" అన్నాడు.

"ఏమిటే, తొండ ముదిరి ఊసరవిల్లి అయిందే? చాలాదాకా వచ్చిందే వ్యాపారం! పదేళ్ల వెధవకి ఇంత తలపొగరా? నీ తొక్క చీరేస్తాను. నీ తలకాయ గోడకేసి కొట్టి వెయ్యిముక్కలు చేస్తాను—" అంటూ చెయ్యి ఎత్తాడు శ్రీహరి.

అంతే, ఎత్తిన చెయ్యి ఎత్తినట్లే నిలబడిపోయింది. దుర్గ వచ్చి కొడుకుముందు నిలబడింది. తల్లిని చూడగానే రంగడికి ఎక్కడలేని ధిలాసా వచ్చింది. "ఎందుకు వాణ్ణి అనవసరంగా కొడతారు? వాడేం తప్పుమాట అనలేదే? ఇంట్లో గుడ్డిపురాలకి పళ్లతోముతూ కూచోకపోతే మీరే వెళ్లకూడదా? దమ్మిడీకి కొరగాని మీరు వాణ్ణి దెబ్బలుకొట్టి కట్టుదిట్టం చేస్తారా? ఏడిసినట్లే వుంది! ముందు మీరు వెళ్లండి." అని దుర్గ కొడుకుతరఫున వకాల్తా పుచ్చుకొని వెనకేసుకొచ్చింది.

పట్టరాని కోపంతో శ్రీహరి "నేనా? నేను వెళ్లనా? వెళ్లగలిగితే ఈ వెధవాయిని ఎందుకు బతిమాలుకుంటానూ?" అంటూ కాలుచాపి, "ఇదిగో చూడు, పాదం నేలమీద ఆనటం లేదు. మొన్న పెద్ద ముల్లు విరిగింది. మొన్న గుమ్మడితోటలో గుచ్చుకుంది. వెంటనే తియ్యటానికి వీలులేకపోయింది. దారినపోయే మనిషి ఒకడు "ఎంతకి కొన్నారు?" అన్నాడు. అణాకి కొన్నా నన్నాను. "అరెరే! బజార్లో కానీకే యిస్తున్నారు" అన్నాడు. అంతా లాభమేగా అని నాలో నేను అనుకున్నాను. ఈ ముల్లుబాధే నష్టం. ఇంట్లో గుమ్మడికాయ పడేసి ముల్లు తీసేసి సున్నం వేశాను. కాని అప్పట్నుంచీ ఆరికాలు నేలమీద ఆనితే ప్రాణం పోతోంది" అని దీనంగా వివరించాడు.

"మీకు తగిన శిక్షే జరిగింది. ఎక్కడికైనా ఏవస్తువుకోసమైనా వెళ్తే ఎంత జాగ్రత్తగా మెలగాలి! సరే, పోనివ్వండి. వాణ్ణి దోసకాయలకి ఎక్కడికి పంపుతున్నారు?"

"నేనేం ఢిల్లీకి పంపటంలేదులే. ఊరిబైట రామయ్యగారి దోసతోటలో భలే మంచికాయ లున్నయ్"

"కాని వాణ్ణి ఎవరైనా పట్టుకుంటారేమో, చిన్న వెధవని" అంది దుర్గ.

"ఏకేశారు, వాణ్ణి పట్టుకోకేం? అలికిడి విని వాళ్లు వచ్చేసరికి కంచె దూకి పారిపోయి రావచ్చును."

"చిన్నకుంకకి చేతకావద్దూ?"

"ఎందుకు చేతకాదు? ఒరేయ్ రంగా, సరిగ్గా నాబుజాలఎత్తున వుంటుందిరా. ఎక్కలేవుట్రా?"

"ఓ" అని ఒక్క గంతు వేశాడు రంగడు.

"చూశారా, మరి, ఇదంతా వివరంగా చెబితే వాడు వెళ్తాడు కాని తిడితే ఏం లాభముండీ? నాయనా రంగా, వెళ్లిరా. మా బాబువికాదూ. దోసకాయలు కోసుకురా బాబూ" అంది దుర్గ కొడుకుని లాలిస్తూ.

"ఛా, నే వెళ్లను. నిన్న సాయంత్రం నే వెళ్లలా? వెళ్లగానే వాళ్ల తోటమాలి బెత్తం పుచ్చుకుని చూడు వీపు ఎల్లా చిట్లగొట్టాడో? చూడు, ఇదుగో నీ చేత్తో నిమురు." దుర్గ కొడుకు వీపు చేత్తో నిమిరి, బుజ్జగించి "ఫరవాలేదులే బాబూ వెళ్లు. నిన్న వెళ్లకూడని వేళకి వెళ్లావు. ఇవాళ వత్తే నిన్నెవ్వరూ పట్టుకోలేరు. వాన జోరున కురుస్తుంటే కాపలా ఎవరుంటారు? మెమ్మదిగా వెళ్లి, వాలుగవైపులా పారజూచి దడి దూకు. కాయలు కోసుకుని వెనక్కి తిరిగి చూడకుండా దౌడుతియ్యి"

కొడుకు పరిగెత్తుకుని వెళ్లాక శ్రీహరి "ఇవాళ దోసకాయిపప్పు చెయ్యకే" అన్నాడు.

దుర్గ చేతులు తిప్పుతూ "బాగానే వున్నయ్ మీ మనసులు. నాకు బంగాళదుంప వేపుడు తినాలని మనసుగా వుంది. ఇంట్లో పప్పుగింజ అన్న మాట లేదు. మింగ మెతుకు లేదు మీసాలకి సంపెంగనూనె!" అని కసురుకున్నది. చేసేది లేక శ్రీహరి చెల్లం కొట్టిన రాయిలాగా కూచుండిపోయాడు.

దోసకాయలు వచ్చేలోపుగా ఎక్కణ్ణుంచో ఒక వుత్తరం వచ్చింది. టపాబంట్రోతు దారిన పోతూ ఉత్తరం వసారాలోకి విసిరి వెళ్లిపోయాడు.

ఆ వుత్తరం చేత్తో పుచ్చుకుని శ్రీహరి కొంచెం సేపు నిశ్చేష్టుడై కూచున్నాడు. అతనికి గడిచిన మూడేళ్లనుంచీ ఒక్క ఉత్తరమైనా రాలేదు. అతని అన్నగారు బతికున్నంతకాలమూ ప్రతినెలా ఒకటో తేదీన మనియార్డరు వచ్చేది. కింద కూపనులో అన్నగారు రెండు పంక్తులు రాసేవాడు. పిల్లల యోగక్షేమాలు అడుగుతూ అందరికీ తన ఆశీస్సులని అందజేస్తూవుండే వాడు. తరవాత ఒకరోజున అన్నగారి ఆకస్మికమరణ వార్తని మోసుకుని ఒక కార్డు వచ్చింది. అందగానే దాన్ని ఆచారంప్రకారం చించిపారేశాడు. అంతకి తప్ప ఆకొంపఅంతా గాలించినా ఒక్క ఉత్తరం ముక్కా దొరకదు.

కొంచెంసేపటికి శ్రీహరి వుత్తరం చదవటం మొదలుపెట్టాడు. వసారాలో ఇంకోమూల దుర్గ అటుకులు వేయిస్తోంది. టపాబంట్రోతు ఉత్తరం పడేసి వెళ్లటం చూసి మళ్లీ తన పనిలో తను మునిగింది. చదవగానే అందులో విశేషాలు భర్త తనకి వెంటనే చెబుతాడని దుర్గదృఢవిశ్వాసం. పగలంతా ఇంట్లో ఒకటే గందరగోళం. కాస్సేపు నవ్వులతోనూ, కాస్సేపు తిట్లతోనూ వాళ్ల కాలం గడిచిపోతుంది. చుట్టుపక్కల ఇరుగు పొరుగు లేని ఒంటరికుడిసె. అందువల్ల దుర్గ స్వగతాలతో పొరుగులేని కొరతని తీర్చుకోటం నేర్చుకుంది. భర్త ఇంట్లో లేనప్పుడు దుర్గ ఒక్కత్తే వసారాలో కూచుని తన పుట్టింటి వారి ఖ్యాతినిగురించీ, అత్తింటివారి ఖ్యాతినిగురించీ తలపోస్తూవుంటుంది. కాని భర్త ఇంటికి రాగానే తిట్లతోనూ, శాపనార్థాలతోనూ సత్కరిస్తుంది. ఆ వూళ్లో కోమటికొట్లో గుమాస్తాపని చేసి పదిహేను రూపాయలు తెచ్చుకునే శ్రీహరిసంసారం ఎల్లా గడుస్తున్నదా అని అందరికీ ఆశ్చర్యంగా వుంటుంది.

ఇంతలో రంగడు తిరిగివచ్చి నాలుగైదు నవనవలాడే దోసకాయలు కోసుకువచ్చి వసారాలో పారేశాడు. కృష్ణుడు గోళ్లతో కాయల్ని గిచ్చుతూ తనకి పెట్టమని గొడవ సాగించాడు. అటుకులు పొయ్యి మీదినించి దింపి దుర్గ పిల్లలకి పెట్టడానికి తీసుకొచ్చింది.

కాని శ్రీహరి ఉత్తరానికి కళ్లప్పగించి కూచున్నాడు. దోసకాయలు తరుగుతూ దుర్గ "ఏమండోయ్? మిమ్మల్నే పిలుస్తున్నది? అల్లా కూచున్నారేం కొయ్యబొమ్మలాగా? మాట్లాడరేం, దయ్యం

పట్టలేదుకదా?" అని అరిచింది. బదులుగా శ్రీహరి ఉత్తరం దుర్గమీదికి విసిరేశాడు. "ఏముంది సిగ్గేమైనా వుందీ? నాకు బాలశిక్షయినా కొని పెట్టినపాపాన పోయారా? ఒక్క అక్షరంముక్కయినా నాకు చెప్పారా?" అంది దుర్గ కోపంతో.

శ్రీహరి నవ్వాడు. ఆమెకి చదువు చెప్పించటం అతని బాధ్యత కాబోలు! ఆమె పుట్టింటివారు అంత గొప్పవారని తెగ ఉబ్బిపోతుంది. మరి వాళ్ల బాధ్యత ఏమీ లేదు కాబోలు!

శ్రీహరినవ్వు విని దుర్గ మండిపడింది; ఉత్తరం విసిరిపుచ్చుకుని ముసుడిముఖాన గిరాటువేసింది. "నవ్వుతున్నారా పైగా? చాల్లెండి. సిగ్గులేని ముఖానికి నవ్వే సింగారం" అంది.

దుర్గ కాపురానికి వచ్చి చాలాకాల మయింది. ఆమెతత్వం శ్రీహరికి బాగా వంటపట్టింది. ఇంకా సంభాషణ పెంచితే ఉపవాసం పడుకోవలసివస్తుందని గ్రహించాడు. తరిగిన దోసకాయముక్కలూ, వేయించిన అటుకులూ అతన్ని ఊరుకోనివ్వటం లేదు. అందుకనే నెమ్మదిగా "ఆఁ, ఏం లేదు. మా అమ్మాయి వస్తానని వుత్తరం రాసింది" అన్నాడు.

"అమ్మాయా, వస్తుందా?" అని దుర్గ ఆశ్చర్యంగా అడిగింది.

"అవు నవును. మాఅన్నయ్యకూతురు. మనకి డబ్బు పంపేవాడే-ఆయనకూతురు"

"తెలుసును బాబూ తెలుసు. నేనంత మొద్దుని కాను. మీరు ఇంత శ్రమపడి వివరించక్కర్లేదు. అన్నగారంటే అంత ఇదయిపోతారేం? ఆయనగారు మనకేం వేలకివేలు పెట్టారా? అయినా, చేతకాని తమ్ముడికి సాయం చేయటం అబ్బురమా? మా అన్నయ్య మాసండి—"

"సరే, మీఅన్నయ్యనిగురించే చెప్పు"

"మీకు కొత్తిగా చెప్పాల్సిం దేముంది? వాళ్ల మర్యాదలూ వాళ్ల పద్ధతులూ—" అంటూ మధ్యలో ఆగి "అయితే, ఆ అమ్మాయి ఏమని రాసిందండీ?" అని అడిగింది దుర్గ.

"నాకు చాలా చిత్రంగా వుంది. అది ఇక్కడికి వస్తుందట" అని భర్త అనగానే దుర్గ ఆశ్చర్యంతో కళ్లు పెద్దవి చేసింది.

శ్రీహరి "నిజంగానే వస్తుంది. ఇవాళో రేపో" అని మళ్లీ అనేసరికి దుర్గ "ఓ" అంది.

"ఓ ఏమిటి? నీ కేమీ అర్థంకావటం లేదా?"

"అవును, నా కెందుకు అర్థం అవుతుందిలెండి. నేను అన్నం తినటం లేదుగా. గడ్డి తిని బతుకుతున్నాను కాదూ? నా కెందుకు అర్థంఅవుతుందీ?"

"అయితే ఏమిటి తెలిసింది?"

"ఏమిటా? మీ అన్నగారి కూతురు ఇక్కడికి వస్తోంది. ఊరికే కాదు. మనని మన ఇంటినీ భక్షించటానికి వస్తోంది."

"అదేమిటి? అల్లాగంటా వేమిటి?"

"ఏముంది? మట్టిబుర్ర! అల్లా వెర్రిగా చూస్తారేం? కండి. కాఫీ అటుకులు నోట్లో వేసుకోండి. తరువాత మాట్లాడుకుందాం" అని కొంచెంసేపున్నాక "ఆ పిల్ల ఇంట్లో తిని ఇంటివాసాలు లెక్కపెడుతుంటే నేను చూస్తూ వూరుకోలేను. రాగానే వచ్చిన దోవనే సాగనంపుతాను" అంది.

శ్రీహరి నిట్టూర్పు విడిచి "నువ్వు పొరబాటు పడుతున్నావు" అన్నాడు.

"నేనా, నేనేం పొరబాటుపడటం లేదు. ఆ అమ్మాయి ఇక్కడికి భాగం పంచుకోటానికి రావటం లేదా?" అని అడిగింది.

"ఊఁహుఁ, కాదు"

దుర్గ ఆశ్చర్యపోయింది. "మరి అయితే దేనికి వస్తోంది? నైతక్కలాడి నలుగురికీ తన అందాన్ని చూపించటానికి వస్తోందా?"

"కాదు. విను. బడి లేని వూళ్లలో బళ్లు పెట్టే సంఘం ఒకటి వుందిట. పిల్లలకి చదువు చెబుతారుట. అందుకే మాయ ఇక్కడికి వస్తున్నదిట. ఇక్కడ బడి పెడుతుందిట"

"ఓహో, అల్లాగా" అని పెదవి విరిచి అటుకులకి నెయ్యి రాస్తూ కూచుంది దుర్గ.

అటుకులు పటపట నములుతూ "అయితే రమ్మని రాయనా ?" అన్నాడు. "రాదలుచుకుంటే రానివ్వండి" అంది దుర్గ. "వస్తే అది ఎక్కడ పడుకుంటుంది ?"అన్నాడు శ్రీహరి.

"అది మీరే తేల్చుకోవాలి !"

అమర్నాథుకూడా చినుకు పడుతూనే వుంది. ఒక గుడిసెబండీ వచ్చి శ్రీహరిగుడిసెముందు ఆగింది. దుర్గ పిల్లలతో వసారాలో నిలుచుని వుంది. శ్రీహరి వానలోజా ముంచి అదనుకనుక కూరగాయలు సంపాదించుకురావటానికి వెళ్లాడు.

ఒక వాజాకుపిల్ల బండీ దిగింది. చేతులో ప్లాస్టిక్ సంచీ లేదు. కాళ్లకి జోడు లేదు, కళ్లకి జోడు లేదు. మనిషి పొడుగ్గా అందంగా వుంది. వానజల్లుకి తడిసిన ఆ మొహం వింతసోయగంతో మెరుస్తోంది. చీర కట్టుకునే పద్ధతి కొంచెం వేరుగా వుంది. అంతకి తప్ప ఆ అమ్మాయిని పల్లెటూరిముఖం ఎరగని బస్తీపిల్ల అనుకోటానికి ఆస్కారం లేదు. బండీ దిగి బండి మనిషితో "అక్కో ఆ పెట్టే, ఆ బుట్టా లోపలికి తీసుకురా. ఇల్లు ఇదే కాదూ ?"అంటూ చకచకా వసారా లోకి వెళ్లింది.

కోపంతో నిండిన చూపుల్తో దుర్గ ఏదో అనబోతుండగా ఆ అమ్మాయి వంగి దుర్గకాళ్లకి దణ్ణం పెట్టింది. కోపం అణుచుకుంటూ, మర్యాదకి దుర్గ "లే అమ్మా లే. నువ్వు పదేళ్లు సుమంగళివై వర్ధిల్లు. నీ మంగళసూత్రం—"

అంటుండగానే అమ్మాయి నిటారుగా నిలబడి చిరునవ్వుతో "అప్పుడే అంత పెద్దదీవన లెందుకు పిన్నీ ? నా కింకా పెళ్లి కాలేదుగా"అంది.

దుర్గ నివ్వెరపోయి నోరు తెరచి ఆ అమ్మాయి కేసి చూస్తూ నిలబడింది. ఇంత పెద్దపిల్లకి ఇంకా పెళ్లి కాకపోవటం లేమిటి ? పైగా పెద్దవాళ్ల ముందు తన పెళ్లిసంగతినిగురించి ఎంత అవలీలగా నవ్వుతూ మాట్లాడుతోంది! కాస్తయినా సిగ్గులేని పిల్ల అని దుర్గ లోలోపల అనుకోసాగింది.

ఇంతలో బండీవాణ్ణి పంపించేసి "పిన్నీ, నా పేరు మమత. ఏంరా బాబూ, అల్లా రెప్ప వాల్చకుండా చూస్తున్నావ్ ? నా దగ్గరికి వస్తావా తమ్ముడూ ?" అని చిన్నకుర్రాణ్ణి పలకరించింది. బదులుగా తమ్ముడు తల్లిచాటుగా నక్కి తంతాను అంటూ కాలు ఎత్తాడు.

మమత నవ్వుతూ "తంతావా ? తప్పుకాదూ ? నేను నీకు అక్కనికాదూ ? అక్కని తంతే కళ్లు పోతయ్"అంది. కుర్రాడు "తప్పా, కాదు. తంతా, మళ్లీ తంతా"అని కాలు ఎత్తాడు. దుర్గ కొడుకుని కోప్పడలేదు. అంతే ముట్టకుండా మమతని ఉద్దేశించి "నువ్వెక్కడ వుంటావూ ?"అని అడిగింది. చిరునవ్వుతో మమత అంది—"తల్లి ఎక్కడ వుంటే కూతురూ అక్కడే. ఈ పాకలో నీకు చోటున్నప్పుడు నాకూ వుంటుందిగా."

"ఉంటే మంచిదే. కాని నువ్వు మాలాగా ఈ ముడిబియ్యం, ఈ కారంపచ్చళ్లూ తినగలవా? నీకు పాలూ పెరుగూ నెయ్యీ కాఫీ కావద్దూ" అంది దుర్గ ఎత్తిపొడుపుగా.

"అవునవును. బంగాళదుంపలు, కాబేజి, ఓవల్టీన్ ఇంకా ఇంకా చాలా కావాలి" అంది మమత ఛలోక్తిగా.

అది గ్రహించలేక దుర్గ చాలా విరుపుగా అంది—"ఆ రాజవైభవాలన్నీ మీబస్తీల్లో జరగవచ్చును. కాని పల్లెటూరి పేదవాళ్లం ఆ ఊడిగాలన్నీ ఎల్లా జరపగలం ?"

పిన్నిమాటలు పరిహాసానికి అన్నవి కావని మమత తెలుసుకోగలిగింది. "నా కేమీ అక్కర్లేదు పిన్నీ. మీ రేది తింటే నాకూ అదే పెట్టండి. కళ్ల కద్దుకుని తింటాను. ఏంరా బాబూ, మిఠాయి తింటావా ?" అని బుట్ట విప్పింది.

ఒక్కసారిగా ఎక్కడలేని చొరవా చనువూ వచ్చింది పిల్లలకి. మమతని చుట్టేసి "నే తింటా. నా క్కావాలి నా క్కావాలి" అని అరవటం మొదలు పెట్టారు. దుర్గకూడా దగ్గరికి వచ్చి నిలబడింది. మమత ఒక్కొక్కళ్లకి రెండేసి వుండలు పెట్టబోతోంది. అమాంతం దుర్గ బుట్ట తను లాక్కుని "నువ్వు వెళ్లి కాస్త విశ్రాంతిపుచ్చుకో మమతా. పిల్లు రాక్షసులు

అంతా ఒక్క క్షణంలో మింగేస్తారు" అంది. పిల్లల చేతుల్లో తలొక వుండా పెట్టి బుట్ట వాళ్లకి అందకుండా గూట్లో పెట్టింది దుర్గ.

బుట్టంతా దేవుడికి నైవేద్యం పెట్టాలే దని పిల్లలు దుర్గని చెడ తిట్టిపొయ్యటం విని మమత విస్తుపోయింది.

దుర్గ గొణుక్కుంటూ అరవటం మొదలు పెట్టింది. "ఎప్పుడూ పరగడుపే ఈ వెధవలకి. పంది వెధవలు. వీళ్లు చస్తే పీడ విరగడైపోతుంది. హాయిగా వుంటుంది నా ప్రాణానికి."

రంగడు, "ఎవర్ని చావమంటావు, నువ్వే చావు" అని కేకపెట్టాడు. "ఇంత పొగరుపోగరా? తొక్కి నారతీస్తాను" అని దుర్గ వాడిమీదికి ఉగ్రంగా ఉరికే సరికి చెప్పరాని పాడుతిట్లు తిడుతూ రంగడు వసారా దూకి వానలో తడుస్తూ పరుగుతీశాడు.

దుర్గ మమతకేసి చూసి "ఎల్లాగో రానే వచ్చావు. కష్టమో సుఖమో నాలుగురోజు లుండమ్మా. ఇదుగో ఈ సామానుగదిలో పడుకో. దాన్నిండా చెంబులూ, తప్పేలాలూ, తట్టలూ, బుట్టలూ. ఎల్లా పడుకుంటావో పాపం! ఆ బల్లమీద పడుకో. నీ పెట్టె నాగదిలో పెట్టించుతాను. ఎందుకైనా మంచిది." అంది. ఎల్లాగో మమతకి ఇంట్లో చోటు దొరికింది.

మమత కాళ్లూ చేతులూ కడుక్కొని సామాను గదిలోకి వెళ్లింది. గదినిండా కుండలూ బొచ్చెలూ, తట్టలూ బుట్టలూ చిందరవందరగా వున్నయ్. బల్లమీద కూచునేసరికి అది విరిగిపోయేట్లుగా కిర్రుకిర్రుమంది. ఊసులాడిపోయింది. చుట్టూ ఎలుకపెంటలు కుప్పలుగా పడివున్నయ్. ముక్కు మూసుకోవలసివచ్చేటంత మురికికంపు. కాని ఏం చేస్తుంది! అక్కడే పడుకోవాలి. ఎల్లాగో కొంచెం చోటుచేసుకుంది. పక్క పరుచుకోవాలని పరుపుచుట్ట ఇంకో గదిలోంచి పట్టుకురావటానికి వెళ్లింది. ఇది చూసి దుర్గ గబగబా ఒక బిందెడు నీళ్లెత్తుకునివచ్చి "వుండమ్మా అల్లాగే నిలబడు కొంచెంసేపు. పరుపుచుట్టని శుద్ధి చెయ్యొద్దూ" అని ఏవో మంత్రాలు చదువుతూ పరుపుచుట్టమీద నీళ్లుజల్లింది. ఎదురుమాట చెప్పకుండా మమత తన శుద్ధిపొందిన, సగంతడిసిన పరుపుచుట్టని మోసుకుపోయింది.

బైటినుంచి కేకలు వినిపించినయ్, "రంగా! రంగా! దొంగవెధవ ఎక్కడికి వెళ్లాడో! ఇదిగో కూరగాయలు. ఇంట్లోకి తీసుకుపో."

వసారాలోంచి దుర్గ నోటిమీద చెయ్యి అడ్డం పెట్టి, అరవకండి అని సైగచేసింది.

శ్రీహరి ఇది గమనించలేదు. "చావు పాడుముండా! ఇవి లోపలికి తీసుకుపోరాదూ? పైగా అరవద్దంటావా? ఒకమూల కుంటికాలితో చచ్చిపోతుంటే."

"మీరే చావండి" అంటూ దుర్గాంబ కూరల్ని లోపలికి తీసుకుపోయింది.

అన్ని కూరలు తెచ్చిన సంబరాన్ని ఆపుకోలేక "ఇవన్నీ ఎక్కడెక్కడ కొనుక్కొచ్చానను కున్నావ్! రామయ్యగారి తోటలో దోసకాయలూ, వీరయ్యగారి దొడ్లో వంకాయలూ—" అని చెప్పుకు పోతుంటే దుర్గ అడ్డంవచ్చి "సంతోషించాం. ఇంక చాలించండి. అట్టే మాట్లాడబోకండి" అంది.

"ఏం, ఎందుకు మాట్లాడకూడదూ? వారం రోజులకి సరిపడ్డ కూరగాయలు తెచ్చిపడేస్తే కమ్మగా తినగలవు కాని—" అని శ్రీహరి అంటుంటే దుర్గ దగ్గరికి వెళ్లి కోపంతో పళ్లుకొరుకుతూ "ఉత్త మట్టిబుర్ర. తెలివితేటలు ఏకోశానా లేవు" అని గదికేసి వేలెత్తి చూపించి "వచ్చింది" అంది.

తెలివితక్కువచూపుల్తో "ఎవరూ?" అని అడిగాడు శ్రీహరి. "ఎవరా? మనపాలిటి యమదూత!" అంటూ లోపలికి వెళ్లింది.

వాళ్ల మాటలు కొన్ని మమతకి వినిపించినయ్. బల్లమీద పక్క పరుచుకుని బైటికి వచ్చి బాబాయి కాళ్లకి నమస్కారంచేసింది. "నేను నిన్ననే వద్దా మనుకున్నాను బాబాయ్, కాని వీలుపడలేదు. ఎప్పుడో చిన్నప్పుడు చూశాను నిన్ను. 'మాయా' అని పిలిచేవాడివి నన్ను. నాకు నువ్వు యోగమాయ అనే పేరు పెట్టావని నాన్నగారు చెబుతూవుండే వారు" అని సంభాషణ ఆరంభించింది.

"అవునమ్మా మాయా, ఎన్నాళ్ళయిందో నిన్ను చూసి" అన్నాడు శ్రీహరి. "ఇప్పుడు నా పేరు మమత. నాకీ పేరు అమ్మ పెట్టింది బాబాయ్. రెంటికీ ఒకటే అర్థంకదూ ?" అంది మమత. శ్రీహరికి రెంటి అర్థమూ తెలియకపోయినా "చాలా మంచిపేరమ్మా. ఇదుగో నిన్నే నేస్. ఇవాళ మాయ వచ్చిందిగా. పప్పుకూర వండరాదూ ?" అని కేక పెట్టాడు. విని దుర్గ బైటికి వచ్చి మమతచాటున నిలబడి మూతిముడిచి శ్రీహరిమీద మెటికెలువిరిచింది. ఇది చూసి చిన్నకొడుకు కృష్ణుడు "నాన్నా, అమ్మ నీమీద ఇల్లా మెటికెలువిరిచింది" అంటూ తండ్రిదగ్గరికి వచ్చి ముఖం మీద తన చేతుల్తో మెటికెలువిరిచాడు.

కొంచెం బెదిరించే స్వరంతో "నాన్నని అల్లా అనచ్చా ? తప్పుకాదూ ?" అంది మమత.

కృష్ణుడు ఇకిలిస్తూ, "నువ్వు కోతివి" అని వెక్కిరించాడు. మమత "తప్పు" అంది కోపంతో కందిన ముఖంతో. జంకూ గొంకూ లేకుండా కృష్ణుడు ఇంకా పెంకిగా "నువ్వు కొండముచ్చువి" అన్నాడు. బెదిరించటానికి మమత వాడి చెవి పిండాలని చేత్తో పట్టుకుంది. కొంప మునిగినట్లు ఏడవటం సాగించాడు.

లోపలనించి రుసరుసలాడుతూ దుర్గాంబ "చాలునమ్మా చాలు. బాగానే వుంది. గడపలో అడుగు పెడుతూనే పంతులమ్మలాగా పిల్లలని చెండుతావా ! కన్నదాన్ని నాకు లేని పెత్తనం నీకెందుకూ ? కంచికి లేని దురద చాపకెందుకూ ?" అని బుసకొట్టింది.

మమత కృష్ణుణ్ణి వొదిలేసి విస్తుపోతూ నిలబడింది. ఇది చూసి శ్రీహరి "పిల్లలు కొంచెం అల్లరివాళ్ళమ్మా, చెప్పినమాట వినరు. వాళ్ళపాపాన వాళ్ళే పోతారు వెధవలు" అన్నాడు.

"వాళ్ళని కొంచెం అదుపాజ్ఞల్లో పెట్టరాదా బాబాయ్ ?" అని అడిగింది మమత.

వెక్కి మొహంవేసి దిక్కులు చూస్తూ శ్రీహరి "ముందు వాళ్ళకి పొట్టనిండా తిండి పెట్టగలిగితే చాలు. కట్టుదిట్టాలమాట తరవాత చూసుకోవచ్చు. అయినా పసివాళ్ళు. పెద్దవాళ్ళయితే వాళ్ళకే కుదురు వస్తుంది"

"ఇప్పుడు ఎన్నో క్లాసు చదువుతున్నారు ? ఇప్పుడే వొంచాలికాని పెద్దయితే లొంగుతారా ?" అంది మమత. శ్రీహరి తల గోకుకుంటూ "ఇంకొకటి రెండేళ్ళు పోయాక బళ్ళో వేస్తాను. అంగుల్లో నా పరిస్థితి వాళ్ళకి—" అంటుంటే మమత అందుకుని, "నాన్నగారికి చదువుసంధ్యలు లేకుండా తిప్పకాయలాగా తిరిగే పిల్లలంటే మంటగా వుండేది. అందుకే ఆయన నీకు ప్రతినెలా డబ్బు పంపిస్తూవుండేవారు" అంది.

దీనికి బదులు చెప్పలేక శ్రీహరి కళ్ళని చేతులతో తుడుచుకుంటూ "చూస్తుండగానే మన కళ్ళముందు నుంచి అన్నయ్య దాటిపోయారుగా" అని భోరున ఏడవటం మొదలుపెట్టాడు.

మాటలవల్ల లాభం లేదని మమత తెలుసుకుంది. అజ్ఞానం ఊడలువేసిన మర్రిచెట్టులాగా వాళ్ళ గుండెల్లో నాటుకుపోయింది. వీళ్ళకి బైటిలోకపు వెలుతురే సోకదు. కాని తన సాయశక్తులా ప్రయత్నిస్తుంది. ఈ అజ్ఞానాన్ని కూకటివేళ్ళతో పెకలించివెయ్యాలి. తను వాళ్ళతో వుంటూ ప్రేమతో వాత్సల్యంతో భయభక్తులతో మెల్లగా వాళ్ళని చీకటిలోంచి వెలుతురులోకి నడిపిస్తుంది. ఈపాడుపడుతున్న పేదగుడిసెలోనే అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేసే విజ్ఞానదీపిక వెలిగిస్తుంది.

ఇంతలో దుర్గ భర్తని ఇంట్లోకి పిలిచి "చూడండీ, మీరు పిచ్చివాళ్ళని నేను వూరికే అంటానా? మన సోదిఅంతా ఆపిల్లముందు ఏకరువుపెడతా రెందుకండీ ? నాలుగురోజులుండి లేవదారిన తాను పోయే పిల్ల మన కష్టాలు ఆరుస్తుందా ? తీరుస్తుందా?" శ్రీహరి "కాదు, చాలా మంచిపిల్ల. ఎంత చక్కగా మాట్లాడుతుందో చూడు."

"అల్లాగే అనుకోండి. ఆ అమ్మాయి భోగాలు పంచమని అడిగితే అసలురంగు అప్పుడు బైటపడుతుంది" అని దుర్గ చివాట్లుపెట్టింది. మమత అక్కడే వుందని శ్రీహరి తిరిగి చివాట్లు పెట్టకుండా వూరు

తున్నాడు. తననిగురించి ఆ అమ్మాయి ఏమనుకుంటుందో?

"చూడండి. ఈ కూరలు ఎక్కడెక్కడ కోసుకొచ్చారో ఆఅమ్మాయికి చెప్పక్కర్లేదు. చేతనయితే ఇవన్నీ అతి చౌకధరకి బజార్లో కొనుక్కొచ్చానని చెప్పండి. లేకపోతే నేనే సర్దిచెబుతాను" అని దుర్గ అనగానే శ్రీహరి తల వూపాడు.

తలకాయి ఆడించాడు కాని ఎందుకో మనస్సు వికలమై పోతోంది. చిన్నప్పుడు తను ఎత్తుకొని తిప్పిన అన్నగారి కూతురు మమత ముందు తనకి బెరుకు దేనికి? సిగ్గు దేనికి? కాని ఆమె చిరునవ్వుముఖం, ఆమె విధేయత, ఆమె వినయతా, ఆమె మాటతీరూ ఇవన్నీ అతని మనస్సుని సిగ్గుపడేట్లు చేస్తున్నయ్. ఏదో తీరనిలోటు తనలో కనిపించింది. తాటాకులు ఎగిరిపోయిన కప్పూ, పూటకూడా నిశ్చింతగా గడవని నిత్యదరిద్రం—వీటి వల్ల కలిగిన లోటు కాదు. చినిగిన గుడ్డలూ, అంతటా దరిద్రం తాండవించే ఇల్లూ—వీటినిగురించి తను మమత ముందర సిగ్గుపడటం దేనికి? తన స్థితిగతులు ఆమెకి తెలియవా! కాని కూరగాయల దొంగతనంమాదిరి నీచపు పనులు చేసినందుకు సిగ్గు, అభిమానం పెనగొని శ్రీహరిని తలక్రిందులు చేస్తున్నయ్. మమతకేసి చూడటానిక్కూడా చిన్నతనంగా ఉంది.

రెండు మిఠాయివుండలు భర్తకి తెచ్చిపెట్టి "తినండి" అంది దుర్గ.

"నువ్వు తిన్నావా?"

"ముందు మీరు తినండి. ఇదిగో చెయ్యి కడుక్కోటానికి నీళ్లు" అని గ్లాసెడు మంచినీళ్లు అందించి "ఏమిటీ అంటోంది?" అని అడిగింది.

"ఏముంది అనేందుకు?"

"అదుగో అందుకే నాకు ఒళ్లు మండుతుంది' భాగాలు పంచే విషయం మేమైనా ఎత్తిందా?

"మనకేం ఫరవాలేదు. మమత ఆపనిమీద రాలేదులే"

"అలాగయితే బడిపెడతావని ఎందుకన్నదీ? ఇక్కడ ఎక్కడ బడిపెడుతుంది?"

"ఇక్కడ అంటే ఈ స్థలంలో కాదు. ఈ వూళ్లో అన్నమాట".

"ఈ వూళ్ళో ఈవిడగారికి జాగా ఇవ్వటానికి ఎవరు కాచుకున్నారు! చూడండి. నామాట వినండి. పెంటదగ్గరనించి లెక్కలు కట్టించి విడగొట్టుకుంటుంది. అందుకే వచ్చింది ఆపిల్ల."

"నువ్వు చాలా నీచంగా మాట్లాడుతున్నావు"

"ఏమిటే!?" అని దుర్గాంబ ఉగ్రస్వరూపం ధరించేసరికి శ్రీహరి,

"ష్. ఊరుకో. వింటుంది" అన్నాడు.

"వింటే విననివ్వండి. నే నెల్లాగో పరువు తక్కువదాన్నేగా."

"అది కాదు బాబూ. మన బుర్ర లెప్పుడూ చిన్నవిషయాలమీదికే పోతయ్. కాని మమత మనలాగా కాదు."

"అదేం దేవతా! దిగివచ్చిందా!"

"కాదుకాని ఎందుకో దానిముందు నాకు చిన్నతనంగా వుంది. కాటానికి దానికంటె వయస్సులో పెద్దవాణ్ణే. దాని కేం తక్కువ అని ఇక్కడికి వచ్చిందీ! మనతోపాటు కష్టాలు పడవలసిన కర్మం దాని కెందుకు? అయినా దేనికీ లక్ష్యపెట్టకుండా వచ్చింది. ఈఊరి పిల్లలకోసం బడి పెట్టి వాళ్లని మంచిదారిలో పెడదామనే ఆశతో ఇంత దూరం వచ్చింది. ఇటువంటి పని తలపెట్టిందంటే దాని హృదయం ఎంత విశాలమైనదో నువ్వే ఆలోచించు."

ఈ మాటలు వినేసరికి దుర్గ కోపంతో భగ్గున మండిపోయింది. "అయితే వెళ్లి ఆ అమ్మాయికాళ్లు కడిగి నీళ్లు నెత్తిన జల్లుకోండి. నే నిలాంటివాళ్లని చాలామందిని చూశాను. అంతా కపటనాటకం. బడీ లేదు నాబొందా లేదు. ఆస్తి పంచుకోటానికి ఇదొక ఎత్తు."

"ఎందుకులే ఇప్పుడీవిషయంమీద రాద్ధాంతం. వెళ్లి నీపని చూసుకో"

"వెళ్తున్నానుకాని ఇటుసూర్యు డటు పొడిచినా నేను చెప్పినమాట అక్షరాల నిజమౌతుంది." అంటూ వంటింట్లోకి వెళ్లింది.

శ్రీహరి "దీని మాటలు వేదవాక్యాలు కాబోలు!" అని వెటకారంగా తనలో అనుకున్నాడు.

తన పక్క సవరించుకొని మమత వసారాలోకి వచ్చి బాబాయిపక్కన కూచుని "బాబాయ్ నేను రంగణ్ణీ, కృష్ణణ్ణీ ఒళ్లో వేస్తాను" అంది.

శ్రీహరి సంతోషంగా "మంచిదమ్మా మంచిది" అన్నాడు.

"ఇంటికప్పు ఎగిరిపోయింది. వానలు వెనకపట్టగానే మళ్లా కప్పించాలి" అంది మమత. బదులుగా శ్రీహరి నిట్టూర్పు విడిచిఊరుకున్నాడు. ఇది చూసి మమత "నే నెల్లాగా కొన్నాళ్లపాటు వుంటాను. నేనే కప్పిస్తా. నీకేం అభ్యంతరం లేదుగా?" అనగానే శ్రీహరి సంతోషంగా తన కేమీ అభ్యంతరం లేదని తల వూపాడు.

కొంచెంసేపున్నాక మమత "ఈ స్థలంలో బడి కట్టిస్తాను. ఏం బాబాయ్ ఏమంటావ్?" అంది.

శ్రీహరిమనస్సులో దుర్గమాటలన్నీ గింగురు మన్నయ్. ఇదంతా ఒక నాటకంలాగా కనిపిస్తోంది. మమతకేసి కొరకొరా చూశాడు. చిరునవ్వుతో మమత "ఇంతదగ్గరలో బడి వుంటే పిల్లల గొడవతో నీకు మధ్యాహ్నం నిద్రపట్టదని భయపడుతున్నావా బాబాయ్?" అంది. అతికష్టంమీద శ్రీహరి చిరునవ్వు నవ్వగలిగాడు.

"నీ కా భయం అక్కర్లేదు బాబాయ్. మేం పాఠాలు చెప్పే పద్ధతే వేరు."

శ్రీహరిముఖం కందిపోయింది. బదులు చెప్పకుండా కూచున్నాడు. "బాబాయ్ వాన వెలవగానే ఇక్కడొక చిన్న పాక వేయిస్తాను" అంది మమత.

శ్రీహరికి రూఢిగా తెలిసివచ్చింది. ఆతురాలా దుర్గ చెప్పింది నిజంగా తోచింది. ఈ తియ్యటిమాటల చాటున స్వార్థం దాగివుందేమో నని అతనికి అనుమానం కలుగుతోంది.

"ఏం బాబాయ్ మాట్లాడవేం?" అంది మమత అమాయకపుపిల్లలాగా.

"ఏమీలేదు; మాయా! ఏలుకాదు" అన్నాడు శ్రీహరి.

"ఎందుకని బాబాయ్? కారణం ఏమిటి?"

"ఆస్తి పూర్తిగా పంపకం జరిగితేకాని వీల్లేదు."

"ఏమిటి బాబాయ్ నీమాటలు? ఆస్తిపంపక మేమిటి? ఇదంతా నీదేకదా" అంది మమత.

గొంతు సవరించుకొని సంకోచాన్ని అణుచుకుని శ్రీహరి "కాదమ్మా ఇది ఉమ్మడిఆస్తికదూ, పంచుకునే ఏర్పాట్లు—" అంటుంటే మమత అడ్డువచ్చి "కాదు బాబాయ్. అంతా నీదే. ఒక్క అంగుళం కూడా నాన్నగారిది కాదు" అంది.

"దీనికి నా వొప్పుకోవద్దుటమ్మా?" అన్నాడు శ్రీహరి.

"ఆసంగతి నాకు తెలియదు బాబాయ్. నాన్నకి నే నొక్కతెనేకదా. నేను చెబుతున్నాను; ఈ ఆస్తి అంతా నీదే; అంతా నీదే. కావాలంటే కాగితంమీద రాసికూడా ఇస్తాను" అంది మమత ఆవేశంతో. ఈ మాటలు విని శ్రీహరి సిగ్గుపడ్డాడు. అంతకి మించిన సంతోషంతో అతనిగుండె కొట్టుకో సాగింది. మమతకేసి చూస్తుంటే అతని కళ్లలో అశ్రువులు చిందినయ్. తల వూపుతూ "తెలుసమ్మా మాయా! నీసంగతి నాకు తెలుసు, నాకు తెలుసు" అని సంతోషంతో అన్నాడు.

పొద్దుకుంకే వేళకి మధ్యాహ్నభోజనాలు అయినయ్. కాని వాన ఎడతెరిపి లేకుండా కురుస్తూనే వుంది. వసారాలో కూచుని మమత శ్రీహరితో చిన్ననాటి ముచ్చట్లు చెబుతోంది. పనివంకమీద ఆగదిలోంచి ఈ గదిలోకి తిరుగుతూ దుర్గ ఒక చెవి వాళ్ల సంభాషణకే అప్పగించింది. కాని శ్రీహరి తన్మయుడై వింటున్నాడు. ఈ పిల్ల అతన్ని బుట్టలో వేసుకునేట్లుంది. తన నాలుకదురద తీరేట్లుగా అమూల్యమైన సలహాలని భర్తకి అందించటానికి దుర్గకి అవకాశం చిక్కటంలేదు. సుడిగాలిలాగా వసారాలోకి వచ్చి "రాత్రికి ఏం వండమంటారు?" అని అడిగింది దుర్గ. శ్రీహరి చేత్తో బొజ్జ నిమురుకుంటూ బిగ్గరగా త్రేనుస్తున్నాడు. మమత "నా కేమీ వొద్దు. ఇంకా రాత్రికూడా తింటే నేను బతకను. ఇంకా

ఇప్పుడేం వంట చేస్తావు పిన్నీ ! కాస్సేపు నోర్మూసుకో" అంది.

"అంత అదృష్టంకూడానా ! అస్తమానం మరలాగా ఆడుతూవుండాల్సిందే. రాత్రికి భోజనం చెయ్యకపోతే పోయి పెందలకాడే పడుకో. తెల్లారి మాట్లాడుకోవచ్చునులే" అంది దుర్గ.

"నువ్వుకూడా వచ్చి కాస్సేపు కూచో పిన్నీ."

"అమ్మో, అంత అదృష్టంకూడానా నాకు ! పగలంతా ఎల్లా పనితో సతమతమవుతున్నానో చూస్తున్నావుగా. అయినా ఇంట్లో చుక్కయినా కిరసనాయిలు లేదు." అంది దుర్గ పాఠింపుగా. శ్రీహరి చికాకుముఖంతో "అయితే వెళ్లి పడుకో తల్లీ. నిన్న రాత్రంతా నీకు నిద్ర లేదుకాబోలు. పడుకో" అన్నాడు. కాని అప్పుడే పోయి ఆ గుహలో దూరబోటానికి మనసుకి ఇష్టం లేదు. చిమ్మెట్లూ, బొద్దింకలూ, ఎలుకలూ వాట్లమధ్య ఎల్లా పడుకోవాలో ? తలుచుకుంటేనే వొళ్లు జలదరిస్తోంది.

శ్రీహరి లేచి లోపలికి వెళ్లాడు. పిల్లలిద్దరూ అన్నం తినగానే నిద్రపోయారు. ఎంతసేపు తను ఒంటరిగా వసారాలో కూచోగలదు ? ఆ చీకటికొట్లోకి పోక తప్పలేదు.

పక్కగదిలోకూడా దీపం లేదు. గుసగుసలు విని పిస్తున్నయ్. "నేను చెప్పింది నిజమయిందా లేదా ? నేను అన్నంతా జరిగిందా లేదా ?"

ఒకళ్లకొకళ్లు కనబడటంలేదు. శ్రీహరి మెదలకుండా పడుకున్నాడు. కోపంతో దుర్గ ఒక గిల్లు గిల్లి "నోరు పడిపోయిందా ? మాట్లాడవేం ?" అంది. చికాకుతో శ్రీహరి దూరంగా జరిగాడు.

అంతటితో వూరుకోలేదు. అతనిదగ్గరికి జరిగి "సిగ్గులేనిమొహమా ! మాట్లాడూ. ఆ అమ్మాయిని చూడగానే కరిగిపోయారు. అది డబ్బు ఇస్తుంది, పొలం ఇస్తుంది, ఇల్లు బాగుచేయిస్తుంది, పిల్లలకు చదువు చెప్పిస్తుంది. దాని డాబులకి అంతుందా ? ఏం, నేను చెప్పింది నిజమయిందా లేదా ?" అని నిగ్గదీసింది దుర్గ.

ఎటూ తప్పుకోలేక శ్రీహరి, "తప్పకుండా నిజమే. నువ్వు చెప్పినమాట నిజం కాకుండా ఎల్లా పోతుంది ?" అన్నాడు.

"ఇప్పటికి తెలిసివొచ్చిందా ! కానియ్యండి. దానికి నే నీరాత్రే తగిన శాస్తి చేసి మంచి పాఠం చెబుతాను" అంది దుర్గ.

"ఏమిటి ! ఏం చేస్తావేమిటి కొంపతీసి ?" అని ఆదుర్దాగా అడిగాడు శ్రీహరి.

"చూసుకోండి ఏం చేస్తానో ! దాని జుట్టు నా చేతికి చిక్కింది. దాని ఆయువుపట్టంతా ఈ పెట్టెలో వుంది. ఇది చూసుకు నేగా అన్ని బడాయికబుర్లు !"

"ఏమిటీ ! ఆ పెట్టె పగలకొడతావా ?" అని శ్రీహరి వొణికిపోతూ అడిగాడు. బదులుగా దుర్గాంబ విసుగునవ్వు నవ్వింది.

"వొద్దే ! నీకు పుణ్యముంటుంది ! ఆ పనిమాత్రం చెయ్యకు. నిన్ను బతిమాలుకుంటున్నాను. నామాట విను. నేను దాన్ని వెళ్లిపొమ్మని చెబుతాను."

"అది ఎందుకు వెళుతుందీ ?"

"నీ కెందుకు ? ఎల్లాగో పంపిస్తానుగా. నువ్వు పనిమటుకు చెయ్యకు. చేస్తే నాతోడు. ఇప్పటికే ఎందుకో చిన్నతనంగా వుంది. ఇక అసలు తల నరికేసినట్టే అవుతుంది" అని దీనంగా బతిమాలుకున్నాడు.

భర్తనడవడికి దుర్గ ఆశ్చర్యపోయింది. ఇంత చిన్న విషయానికి ఎందుకింత బాధపడతాడు ? ఆ అమ్మాయిముందు తలవంపులు జరిగితే ప్రాణమే పోతుందని మాట్లాడతాడేమిటి ! ఇతరుల తోటల్లో నించి అవలీలగా కూరగాయలు దొంగిలించే మనిషి, పట్టుబడితే అబద్ధాలు అల్లి తప్పించుకునే మనిషి, ఇవాళ ఎందుకిల్లా మారిపోయాడో దుర్గకి అర్థం కాలేదు. పెట్టెలో బోలెడు డబ్బుండితీరాలి. చేతులో చిక్కిన డబ్బునే అక్కర్లేదంటున్నాడు. ఆ డబ్బంతా తన చేతికి చిక్కితేనా ? అందరికీ కొత్తబట్టలు కొంటుంది. గుడిసెకి కొత్తకప్పు వేయిస్తుంది. దొడ్లో వడ్లకొట్టు కట్టిస్తుంది. ఇంటిచుట్టూ మంచి ప్రహారీగోడ కట్టిస్తుంది. ఇంకో చిన్న పాక

వేయించి మంచిపాడిఆవుని కొంటుంది. ఇటువంటి ఆశలెన్నో మనస్సులో పెరిగిపోయినయ్. తీరని కోరికలతో ఆమెగుండె రగిలిపోయింది. రాత్రి వాన హోరు ఎక్కువైనకొద్దీ దుర్గాంబగుండెల్లో ఆరాటం కూడా మితిమీరుతున్నది.

మమతిసూట్‌కేసు దుర్గతలదగ్గరే వుంది. ఆ పెట్టెలో ఆమె చిరకాలంనుంచీ చేసిన తపస్సుకి ఫలం దాగివున్నట్లనిపించింది. ఆమెతీరనిదాహాన్ని చల్లార్చే చలివేంద్రం అందులోనే వుంది. దుర్భరదరిద్రబాధతో మగ్గిపోయే దుర్గహృదయంలోని మధురస్వప్నాలన్నిటినీ నిజం చేయగల నిక్షేపం ఆ పెట్టెలో దాగివుంది. కోరికలతో వేడెక్కిపోయిన ఆమెచేతులకి ఆ పెట్టె చల్లగా తగులుతోంది. వొణికే చేతుల్తో ఎన్నోసార్లు ఆ పెట్టెని తాకింది. దాన్ని చేత్తో తాకుతుంటే స్వర్గాన్ని తాకుతున్నట్లే అనిపిస్తోంది.

ఎల్లాగో తెల్లవారింది. వాన వెలవలేదు. అన్నం కోసం పిల్లలు ఏడవటం సాగించారు. దుర్గ రోజూ లాగా విసుక్కోలేదు. నిన్నటి బుట్ట తెచ్చి ఒక్కొక్కళ్ల చేతుల్లో రెండేసి మిఠాయివుండలు పెట్టేసరికి పిల్లలు పొంగిపోయారు. భర్తస్నానానికి నీళ్లుపెట్టి తను వంటకి పొయ్యి రాజేసింది.

శ్రీహరి స్నానానికి వెళ్లాడు. మమత వచ్చి దుర్గని "పిన్నీ, నా పెట్టె ఎక్కడ పెట్టించావు? బట్టలు మార్చుకోవాలి" అంది.

పనిలో వంచిన తల ఎత్తకుండానే దుర్గ "నాగదిలో వుంది. పోయి తీసుకో" అని బదులు చెప్పింది.

గదిలో అడుగుపెడుతూనే మమత తన పెట్టె తీసి చూసి కొయ్యబారిపోయింది. మూత తెరిచి కృష్ణుడు రెండు చీరెలు లాగి ఇవతల పారేశాడు. వాటితోపాటు అద్దం, దువ్వెన, పౌడరుడబ్బాకూడా ఇవతల పడ్డయ్. ఆ విలువైన చీరెలు చాపల్లాగా నేల మీద పరిచి పిల్లలిద్దరూ దొల్లుతూ ఆటలాడుతున్నారు. లుంగలు చుట్టేస్తున్నారు.

పెట్టెదగ్గిరికి పరిగెత్తింది మమత. లోపల చెయ్యి పెట్టి చూసింది. బట్టలూ, లోపలున్న వస్తువులూ ఒకటొకటే తీసి బైట పడేసింది. అసలు వస్తువే అందులో లేదు. వెలవెలబోతున్న ముఖంతో "కృష్ణా, నా డబ్బుల సంచీ ఏది? తీశావా? ఎక్కడ పెట్టావు?" అని అడిగింది. వాడు తల తిప్పుతూ "ఏమో, నాకేం తెలుసూ?" అన్నాడు.

"అయితే పెట్టె నువ్వు తెరవలేదూ?" అని ఆవేశంతో అడిగింది.

"అవును. నేనే తీశాను మూత"

"మా బాబుకదూ. బంగారుకొండవి. నీకో రూపాయిస్తాను. నా సంచీ నా కివ్వు" అని బతిమాలింది.

"ఏమో, నాకేం తెలుసు పో" అన్నాడు కృష్ణుడు పెంకెగా. చిందరవందరగా పడివున్న వస్తువులకేసి నిర్జీవప్రతిమలాగా చూస్తూ కూచుండిపోయింది. డబ్బుసంచీ ఎల్లా పోయిందా అని తీవ్రంగా ఆలోచించసాగింది.

లోపలినుంచి వచ్చే ఆక్రోశాన్ని ఎల్లాగో అణుచుకుని గబగబా పెట్టె సర్దుకుంది. తాళం మాయం అయిపోయింది. త్రాడుతో కడదామని దుర్గదగ్గిరికి వెళ్లి "పిన్నీ, ఒక తాడుముక్క ఇస్తావూ?" అని అడిగింది. బదులుగా చీరెనుంచి చింపిన గట్టి జరీఅంచు మమతముందు పడేసింది. అదితీసుకుని పెట్టె గట్టిగా బిగించింది. అప్పుడే స్నానం కానిచ్చి వచ్చిన శ్రీహరి "ఇదేమిటమ్మా, మాయా? అప్పుడే పెట్టె సర్దుకున్నావేమిటి?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

మమత బలవంతాన ఒక చిరునవ్వు ముఖంమీదికి రప్పించి "వెళ్లాలి బాబాయ్. నే నొక ముఖ్యమైన వస్తువు మరచిపోయాను."

"ఈ వానలో ముసురులో ఎల్లా వెళ్తావమ్మా, ఉత్తరం రాస్తే వాళ్లు పంపుతారుగా?"

"కాదు బాబాయ్. ఇవాళ వెళ్లితీరాలి. లేకపోతే చాలా ఇబ్బంది కలుగుతుంది. రైలు ఎన్ని గంటలకి? కాస్త బండీ పిలిచిపెడతావా బాబాయ్"

ఇంకా బలవంతం చెయ్యకుండా శ్రీహరి బండీ కోసం వెళ్ళాడు. రాత్రి దుర్గసంకల్పం విన్నాక మమత ఎంత దబ్బున వస్తే అంతమంచి దని అతనికి తోచింది.

నీళ్ళకి వెళ్ళి దుర్గ తిరిగివచ్చి వసారాలో దిగాలు పడి కూచున్న శ్రీహరిని చూసింది. పిల్లలు గంతులేస్తూ ఆడుకుంటున్నారు. ఎక్కడా మమతఅలికిడి లేదు. ఎక్కడా కనిపించలేదు. వెళ్ళి పోయింది మమత. వచ్చిన దారినే వెళ్ళింది. తను రేవులో చాలా ఆలస్యంచేసింది. వొంటిమీదా, ముఖంమీదా ఎన్నాళ్ళనుంచో పేరుకున్న మురికిని సువాసనసబ్బుతో పులికాపుచేసింది. తన చేతుల్ని వాసనచూసుకుంటూ ఆ సుగంధానికి దుర్గ మురిసిపోయింది. మన స్సెందుకో రెక్కలుకట్టుకుని ఎగిరేట్లుగా వుంది. మరిచిపోయిన పాతపాట ఏదో గుర్తుకివస్తే ముక్కుమాటతో కూనిరాగం తీసింది.

గదిలోకి వెళ్ళి దుర్గ బట్టలు మార్చుకువచ్చింది. అత్తరువాసనలు కొడుతున్న బంగారుజరీచీర కట్టుకుంది. గాలిలో తేలిపోతోంది. ఇక తను పూర్తిగా మారి పోవాలని దుర్గ తీర్మానించుకుంది. ఇంకెప్పుడూ కటువుగా మాట్లాడదు. ఆ అమ్మాయిలాగే తనూ ఎంతటి నష్టమైనా మౌనంగా సహిస్తుంది. ఎంతటి అవమానాన్నయినా చిరునవ్వుతో భరిస్తుంది. డబ్బులోనూ, అందంలోనూ, ప్రేమలోనూ, దయలోనూ తను ఆ అమ్మాయికి ఎందుకు తీసిపోతుంది? ఇంటికి కొత్త కప్పూ, తమకి కొత్తబట్టలూ, పాలకి ఆవూ, చుట్టూ ప్రహరీ—అన్నీ సాధించేస్తుంది. తనూ, భర్తా కాపురానికివచ్చిన కొత్తలో వున్నంత సంతోషంగా ఇక ముందు కాలం గడుపుతారు.

ఇంతలో "ఇవాళ వంటచెయ్యవా యేమిటి?" అని అరిచాడు వసారాలోంచి శ్రీహరి.

"చేస్తాను. బంగాళదుంపకూర, ఉల్లిపాయ సాంబారు—" అని దుర్గ అంటుంటే, చికాకుగా శ్రీహరి, "తరవాత పరిహాసాలాడుదుగాని ముందు వంట చెయ్యి. మమతని తరిమివేసినందుకు పొంగిపోతున్నట్లున్నావు. నామనస్సేమీ బాగా లేదు."

ఎన్నడూ లేనంత మృదుస్వరంతో దుర్గ "నాకు మాత్రం విచారం లేదుటండీ?" అని దీర్ఘాలుతీస్తూ వసారాలోకి వచ్చేసరికి ఆవేశం మాని శ్రీహరి విత్తర పోయాడు. "ఏమిటే? నీ గొంతుకూడా మారినట్లుందే? ఒక్కసారిగా కొత్తదానివైపోయావే?"

విలాసంగా చిరునవ్వునవ్వుతూ దుర్గ "మీరు కొత్తదాన్ని అనుకుంటే కొత్తదాన్నే. ఎందుకల్లా దిగాలుపడి కూచుంటారు? లెండి. నా మాట వినండి. లోపలికి రండి. ఇదుగో—" అంటూ రూపాయలు గలగలలాడించింది.

రూపాయలమోత వినబడేసరికి శ్రీహరి కొరడా దెబ్బతిన్న మనిషిలాగా ఎగిరిగంతేశాడు. అంత అనుకోకుండా మమత వెళ్ళిపోవటానికి కారణం మెరుపులాగా స్ఫురించింది. మమతటాయిలెట్‌సామాన్లన్నీ చుట్టూ పరుచుకుని అద్దంముందు కూచుని దుర్గ అద్భుతంగా అలంకరించుకుంది. నుదుటిమీద తిలకం దిద్దింది. తుమ్మెదరెక్కలలాటి నిగచుట్టుమీద బంగారు జరీమేలిముసుగు సవరించింది. వేళ్ళతో ఇంత స్నోము తీసుకుని ముఖానికి మర్దనచేస్తోంది.

ఈ అలంకారాలకి ముగ్ధుడు కాలేదు శ్రీహరి. రౌద్రరూపంతో, జ్యోతుల్లాగా మెరిసే కళ్ళతో, కఠిన కంఠస్వరంతో "దుర్గా" అని కేకపెట్టాడు. దుర్గ వెనక్కి తిరిగి చూసింది. సౌమ్యదరహాసంతో, సిగ్గు తొణికే కంఠంతో "ఏమిటండీ?" అంది.

"ఏమిటండీ" అని దుర్గ అన్న స్వరంలోనే వెక్కిరిస్తూ అని, "పెళ్ళికూతురు వేషాలు వేస్తున్నావా? ఈఆటలు కట్టిపెట్టు. నిజం చెప్పు" అన్నాడు శ్రీహరి.

"అబద్ధం చెప్పాల్సిన అవసర మేముందీ?" అంది కళ్ళుతిప్పుతూ.

"నిన్నరాత్రి మమతపెట్టె పగలకొట్టావా?"

అవునని తల వూపుతూ పెంకిపిల్లలాగా "అవును, నిజమే" అంది కొంచెంకూడా సంకోచంలేకుండా.

దాని వస్తువులన్నీ దొంగిలించావా?"

"ఆహా, అన్నీ కాజేశాను. డబ్బుకూడా"

"నీకేం సిగ్గువెయ్యలా? సంకోచం కలగలా? పైగా దాని చీరె సింగారించి, దాని స్నో పులుముకుని కులుకుతున్నావా? పచ్చి దొంగవి" దుర్గ మెత్తగా అంది—"దొంగలు కానివా రెవరండీ? కొందరు చేతుల్తో దొంగతనంచేస్తే కొందరు మనస్సుల్తో చేస్తారు"

ఆపుకోలేని కోపంతో శ్రీహరి గజగజ వణికి పోయాడు. దుర్గ అద్దంవైపు ముఖం తిప్పుకుని "ఎందుకంతకోపం మీకు? కూచోండి. మమత తెలివి తక్కువమొద్దు కాదు. ఇది గ్రహించిందికనకనే మెదలకుండా వెళ్లిపోయింది. ఒక్కసారి ఇల్లా చూడండి. ఇవాళ నేను మీకళ్లకి ఎంత బాగున్నానో చెప్పండీ?" అంది ఎంతో విలాసంగా.

ఇక సహించలేకపోయాడు శ్రీహరి. పట్టలేని కోపంతో నేలమీద పడ్డ రూపాయిబిళ్ల ఒకటి చేత్తో పుచ్చుకుని బలంకొద్దీ దుర్గముఖాన విసిరికొట్టాడు. ఆ రూపాయి సూటిగా వెళ్లి దుర్గనుదుటికి తాకింది. చీరుకుపోయి నెత్తురు చిమ్మింది. దుర్గ 'అమ్మా' అని ఒక్కమూల్గుమాత్రం మూలిగింది. మెదలకుండా ఒక తువాలు తీసుకుని అతిశాంతంగా గాయాన్ని అద్దుకున్నది. ఎప్పటిలాగా శ్రీహరిమీదికి ఎగిరిదూకలేదు. ఇప్పుడామెకి భర్తమీద కోపం లేదు. ఇప్పుడామె కప్పుఎగిరిన పూరిగుడిసెలో పేదబతుకుబరువుకి కుంగిపోయే నిర్భాగ్యురాలు కాదు. ఇప్పుడు దుర్గ ఆదర్శ గృహలక్ష్మిగా మారిపోయింది కాబోలు! ఇకనుంచీ కొత్తఅవతారం ఎత్తుతుంది కాబోలు!

తువాలుతో నెత్తురుచుక్కలు తుడిచేసి గాయం మీద ఇంకొంచెం స్నో రాసి వేళ్లతో రుద్దుతూ అద్దంముందు కూచుని ఎంతో ఒయ్యారంగా "కాదు సుమా కల కాదుసుమా!" అని కూనిరాగం అందుకుంది.

(వంగమాతృక ననుసరించి)



# మేఘసందేశము

౧

'సంపత్'

స్వాధికారప్రమత్తతకు వత్సరభోగ్య
మైన ప్రభుశాపమున విరహకాతరు డగుచు
మహిమకోల్పడి యక్షు డొకడు కాపుర ముండె
జనకతనయాస్నానపుణ్యోదకములతో
సుస్నిగ్ధశీతలచ్ఛాయావనస్పతుల
తో రమ్యమగు రామగిర్యాశ్రమములందు.
కనకవలయభ్రంశరిక్తప్రకోష్ఠుడై,
ఆ కామి, కాంతావియోగి, ఆ కొండలో
కొన్ని నెలలను గడపి, ఆషాఢమున ప్రథమ
దివసమున ఆశ్లిష్టసానువై కోరాడు
పరిణతగజమ్మువలె ప్రేక్షణీయమునైన
మేఘమును దర్శించె. కౌతుకాధాన హే
తువు కాగ దానిముందట నెట్లొ సంస్తంభి
తాస్రుడై నిలుచుండి చింతించె దీర్ఘముగ
ధనదపరిచారకుడు ; మేఘావలోకనము
తో సుఖులకే చిత్త మన్యథావృత్తి యగు
చుండ, కంఠాశ్లేష కామినీజనము దూ
రమునయుండు కలవారి మాటేమి ? ఆసన్న
నభమునం దతడు దయితాజీవితాలంబ
నార్థియై మేఘుచే తన కుశలవృత్తమును
పనుపగోరుచు, నూత్న గిరిమల్లికాకల్పి
తార్ఘ్యమున ప్రియమధురమగు స్వాగతము పలికె.
ధూమమ్ము, జ్యోతిస్సు, సలిలమ్ము, పవనమ్ము
శెరసి రూపుగ నొందు మేఘుండు తా నేడ ?
పటుకరణచేతనప్రాపణీయములైన
సందేశము లవేడ అని పరిగణింపకయె
యక్షు డౌత్సుక్యమున యాచించె మేఘమును
కామార్తు లగువారు సహజముగ నెల్లపుడు
చేతనాచేతనములందు కృపణులు కారె!
"ఎరుగుదును పుష్కలావర్తకమహోవంశ
మున బుట్టి, కామరూపుడ వగుచు, దేవపతి
మనసు కెక్కినవాడ వని నిన్ను ; కావునను
విధివశముచే బంధుజనదూరమై నేను
ప్రార్థించుటయు నిన్ను. విఫలమయ్యెను గాను
వర మధిగుణునియందు ; సఫలమయ్యెను కాదు
యాచ్ఞ అధమునియందు; సంతప్తు లగువారి
కోహో పయోదమా ! నీవె శరణము ; కాన
ధనపతిక్రోధవిశ్లేషితుని నాదైన
సందేశమును పూని ప్రణయినికి గొనిపొమ్ము.
యక్షేశ్వరావాస మమలబాహ్యోద్యాన
సంస్థాయిహరశిరశ్చంద్రికాధౌతహ
ర్మ్యశ్రీమ్మైన అలకయే నీకు గంతవ్యమ్ము.
ప్రత్యయాశ్వాసమున పథికవనితలు నిన్ను
పవనపదవీస్థితుని, ముంగురులు పైకెత్తి
చూతు రుత్కంఠతో విరహవిధురను జాయ
నెవ డుపేక్షించు సన్నద్ధుడై నీ వుండ
నావలె పరాధీనవృత్తి నుండనివాడు ?
అనుకూలపవనములు నిను మందమందముగ
త్రోయుచున్నవి ; సగంధముగ చాతకము
పలుకుచున్నది అదిగో మధురముగ నెడమ దెస.
నయనసుభగుని నిన్ను గగనతలమున వచ్చి
సేవించు నిక బలాకాబద్ధమాలికలు
పొంది గర్భాధానము నెడి క్షణపరిచయము.
దివసములు లెక్కించు పతిపత్ని, వ్యాపన్న
కాని వదినెను నీవు తప్పక విలోకింతు.
ప్రాయికముగా విప్రయోగమున పడిపోవు
సుమసదృశ మైనట్టి ప్రణయిహృదయము పట్టి
నిలుపు నాశాబంధ మంగనాజనములకు.
ఈ పుడమి నుచ్ఛిలీంధ్రము, నవంధ్యము చేయు
నీ శ్రవణసుభగగర్జితము నాకర్ణించి

మానసోత్కములైన రాజహంసలు మసృణ
బిసకిసలయచ్ఛేదపాథేయవంతములు
కైలాసగిరిదాక గగనమున తోడగును.

కాలకాలములందు నీపొందు తానొంది
చిరవిరహజోష్ణబాష్పము రాల్చి తన చెలిమి
ప్రకటించు ప్రియసఖుని, నిఖిలవంద్యములైన
రఘుపతిపదాంకములచే నొప్పు మేఖలుని
ఉత్తుంగశైలపతి నితని కౌగిట దార్చి
ఆపృచ్ఛనము చేసి యరుగు మాకల నీవు
మేఘజలద! విను మిపుడు నీ ప్రయాణానురూ
పము నడువు మార్గమును. ఆపైని వినగలవు
శ్రవణపేయమైన నాదు సందేశమును
సొమ్మసిలి గిరిశిఖరములయందు పదమూని
సన్నగిలి పరిలఘుపయస్సు నదులను గ్రోలి!
పోగలవు ముందరికి. పవనుండు కొండశృం
గము నెత్తుకొని పోవుచుండెనా ఏమి యని
మోములను పైకెత్తి ముగ్ధసిద్ధాంగనలు
చకితచకితము కాగ కన్న, సంబరపడుచు
సరసనిచులస్థాన మిటనుండి పైకెగిరి
పో ముదఙ్ముఖుడవై, పరిహరించుచు దారి
లో స్థూలదిఙ్నాగహస్తావలేపములు.

రత్నరుచిసంకరమువలె దర్శనీయమై
ఆఖండలుని ఈ ధనుఃఖండ మెదురుగా
నిదిగో వల్మీకాగ్రమునుండి ప్రభవించు
పింఛరింఛోళిచే గోపవేషములోని
హరివైన నీలంపు తనువునకువలె నీకు
దీన నతితరమైన కాంతి సంక్రాంతమగు.

కృషిఫలము తావకాధీనమై యున్నదని
భ్రూవికారానభిజ్ఞములు, ప్రీతిస్నిగ్ధ
ములునైన జనపదవధూలోచనములు త్రా
గుచు నుండ, నూత్నసీరోత్కషణసురభికే
దారమగు మాలమున వర్షించి కొంచెముగ
పెడకొదిగి, మరల లఘుగతిపూని, చను ముత్త
రపుదిశకు. ఆమ్రకూటాద్రి నిను నాసార
ప్రశమితవనోపప్లవుని, పథశ్రమగతుని
మూర్ధమున ధరియించు. ప్రథమసుకృతాపేక్ష
తో సఖులు ప్రాపునకు తారసిల క్షుద్రులును
కారు విముఖులు అట్టి యున్నతుని మాటేమి?

శృంగ మధిరోహించి, స్నిగ్ధవేణీసవ
ర్ణుడవు నీ వుండగా, ఆమ్రకూటాచలము
వనచూతపక్వఫలసంఛన్నపార్శ్వమై
నడుమ నలుపును శేషవిస్తారపాండురత
కల వసుంధరకుచమువలె దోచు నిజముగా.
నమరమిథునప్రేక్షణీయ మగు శోభ పొంది.

వనచరవధూభుక్తకుంజములచే నొప్పు
దానిలో నొక ముహూర్తము నిలిచి ముక్తజల
ద్రుతగతిని నటుపైని త్రోవదాటినయంత
పాషాణవిషమ మగు వింధ్యపాదమునందు
మాతంగపృష్ఠములాంగరచితభక్తిచ్ఛేద
భూతివలె శీర్ణయగు నర్మదను దర్శింతు.

వాంతవృష్టివి నీవు, పుచ్చుకొని చను మరవ
తిక్తమును, వనగజమదాసారవాసితము
తీరజంబూకుంజప్రతిహతరయమ్ము నగు
ఆ నదీతోయమును. మిగుల నంతస్సార
మున్న నిను కంపింప జాల డనిలుండైన.
అందరకు లోకువకదా రిక్త డగువాడు.
గరువంపుతనమునకు కావలెను పూర్ణతయు.

అర్ధరూఢములైన కింజల్కములచేత
హరితకపిశమైన నీప మవలోకించి,
అనుకచ్ఛములయందు తొలిమొగ్గ లను తొడుగు
చేలయనటుల మేసి, ఆ అరణ్యములందు
తడి నేల వాసనను బాళింపు మూజాచి
సూచించు సారంగములు నీవు చినుకుచును
చను త్రోవ. ఉదబిందుసంగ్రహణచతురచా
తకములను చూచుచును, పదుపులుగ కొక్కెరల
లెక్కించి చూపుచును, నీవు గర్జింపగా
సోత్కంఠప్రియసహచరీసంభ్రమాలింగ
నములు పొందిన సిద్ధజనులు కొలుతురు నిన్ను.

మత్ప్రియార్థము నీవు వడివడిగ పోయినను
కకుభసురభిశైలమైన ప్రతిపర్వతమునందు
సజలనయనము లగుచు, స్వాగతము పలుకుచును
నెదురుగా చనుదెంచు వనమయూరములచే

తడవు కొఁగలదంచు నూహించెదను నేను.
ఎట్లైన తొందరగ నేగఁజూతుము సఖుఁడ!
నీవు దరిసినయంత నీ దశార్ణము లెల్ల
సూచిభిన్నములైన మొగలిమొగ్గలచేత
పాండురచ్ఛాయోపవనవృతము లగు; కులా
యారంభగృహబలిభుగాకులగ్రామచై
త్యము లగును; పరిణతఫలశ్యామజంబూవ
నాంతములుగా నగును; కతిపయదినస్థాయి
హంసములుగా నగును. దిశదిశల పేరుమో
సిన విదిశ యను రాజధాని చేరినయంత
కాముకత్వపు ఫలము కనగలవు పూర్ణముగ
అచటి స్వాదుచలోర్మి యగు వేత్రవతిజలము
గ్రోలెదవు భ్రూభంగహేలాధరమ్మువలె,
రమ్యతీరోపాంతముల స్తనితసుభగముగ.
విశ్రమింపగబోయి దాని చేరినయంత,
నీదు సంపర్కమున విరియబూచిన కడిమి
చెట్లచే పులకించినట్లుగా కనిపించి
పణ్యయువతుల సురతపరిమళోద్గారముల
తో శిలావేశ్మముల నాగరుల ఉద్దామ
యౌవనము ప్రకటించు నచటి నీచైర్గిరిని
అధివసించుచు, నీవు విశ్రాంతిఁగొని చనుము—
వననదీతీరజాతోద్యానయూథికా
ముకుళముల నవశీకరములతో తడుపుచును
మృదుకపోలస్వేదమార్జనరుజాక్లాంత
కర్ణోత్పలములైన పుష్పలావీముఖము
లకు నీడ నొసగుచును, క్షణపరిచయము నొంది.
ఉత్తరాశాప్రస్థితునకు నీ కుజ్జయిని.
చుట్టుదారియె యైన కానిమ్ము; దాని సౌ
ధోత్సంగప్రణయవిముఖుఁడ వగుచు చనవలదు,
విద్యుల్లతాస్ఫురితచకితలోలాపాంగ
పౌరాంగనాలోచనములచే మనసులో
రమియింపకే చనిన వంచితుఁడ వయ్యెదవు.
వీచికాసంక్షోభముఖరవిహగశ్రేణి
కాంచీగుణమ్ముతో, దర్శితావర్తనత
నాభితో, స్ఖలితసుభగమ్మైన నడలతో
ప్రవహించు నిర్వింధ్యపొందున రసాభ్యంత
రుడ వగుము దారిలో. యువతులకు ప్రియులయెడ
విభ్రమమె ఆద్యమగు ప్రణయవచనము కాద!
హే సుభగ! ప్రతను వేణీభూతసలిలయై
తటరుహతరుభ్రంశజీర్ణ పర్ణవిపాండు
వర్ణయగు నిర్వింధ్య విరహమున తన కృ
శతనైన నీదు సౌభాగ్యమును వెలయించు
దాని కార్శ్యము నీవె తొలగింపగల ప్రభువు
ఉదయనకథాకోవిదగ్రామవృద్ధజన
నిబిడమగు నా యవంతీదేశమును జొచ్చి,
తమదు సుచరితఫలము కొంచె ముండగ వచ్చి,
భువిని చేరిన నాకలోకజనములదైన
శేషపుణ్యముచేత హృతమైన, కాంతిమత్
స్వర్గఖండమువోని, పూర్వోక్తమగుదాని
శ్రీవిశాలను విశాలాపురిని కనుగొనుము.
సారసమ్ముల మత్తకలకూజితమ్ములను
దీర్ఘముగ పెంచుచును, వికచకమలామోద
మైత్రీకషాయముగ, అంగానుకూలమై
ప్రార్థనాదీనవాచాలుఁ డగు ప్రియతముని
బోలె శిప్రానిలము స్త్రీలసురతగ్లాని
సహరించు నచ్చోట; జాలకోద్గీర్ణమగు
కేశసంస్కారధూపముచేత నీ తనువు
పెంపొందు; బంధువిశ్వాసమున నృత్తోప
హారములు పెంపుడునెమళ్లొసగు; కుసుమసుగం
ధిలములై, లలితవనితాపాదరాగాంకి
తములైన, హర్మ్యములవలసటలు తీర్చుకొను
మచటి సంపదలెల్ల తిలకించి, పులకించి.
ప్రభుకంఠకల్మషకాంతి గలవాడ వని
సాదరమ్ముగ నిన్ను ప్రమథగణములు చూచు,
త్రిభువనగురుండైన చండీశ్వరుని పుణ్య
ధామమును సేవింపు; మచట కువలయరజో
గంధములు, జలవిహారాసక్తసుందరీ
స్నానతిక్తములైన గంధవతిపవనములు
ప్రసరింప తల లూపు నుద్యానములు కలవు.
ఆ మహాకాళమున కే వేళ జేరినను
దివసావసానమ్ముదాక నందే నిలుము,
ఖండపరశుని సాంధ్యబలిపటహతాస్ఫూర్తి
కల్పించి, పొందెదవు మంద్రగర్జాఫలము

వలని యువతికలశలము. ఆ సాంధ్యబలియందు
కాలు కదపిన ప్రోగు మొలనూళ్లుగలవారు
రత్నాంశుఖచితవలిచామరము లలవోక
వీవగా సొలయుచేతులవారు, వేశ్యావి
లాసినులు, నీవలన వర్షాగ్రబిందువుల
నఖపదసుఖ మొందంగ, పారింత్రు నీపై ప్ర
మధుకరశ్రేణిదీర్ఘములైన చూపులను.
ఆపైని చండీశతాండవారంభమున
ప్రతినవజపాశోణసాంధ్యతేజము దాల్చి
ఎత్తైన భుజతరువనమ్ములో మండలా
కారముగ వ్యాపించి, శాంతభీతి స్తిమిత
నయనముల రుద్రాణి నీ భక్తి పరికింప
పశుపతికి ఆర్ద్రనాగాజినేచ్ఛను దెలుపు.
ప్రియభవనముల కేగు వనితలకు, కాదారి
కటిక చీకటులలో రాజవీథులయందు
కనకనికషస్నిగ్ధసౌదామనీ ప్రభల
మార్గమును చూపించి, పుణ్యమున పొమ్మచట.
ఉరిమి వర్షింపకుము; వారుభయవిక్లబలు.
ఆరాత్రి చిరవిలసనము చేత, ఖిన్నయగు
విద్యుత్కళత్రమ్ముతో నీవు, సుప్తపా
రావతము లున్న ఏదేనొక్క భవనవల
భిని గడపి, ప్రొద్దుపొడిచినయంత మరల నీ
శేషాధ్వయానమును సాగింపు; మాస్తకా
ర్యము పూని అలసించుట తగదు; అప్పుడు ఖం
డితలైన నాయికల కన్నీరు తుడిచి ఓ
దార్చుటయె ప్రియుల కర్తవ్యమ్ము; కాన కమ
లాప్తునకు దారితొలగుము వేగ; అతడు నళి
నీ కమలవదనమున హిమబాష్పకణములను
తుడుచుటకు వచ్చియుండగ వారి కడ్డముగ
పోయినచో అమితమగు కోపమ్ము రాగలదు.
తనమనసువలె ప్రసన్నమునైన తోయమున
గంభీర, ప్రకృతిసుభగుడవైన నీదు ఛా
యాత్మతో నైన సంసర్గసుఖమును పొందు
కాన ఆవాహినీకుముదవిశదములైన
చటులశఫరోద్వర్తనాలోకనము నీవు
ధూర్తుడై విఫలమ్ము చేయ నర్హము కాదు.

ముక్తరోధోనితంబముగాగ దిగజార
వానీరశాఖ యను చేతిలో కొంచెముగ
ధరియించినట్లుగా నున్న దాని వినీల
సలిలవసనము నపహరించి వంగిన నీదు
ప్రస్థాన మది కొంత కష్టమే కాగలదు.
వివృతజఘనను తాను చవి తెలిసి ఎవడోయి
విడువజాలినవాడు? భవదీయవర్షపా
తోచ్ఛ్వసితవసుధాసుగంధసంపర్కమున
రమ్యములు, తుండాగ్రకుహరసంఫీతశబ్ద
రమణీయకరిఘటాపరిపీయమానములు,
కాననోదుంబరములకు పరిణమయితులు
నై, శీతవాతములు మందముగ నీమీద
దేవగిరి చేరబోవుదువేళ వీతెంచు.
అచట కాపురమున్న స్కందదేవుని నీవు
పుష్పమేఘము వగుచు వ్యోమగంగాజలా
ర్ద్రములైన పూలజల్లులచేత అభిషేక
మొనరింపు; శశిపింఛభాళిచే శతమన్యు
వాహినీరక్షకగా, అగ్నిముఖమున సంభృ
తమ్మైన అతిసూర్యతేజమ్ముకద తాను.
వెలుగురేకుల సుళ్లు కలిగి గళితమ్మైన
ఏ బర్హిబర్హమ్ము ఘను తాను కొడుకుపై
గల కూర్మి, కర్ణమున కువలయదళమ్ముగా
సవరించుకొనునట్టి షణ్ముఖమయూరమును,
హరశిరశ్చంద్రికాధౌతనేత్రాంతమును,
పర్వతగ్రహణగురుగంభీరగర్జనల
నర్తనము చేయింపు; దేవు శరవణభవుని
ఆరాధనము చేసి, జలకణభయమ్ముచే
వైణికులు, సిద్ధదంపతులు, మార్గముతొలగ
దాటిపోవుచు నీవు, భువిని స్రోతోమూర్తి
పరిణామమును గొన్న రంతిదేవుని కీర్తి
గౌరవించుచు కొంత దిగి చనుము; శార్ఙ్గివను
వర్ణమును ముచ్చిలించిన నీవు జలము గొన
అవనతుడవై యుండ, దూరభావముచేత
పృథువైన సూక్ష్మముగ మాతు రాపింపు ప్ర
వాహమును చూపు క్రిందికి పరచి పుడమిదగు
స్థూలముక్తైకేంద్రనీలముతోడి ఒక పేట.

ముత్యాలదండవోలిక నుండ. ఆ నదిని
దాటి చను మాళలకు. పరిచితభ్రూలతా
విభ్రమముతో పక్ష్మలము లింత పైకెత్తి
కుందవిక్షేపానుసారిమధుకరవధూ
శ్రీముషితములు నైన, ఉపరివిలసత్కృష్ణ
శారప్రభలతోడి దశపురవధూనేత్ర
కౌతూహలమ్ములకు నీవు పాత్రము వగుచు.
అపైని నీవు బ్రహ్మావర్తజనపద ము
నాతపముగా జొచ్చి క్షత్రియప్రథనపిసు
నమ్మైన ఆ కురుక్షేత్రమును భజియింపు.
మచ్చోట శితశరశతమ్ముతో గాండీవి
రాజన్యవదనముల నీవు ధారాపాత
ముల కమలషండముల నెవలేక ముసురుకొ
న్నట్లుగా వర్షించె. హేసౌమ్య! ప్రియరసము
సుర, రేవతీలోచనాంకమ్ము, వదలి, హలి
తనదు బంధుప్రీతిచే సమరవిముఖుడై
ఏ తీర్థమున మున్గె నా సరస్వతిసలిల
ముల నీవు సేవించి లోన పరిశుద్ధుడవు
కాగలవు పైకి నల్లనివాడ వైకూడ.

అటుపైని, కనఖలము చెంత హిమగిరినుండి
అవతరించినదాని, సగరతనయస్వర్గ
సోపానపంక్తి నా దగుదాని, గౌరిదగు
సాపత్న్యకుటిలభ్రుకుటీరచనఫేనముల
పరిహసించెడిదాని, ఇందులగ్నోర్మిహ
స్తముల ధూర్జటికేశపాశమును గ్రహియించు
జాహ్నవిని కని చనుము. వ్యోమమున సురగజము
వలె నీవు పశ్చార్ధలంబివై ఆనదీ
స్ఫటికాచ్ఛవిమలవారిని తిరశ్చీనముగ
త్రావదలచితి వేని, అపుడా సరిత్తులో
వ్యాపించు నీనీడచేత నది అధికాభి
రామ మగు అస్థానసిద్ధయమునాసంగ
మముబోలె. ఆనదికి ప్రభవకారణ మగుచు
ఆసీనమృగనాభిగంధసురభిళ మైన
శిలలతో, హిమధవలమైన అచలము చేరి
మార్గఖేదము తొలగు దాని శృంగమునందు
కూర్చుండి పరిశుభ్రనందీశ్వరోత్ఖాత

పంకోపమేయమగు శోభను వెలార్చెదవు.
వనపవనములు వీవ దేవదారుస్కంధ
సంఘర్షణోత్థితము, విస్ఫులింగక్షపిత
చమరవాలభరమ్ము నైన దావానలము
దాని పీడించెనా, వారిధారలచేత
చల్లార్ప నుచితమ్ము; ఉత్తముల సంపదల
కాపన్నులగువారి ఆర్తి తొలగించుటయె
ఫలముకద! అపుడచట తొలగిపోయెడి నిన్ను
సంభ్రమోత్ప్లుతశరభసములగుచు స్వాంగభం
గము కలుగ, లంఘించు శరభముల, తుములకర
కావృష్టిపాతమున చెదరగొట్టుము నీవు.
నిష్ఫలారంభయత్నముచేత ఎవరోయి
పరిభవాస్పదులు గాకుండునది? అచటి సి
ద్ధులచేత సంతతము పూజింపబడునట్టి
ఆ దృషచ్ఛిలమీది అర్ధేందుమౌళిచర
ణన్యాసమును నీవు భక్తినమ్రుడ వగుచు
వలగొనుము; శ్రద్ధధానులు దాని కనినంత
నిర్ధూతపాపులై స్థిరగణపదప్రాప్తి
పొందెదరు, కరణవిగమానంతరమునందు.

అనిలపూరితములై మధురముగ వంశములు
మ్రోగుచుండును; త్రిపురవిజయమును సంసక్త
కిన్నరవిలాసినులు పాడుచుందురు; కంద
రములందు నీ ధ్వనులు మురజమ్మువలె మ్రోగ
పశుపతికి నచట సంగీతార్థ మంతయును
సంపూర్ణ మగునుకద! ప్రాలేయగిరితటము
లందు గల ఆయావిశేషముల దాటుకొని
చను ముత్తరపుదిశకు; బలినియమనోద్యుక్త
డైనట్టి ఆ త్రివిక్రమదేవుశ్యామాంఘ్రి
వలె దోచు తిర్యగాయామశోభనమూర్తి
వగు నీవు, హంసలకు దారియై, భృగుపతి
యశోవర్త్మ మనదగిన క్రౌంచరంధ్రమునుండి

పైకి చని, పౌలస్త్య కంపితప్రస్థసం
ధులతోడి, త్రిదశవనితాదర్శ మైనట్టి
కైలాసగిరి కతిథి వయ్యెదవు. కుముదవిశ
దములైన ఉత్తుంగశృంగములచే నంత
రిక్షమును కమిచి రాశీభూతమైన ప్రతి

దినశంక రాట్టహాసముపగిది తోచునది.
స్నిగ్ధభిన్నాంజనప్రతిమానమై నీవు
శిఖరస్థుడై యుండ సద్యోవికృత్తమగు
ద్విరదరదనచ్ఛేదపాండురచ్ఛాయతో
అంసగతనీలాంబరముతోడి హాలధరుని
వలె తోచి, స్తిమితనయనప్రేక్షణీయమగు
నా శైలశోభ నూహించెదను. భుజగవల
యము వదలి, భవుడు తన కేలూత నొసగగా
ఆ కేళిశైలమున పాదచారిణి యగుచు
గౌరి విహరించెనా, ముందు చని స్తంభితాం
తర్జలౌఘములతో, నీ తనువు వళులుగా
తీర్చుకొని, మణితటారోహణము చేయుటకు
సోపానభావమును సమకూర్చుకొనుమోయి,
అచట తప్పనిసరిగ సురవిలాసినులు నిను
వలయకులిశోద్ఘట్టనోద్గీర్ణ జలముతో
యంత్రధారాస్థానముగ చేయఁగోరుదురు.
వెట్టదినముల లబ్ధమైనట్టి నిను వారు
వదలిపెట్టకయున్న జర్ఝరితకర్ణకటు
గర్జితధ్వనులచే క్రీడావిలోలురగు
వారల భయభ్రాంతులను చేయుమో సఖుడ!
కలధౌతపద్మసంజనకమానససర
స్సలిలముల గైకొనుచు, ఐరావతమ్మునకు
క్షణముఖపటప్రీతి గూర్చుచును, కల్పద్రు
కిసలయాంశుకములను స్వీయపవనముచేత
రెపరెపలుగా చరచి, అచట నీ కిష్టమే.
ఇష్టమై బహుముఖక్రీడాపరాయణుడ
వగుమోయి. ఓ కామసంచారి! ఆ నగము
తన ప్రియునివలె నుండ, దాని యుత్సంగమున
నున్న అలకాపురిని, స్రస్తగంగాదుకూ
లను పోల్చుకొనలేకపోలేవు; వార్షుకపు
వేళలం దుచ్చైర్విమానముల నా పురము
సజలధారాజలదమాలికల ధరియించు
ముత్యాలమురువైన ముంగురులముగుదవలె.



# ఆంధ్రరాష్ట్ర నిర్మాణసమస్య

●

'ఒక ఆంధ్రుడు'

ఆంధ్రరాష్ట్రనిర్మాణము ఇంచుమించు విఘ్నేశ్వరుని వివాహములాగా ఉన్నదని ఇప్పుడు నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈ నెల ౧వ తేదీనకూడా ౧౯౫౦ జనవరి ౨౬ వ తేదీన స్వతంత్ర భారతరిపబ్లిక్‌తో పాటు ఆంధ్రరాష్ట్రముకూడా అవతరించగలదని ఒక్క ఆంధ్రులే కాదు, భారతీయులు యావన్మందీ భావించిరి. రాష్ట్రము వచ్చినదనే మన నాయకులు విశ్వసించిరి. ప్రస్తుతపరిస్థితులనుబట్టి, భారతప్రభుత్వహోంశాఖ కార్యదర్శి హెచ్. వి. ఆర్. అయ్యంగార్ చెన్నరాష్ట్రప్రభుత్వానికి ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు తీసుకోవలసియున్న చర్యలను వివరిస్తూ కల్పించిన అనేకసమస్యలనుబట్టి జనవరి ౨౬ వ తేదీలోపున కాదు గదా, ఆనాటికైనా ఆంధ్రరాష్ట్రనిర్మాణం పూర్తి కాగలదనే ఆశ లేకుండాపోయింది. నాయకత్రయ నివేదికను ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము నిస్సందేహముగా అంగీకరించడంవల్ల ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఏర్పడడం జరుగలేదు కాని చెన్నపట్నంపై ఆంధ్రులు తమ హక్కులను వదులుకోవడం స్థిరమైపోయినది. నవంబరు ౧౧ వ తేదీన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము నాయకత్రయనివేదికను ఆమోదిస్తే నవంబరు ౨౬ వ తేదీన రాజ్యాంగపరిషత్తు నూతనరాజ్యాంగాన్ని మూడవపర్యాయం ఆమోదించి శాసనంచేయడానికి పూర్వం, నూత్నరాజ్యాంగంలోని రాష్ట్రముల జాబితాలో 'ఆంధ్ర'ను చేర్కొనడానికి వీలుగా ప్రస్తుత రాజ్యాంగచట్టంలోని ౨౯౦ సెక్షనుప్రకారం ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటుచేస్తూ గవర్నరుజనరల్ ఉత్తరువు జారీ కాగలదని కాంగ్రెస్ అధ్యక్షుడు, నాయకత్రయ సంఘసభ్యుడు అయిన డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు చెప్పారు. వారు రాబిన్నంగా చెప్పక పోయినా క్రిందటిఏడాదిగా భాషారాష్ట్రాల నిర్మాణం గురించి, అందులోనూ ముఖ్యంగా ఆంధ్రరాష్ట్రనిర్మాణం గురించి కాంగ్రెస్ అగ్రనాయకులూ, కేంద్రమంత్రులూ చేస్తున్న ప్రకటనలను గమనించినవారందరూ అదే అభిప్రాయంతో ఉన్నారు.

౧౯౪౮ వ సంవత్సరం నవంబరులో ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ అధినివేశశాసనసభలో భాషారాష్ట్రముల నిర్మాణంపై ప్రభుత్వవిధానాన్ని వివరిస్తూ చేసిన ప్రకటనలో 'ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు అధిగమింప సాధ్యముగాని అవరోధములు ఏమీ లేవనీ, 'నూత్నరాజ్యాంగంలోని రాష్ట్రముల జాబితాలో అప్పటి రాష్ట్రములతోపాటు ఆంధ్రనుకూడా ఒక ప్రత్యేకరాష్ట్రముగా చేర్కొనవచ్చు'ననీ స్పష్టం చేశారు. ప్రధానమంత్రిప్రకటనను పురస్కరించుకొని రాజ్యాంగపరిషత్తురచనాసంఘమువారు 'ఆంధ్ర'ను రాష్ట్రముల జాబితాలో చేర్కొనడంగురించి దీర్ఘంగా చర్చించారు. అసలు ఈ భాషారాష్ట్రముల సమస్యను ఒక ప్రత్యేకఉపసంఘము పరిశీలించి ఒక తీర్మానాన్ని కూడా తయారుచేసింది. అయితే ఆ విషయం రాజ్యాంగపరిషత్తువిచారణకు రాలేదు. రాజ్యాంగ రచనాసంఘమే ఆ ఉపసంఘసూచనలను పరిశీలించి ముసాయిదాలో నూత్నరాష్ట్రముల నిర్మాణము ఏ విధంగా ఎప్పుడు జరగాలో వివరించింది. రాజ్యాంగ రచనాసంఘఅధ్యక్షుడు డాక్టర్ అంబేద్కర్ ౧౯౪౮ ఫిబ్రవరి ౨౧ వ తేదీన పరిషత్తుఅధ్యక్షునికి రాజ్యాంగ ముసాయిదాను సమర్పిస్తూ "పరిషత్తు రాజ్యాంగమును ఆఖరుపర్యాయము ఆమోదించివేయడానికి పూర్వం ౧ వ షెడ్యూలులో 'ఆంధ్ర'నుగాని, మరి ఏ ఇతరభాషా ప్రాంతమునుగాని చేర్కొనాలి అంటే, ఆ ప్రాంతా

లను ౧౯౩౫ వ సంవత్సరపు భారతప్రభుత్వచట్టము లోని ౨౯౦ సెక్షనును అనుసరించి గవర్నరుల రాష్ట్రాలుగా ఏర్పాటుచేయడానికి తక్షణం చర్య తీసుకోవలసి ఉంటుంది" అని స్పష్టంచేశారు. భారతప్రధానమంత్రి ప్రకటించినట్లు ఆంధ్రను మొదటి షెడ్యూలులో చేర్చకపోవడానికి రాజ్యాంగరచనాసంఘమువారు తెలిపిన కారణాలు ఈవిధంగా ఉన్నవి: "మొదటి షెడ్యూలులో ఆంధ్రను ప్రత్యేకరాజ్యముగ చేర్చవలెనా అనే విషయాన్ని కమిటీవారు విశేషాసక్తితో విచారించారు. ౧౯౩౫ భారతప్రభుత్వ చట్టంప్రకారం ఒరిస్సా, సింధురాష్ట్రముల విషయములో చేసినట్లు నూతనరాజ్యాంగములోని రాష్ట్రముల జాబితాలో ఆంధ్రను చేర్చవచ్చునని ఇటీవల ఈవిషయమై వెలువడిన ప్రభుత్వప్రకటనలో చెప్పబడినది. ఆప్రకారం ఆంధ్రను ప్రత్యేకరాజ్యంగా మొదటి షెడ్యూలులో చేర్చడానికి ఒక స్థితిలో రచనాసంఘము సిద్ధపడినది. కాని ఇందువిషయమై సమగ్రవిచారణ జరిపినఅనంతరం, రాజ్యాంగం అమలుజరుగుటతోపాటు ఆంధ్రరాష్ట్రం ఏర్పడి వ్యవహారంచేయాలంటే షెడ్యూలులో పేరు నమోదు చేయటముమాత్రము చాలదని అభిప్రాయపడినది. నూతనరాజ్యాంగము అమలుజరుగుటతోపాటు ప్రత్యేకాంధ్రరాష్ట్రము అవతరించాలంటే ప్రస్తుతరాజ్యాంగాన్ని అనుసరించే తక్షణం ప్రాతిపదికచర్యలను తీసుకోవలసిఉంటుంది. ౧౯౩౫ వ సంవత్సరపు భారతప్రభుత్వచట్టమును అనుసరించి సింధు ఒరిస్సాల విషయంలో ఇలాగే జరిగింది. ౧౯౩౫ శాసనం ౧౯౩౭ ఏప్రిల్ ౧ వ తేదీన అమలువస్తే సింధు, ఒరిస్సా రాష్ట్రములు ౧౯౩౬ ఏప్రెల్ ౧ వ తేదీనే ప్రత్యేక రాష్ట్రములుగా ఏర్పాటైనవి. కాబట్టి, ఒక్క ఆంధ్రవిషయములోనేగాక, ఇతర భాషాప్రాంతాల విషయంలోకూడా ఇందుకుసంబంధించిన అన్నివిషయాలను విచారించి నివేదించుటకు ఒక కమిషనును నియమించాలని రాజ్యాంగరచనాసంఘము సూచిస్తున్నది."

ఈ సూచనను చేస్తూ రాజ్యాంగరచనాసంఘం ముఖ్యమైన హెచ్చరిక ఒకటి చేసింది. ఆంధ్రరాష్ట్రం విషయంలో ఈనాడు మనం పొందుతూఉన్న ఆశ, నిరాశలన్నింటికీ ఇదే కారణం. ఏయే ప్రాంతాలు ప్రస్తుతరాజ్యాంగశాసనంలోని ౨౯౦ సెక్షనుప్రకారము ప్రత్యేకరాష్ట్రాలుగా ఏర్పడాలి అని ఈ కమిషన్ అభిప్రాయపడుతుందో అలాంటి ప్రాంతాలను నూతన రాజ్యాంగంలోని మొదటి షెడ్యూలులో చేర్చడానికి వీలుగా, నూతన రాజ్యాంగతృతీయ ప్రతిపాదనామోదం పూర్తి కావడానికి ముందు ఈ కమిషన్ తన నివేదికను సమర్పించవలసిఉంటుం దని రాజ్యాంగరచనా సంఘము హెచ్చరించింది. ఈ హెచ్చరికనుబట్టి, ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి కేంద్రప్రభుత్వం సుముఖము గానే ఉన్నది కనుక, నూతనరాజ్యాంగం అమలుజరుగుటతోపాటు ప్రత్యేకాంధ్రరాష్ట్రస్థాపన ౧౯౩౫ శాసనంలోని ౨౯౦ సెక్షన్ ప్రకారం జరుగుతుందని అందరూ ఆశించారు. కాలహరణకే కమిషన్ల నియామకం అనేది భారతప్రభుత్వవిషయములో వర్తింపదని అంతా భావించారు.

రాజ్యాంగరచనాసంఘంవారి సిఫార్సును పురస్కరించుకొని రాజ్యాంగపరిషత్తుఅధ్యక్షుడు ౧౯౪౮ జూన్ ౧౭ వ తేదీన యస్. కె. ధార్ అధ్యక్షుడుగా, శ్రీ బి. సి. బెనర్జీ కార్యదర్శిగా, మరిద్దరు సభ్యులతో భాషారాష్ట్రవిచారణసంఘాన్ని నియమించారు. ఈ కమిషన్ వారు సరిగ్గా సంవత్సరంక్రితం ౧౯౪౮ డిసెంబరు ౧౦ వ తేదీన తమ నివేదికను పూర్తిచేసి రాజ్యాంగపరిషత్తుఅధ్యక్షుడికి సమర్పించారు. వీరి నివేదిక భాషారాష్ట్రనిర్మాణసిద్ధాంతాన్నే ఖండించివేసి, కాంగ్రెస్ తన వెనుకటి వాగ్దానాలను ఉపసంహరించుకోవాలని సూచించింది. అయితే చెన్నరాష్ట్రంవిషయంలోమాత్రం పరిపాలనా సౌలభ్యానికి తగుమైన ఏర్పాట్లు చేయవలసిఉంటుందని సూచించారు. ఈ నివేదికను ఖండించినవారూ ఉన్నారు; ప్రశంసించినవారూ ఉన్నారు. కొండను త్రవ్వి ఎలుకను పట్టినారని కొందరూ, అసలు ఆ ఎలుకనైనా పట్టలేకపోయినారని కొందరూ అన్నారు. ఈ కమిషన్ కనుక ఆంధ్రరాష్ట్రనిర్మాణం సాధ్యము, ఆవశ్యకము అని నివేదించిఉంటే ఇప్పటి కప్పుడో

ఆంధ్రరాష్ట్రం జె. వి. పి. ను అనుసరించే ఏర్పడి ఉండేది.

ఈ కమిషన్ న్యాయం చేయలేదని కాంగ్రెస్ గ్రహించి ఈ సమస్యను పునః పరిశీలించి సూచనలు చేయడానికి జయపూర్ కాంగ్రెస్ నాయకత్రయ సంఘాన్ని ఏర్పాటుచేసింది. వీరు చాలావరకు థార్ కమిషన్ భావాలను హర్షించినా ఆంధ్రరాష్ట్రం విషయంలో ఒక ప్రత్యేకపరిష్కారమార్గాన్ని సూచిస్తూ ౧౯౪౯ ఏప్రిల్ ౧ వ తేదీన తమ నివేదికను తయారుచేశారు.

ఆంధ్రులు చెన్నపట్టణంపై తమ హక్కులను వదులుకుంటే నిర్వివాదముగా ఆంధ్రజిల్లాలైన చెన్న రాజధానిలోని ఆంధ్రప్రాంతాన్ని ప్రత్యేకరాష్ట్రంగా ఏర్పాటుచేయవచ్చునని నాయకత్రయసంఘము సూచించినది. 'ఆంధ్రపత్రిక' పేర్కొనిఉన్నట్లు కేవలం ౧౯౪౭ జూన్ ౩ వ తేదీన బ్రిటిష్ ప్రభుత్వము భారతస్వాతంత్ర్యసిద్ధికి ప్రతిపాదించిన పథకంవంటిది గానే ఉన్నది ఈ నాయకత్రయనివేదిక. దేశవిభజనను అంగీకరిస్తే భారతదేశము స్వతంత్ర మవుతుందని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించినట్లే, ఆంధ్రులు చెన్నపట్నంపై హక్కు వదులుకుంటే ఆంధ్రరాష్ట్రం ఏర్పడుతుంది అని నాయకత్రయసంఘం ప్రకటించింది. ఈ వరుస చాలా దారుణంగా ఉన్నది. సందేహం లేదు. అయితే కాలపరిణతి లేక ఆంధ్రులు ఇప్పటి అయోమయస్థితిలోనే ఉండిపోవడమా, లేక చెన్నపట్నంపై తమ హక్కులను వదులుకొని రాష్ట్రాన్ని సాధించి ఇతరప్రాంతాలవారితో సమానహోదాను పొందడమా అనే ప్రశ్న ఆంధ్రులందర్నీ కలతపెట్టింది. అఖిలభారతకీర్తి నార్జించిన ఆంధ్ర నాయకులు నాయకత్రయనివేదిక వెలువడ్డంతో చెట్టు కొకరూ, పుట్ట కొకరూ అయినారు. రాష్ట్ర కాంగ్రెస్ సంఘము మేమాసంలో సమావేశమై చెన్నగరంపై తమ హక్కులను వదులుకోవాలని ఆంధ్రులను ఆదేశింపజాలమంటూ, నిర్వివాదప్రాంతాలతో తక్షణం జె. వి. పి. ప్రకారం ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించాలనీ, చెన్నపట్నం, తదితరవివాదగ్రస్తప్రాంతాలను సరిహద్దునిర్ణయసంఘపరిష్కారానికి వదలివేయాలనీ తీర్మానించింది. ఆతరువాత సమావేశమైన ఆంధ్ర ప్రజాపరిషత్తు ఈ తీర్మానాన్ని త్రోసిరాజన్నది. చెన్నగరం రాజధానిగానే ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలనీ, ఏమైనా ఆంధ్రులు చెన్నగరంపై తమ హక్కులు వదులుకొనరాదనీ ఆంధ్రప్రజాపరిషత్తు హెచ్చరించింది. తమిళ కాంగ్రెస్ సంఘముమాత్రము నాయకత్రయనివేదికను యథాతథంగా ఆమోదిస్తూ చెన్నపట్నం తమిళరాష్ట్రానికి చెందినదని తీర్మానించింది. తమిళ కాంగ్రెస్ ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి సుముఖముగా ఉన్నా, ఆంధ్రప్రజాపరిషత్తు నాయకత్రయనివేదికను తిరస్కరించినకారణంగా పరిస్థితులు మళ్లా మొదటికి వచ్చినవి.

దీనికి అంతటికీ కారణము మన నాయకులు నాయకత్రయనివేదికలో చెన్నపట్నానికి సంబంధించిన భాగాన్ని బాగా పరిశీలించి, అసలువిషయాన్ని గ్రహించకపోవడమే. చెన్నపట్నముపై ఆంధ్రులు వదులుకోవలసిన హక్కులు ఎలాంటివి అనే ప్రశ్నకు సమాధానం సాధించడానికి ఎవ్వరూ ప్రయత్నించలేదు. నగరములో ఉన్న ఆంధ్రులు, ఇతరభాషలవారు ఎలాంటి హక్కులను కలిగిఉన్నారో అలాంటి హక్కులనే కలిగిఉన్నారనీ, ఆ హక్కులను వదులుకోమని ఎవ్వరూ చెప్పలేరనీ, చెప్పడం సబబు గాదనీ, కనుక నాయకత్రయసంఘం కోరింది ఆంధ్రులు చెన్నపట్నం ఆంధ్రరాష్ట్రభాగం కావాలనే ఆందోళనను విరమించి, ఆకోరికను ఉపసంహరించుకోమనే అనీ 'ఆంధ్రపత్రిక' అనేకపర్యాయములు స్పష్టంచేసిఉన్నా మన నాయకులు ఈవిషయాన్ని గ్రహించక నాయకత్రయనివేదికను ఆమోదించడంలో అనవసరంగా కాలయాపన చేశారు. ఆఖరికి కాంగ్రెస్ అధ్యక్షుడు, నాయకత్రయసంఘసభ్యుడు అయిన డాక్టరుపట్టాభి గారు చెన్నపట్నంవిషయాన్ని విశదపర్చి చెప్పడంవల్ల నవంబరు ౧౧ వ తేదీన ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘము నాయకత్రయనివేదికను యథాతథంగా, నిస్సందేహంగా ఆమోదించింది.

అక్టోబరు ౫ వ తేదీన అఖిలభారతకాంగ్రెస్ కార్యవర్గంతీర్మానాన్ని అనుసరించి తమిళ, ఆంధ్ర

కాంగ్రెస్ సంఘములూ, చెన్న రాష్ట్రప్రభుత్వమూ నాయకత్రయనివేదికను ఆమోదించినందువల్ల నవంబరు ౧౬వ తేదీన కాంగ్రెస్ కార్యవర్గం "ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి శీఘ్రచర్యలు తీసుకోవలెను" అని కేంద్రప్రభుత్వానికి సూచించింది. అక్టోబరుతీర్మానంలో ఆంధ్ర, తమిళ కాంగ్రెస్ సంఘములూ, చెన్న రాష్ట్రప్రభుత్వమూ నవంబరు ౧౫ లోగా నాయకత్రయ నివేదికపై తమ అభిప్రాయాలను తెలియజేయాలని కాంగ్రెస్ కార్యవర్గం స్పష్టంచేసిఉన్నందువల్ల నవంబరు ౧౬వ సమావేశమై ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి శీఘ్రచర్యలు తీసుకోవాలని కేంద్రప్రభుత్వాన్ని కోరినందువల్ల నవంబరు ౨౬ లోపునే గవర్నరుజనరల్ ఉత్తరువు సె. ౨౯౦ ప్రకారము జారీకాగలదని ఆంధ్రనాయకులు ఆశించిరి. నవంబరు ౨౬ గతించింది. జనవరి ౨౬ సమీపిస్తున్నది. అయినా ఆంధ్ర-రాష్ట్రనిర్మాణకలాపం మామూలుగానే సాగుతూఉంది. తిరిగి చెన్ననగరమే పానకంలో పుడక అయ్యేలాగా ఉన్నది.

భారతప్రభుత్వహోంశాఖకార్యదర్శి చెన్న రాష్ట్రప్రభుత్వమునకు వ్రాసిన లేఖలో ఆస్తిఅప్పులకు సంబంధించిన వివరములతోబాటు ఆంధ్రరాష్ట్రరాజధాని ఎక్కడ అనే విషయము కూడా ముందుగానే పరిష్కారముకావలసియుంటుం దని చెప్పెను. ఆ సందర్భములో కేంద్రప్రభుత్వమువద్దకు తమిళనాయకులు నడిపిన రాయబారవృత్తాంతమును వివరించి, ఆంధ్ర రాష్ట్రరాజధాని తాత్కాలికముగా కూడా చెన్న పట్నంలో ఉండేందుకు వీలుగాదని తమిళనాయకులు కేంద్రప్రభుత్వానికి నివేదించినట్లు వెల్లడించారు. అంతటితో తృప్తి చెందక, ఆంధ్రనాయకులు తమ రాష్ట్ర రాజధానినిగురించి ఈసరికి ఆలోచించుకొనియేయుందురనికూడా భారతప్రభుత్వహోంశాఖాకార్యదర్శి తన అభిప్రాయము ప్రకటించెను.

ఆస్తి అప్పుల పంపకము, సరిహద్దుల నిర్ణయము, శాసనసభల నిర్మాణము, ఉద్యోగుల పంపకము మొదలైనవిషయాలు ఆంధ్రరాష్ట్రాన్ని స్థాపిస్తూ గవర్నరుజనరల్ ఉత్తరువు జారీకావడానికిపూర్వమే నిర్ణయంకావలసినమాట వాస్తవమే. సింధు, ఒరిస్సా రాష్ట్రముల స్థాపనోత్తరువులలో ఆయారాష్ట్రముల స్వరూపానికి, ఆర్థికస్థితికి, పరిపాలనాయంత్రానికి సంబంధించిన యావత్తువివరాలూ ఉదాహరించడం జరిగింది. అదేవిధంగా ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన అన్ని వివరాలనూ గవర్నరుజనరల్ ఉత్తరువులో చేర్చవలసిఉంటుంది. అయితే భారతప్రభుత్వ హోంశాఖాకార్యదర్శి కాంగ్రెస్ కార్యవర్గం ఆంధ్ర రాష్ట్రనిర్మాణానికి శీఘ్రచర్యలు తీసుకోవాలని తీర్మానం చేసేటప్పుడు ఈవిషయాలన్నింటినీ గమనించే ఉన్నదని గ్రహింపవలసియుండెను. ఆంధ్రరాష్ట్రనిర్మాణమువల్ల చెన్న రాష్ట్ర ఆర్థిక, రాజకీయస్థితిలో ఎలాంటి మార్పులు వచ్చేది, ఆంధ్రరాష్ట్ర ఆర్థికస్థితి ఏవిధంగా ఉండేదీ థార్ కమీషన్ సమగ్రంగా చర్చించింది. ఆంధ్రలో కమ్యూనిస్టుప్రమాదము ఇతరప్రాంతాలలో కంటే తీవ్రంగా ఉన్నదనే విషయాన్నీ థార్ కమీషన్ గమనించింది. పరిపాలనను నిర్వహించే ఉద్యోగుల కొరత ఎక్కువగానే ఉందనికూడా థార్ కమీషన్ గ్రహించింది. నాయకత్రయసంఘం థార్ కమీషన్ నివేదికను పరిశీలించి భాషారాష్ట్రనిర్మాణసమస్యను పునరాలోచించి చెన్ననగరం తమరాష్ట్రంలోనే ఉండాలని ఆంధ్రులు పట్టుబట్టకుండా ఉంటే నిస్సందేహముగా ఆంధ్రప్రాంతము లైన చెన్నరాష్ట్రంలోని తెనుగుజిల్లాలతో ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటుచేయవచ్చునని అభిప్రాయపడినది. కనక భారతప్రభుత్వ హోంశాఖ గాని, చెన్న రాష్ట్రప్రభుత్వము గాని ఆంధ్ర రాష్ట్రసత్వరనిర్మాణము సాధ్యమా కాదా అనే విషయాన్ని గాక, ఆంధ్రరాష్ట్రసత్వరనిర్మాణానికి తీసుకోవలసిన చర్యలు ఏమిటి అనే విషయాన్నే విచారింపవలసిఉంటుంది.

భారతప్రభుత్వహోంశాఖాకార్యదర్శి తమ లేఖలో ఆంధ్రరాష్ట్రనిర్మాణసందర్భములో ముందుగానే నిర్ణయంకావలసిన విషయాలని ఏవో సమస్యలను చేర్కొనిరి. ఆ సమస్యలు కాంగ్రెస్ కార్యవర్గనిర్ణయమువలన ఉత్పన్నమైనవి కావు. ఇవి ఒక్క ఆంధ్ర రాష్ట్రనిర్మాణమునకుమాత్రమే సంబంధించినవీ కావు. కొత్తగా సిద్ధాంతములను, సూత్రములను నిర్ణయించి

గాని ఈ పంపకం, విభజన జరగడానికి వీలుగాదు; వాదించడానికి అవకాశమూ లేదు. బొంబయిని సింధును వేరుచేసినప్పుడు ఏ సూత్రాలను పాటించైనదో, ఏ పద్ధతులను అనుసరించడమైనదో, చెన్న రాజధానినుంచి ఆంధ్రప్రాంతాన్ని విడదీయడానికి ఆ సూత్రాలను, అవే పద్ధతులను అవలంబించవచ్చు. అందుకు చెన్నరాష్ట్రంలోని ఆంధ్ర, ఆంధ్రేతరసములవారు ఉభయులూ సమ్మతిస్తారు. ఆస్తుల, అప్పుల వివరాలు సిద్ధంగానే ఉన్నవి కాబట్టి సింధువిభజన విషయంలో అనుసరించిన మార్గాన్ని బట్టి ఉమ్మడిరాష్ట్రపు ఆస్తి అప్పుల పంపకం జరగడానికి ఎంతో వ్యవధి అవసరం లేదు.

ఇక సరిహద్దులవిషయములో కాంగ్రెస్ కార్గతీర్మానము, నాయకత్రయనివేదిక స్పష్టంగా ఉంచి ప్రస్తుతానికి చెన్నరాష్ట్రంలో ప్రాస్తగ ఆంధ్రప్రాంతాలని అనబడే జిల్లాలతోనే ఆంధ్రరాష్ట్రము ఏర్పడాలనీ, సరిహద్దుల మార్పు, అందుకు సంబంధించిన విచారణ పరిస్థితులు శాంతించిన అనంతరం జరుగవలసి ఉంటుందనీ నాయకత్రయసంఘం చేసిన సూచనను ఆంధ్రులు, తమిళులు, చెన్నరాష్ట్రప్రభుత్వము కూడా ఆమోదించెను. కాబట్టి ఆంధ్రరాష్ట్రపరిహద్దులు నిర్ణయమయ్యేవరకూ ఆంధ్రరాష్ట్రనిర్మాణం ఆగనవసరంలేదు. చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి, ఉత్తరవిశాఖపట్నము, దక్షిణవిశాఖపట్నము, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాలలో ఆంధ్రరాష్ట్రనిర్మాణము కావలెనని తమిళకాంగ్రెసుసంఘమూ, ఆంధ్రజిల్లాలు ౧౧, బళ్లారిలోని మూడు తెనుగుతాలూకాలూ చేర్చి ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలని ఆంధ్రకాంగ్రెస్ సంఘమూ తీర్మానించియున్నందున ఆంధ్రరాష్ట్రసత్వరనిర్మాణానికి సరిహద్దుల నిర్ణయం ప్రతిబంధకం కానవసరంలేదు. అయితే ఈసందర్భములో భారతప్రభుత్వహోంశాఖాకార్యదర్శి బళ్లారిజిల్లాలోని మిగతా ఆరుతాలూకాల సంగతి ఏమిటి అని ప్రశ్నించారు. ఈ ఆరుతాలూకాలనూ బొంబయిరాష్ట్రంలో చేర్చవచ్చును; లేదా కన్నడ రాష్ట్రం ఏర్పడేవరకూ ఆంధ్రరాష్ట్రంలోనే ఉంచవచ్చును. ౧౧ జిల్లాలకు ప్రత్యేకపరిపాలన ఏర్పాటుకు ఆరుతాలూకాల తాత్కాలికపరిపాలనాసమస్య అంతరాయం కానవసరము లేదు.

ఈవిధంగా భారతప్రభుత్వహోంశాఖాకార్యదర్శి పేర్కొన్న అనేకసమస్యలలో ఆర్థికస్థితి, సరిహద్దులసమస్య, పంపకము విధానము ఈవిధముగా పరిష్కారము కాగలవు. పోతే హైకోర్టు, శాసనసభలు, రాజధాని, నూత్నరాష్ట్రంలో శాంతిభద్రతల రక్షణ, సిబ్బంది సమస్యలను విడివిడిగా విచారిస్తే అందులో ఏవీ పరిష్కారానికి లొంగనివి కావని రూఢీ అవుతుంది. ౧౯౩౬ ఏప్రిల్ ౧వ తేదీన ఒరిస్సారాష్ట్రం ఏర్పాటైనప్పటికి పన్నెండుసంవత్సరాలవరకూ ఒరిస్సాకు ప్రత్యేక న్యాయస్థానము లేదు. ఆర్థికస్థితి అంత తృప్తికరంగా లేదు గనుక సాధ్యమైనంతకాలము, ఆర్థికపరిస్థితులు చక్కబడేవరకూ ఆంధ్రరాష్ట్రానికీ, చెన్నరాజధానిలోని ఆంధ్రేతరప్రాంతానికీ ఉమ్మడిగా ఒకే హైకోర్టు ఉంచవచ్చును. కేంద్రప్రభుత్వముకూడా ఇట్టి ఏర్పాటుకు సమ్మతిస్తే హైకోర్టు అసలు ఒకసమస్య కాజాలదు. ఇంక శాసనసభలవిషయములో ఆంధ్రరాష్ట్రానికి ఎగువశాసనసభ అవసరములేదు. రాజ్యాంగపరిషత్తులోని ఆంధ్రసభ్యులు సమావేశమై ఇట్టితీర్మానాన్ని చేసిన ఈసమస్య క్షణములో పరిష్కారము కాగలదు. నూత్న ఆంధ్రరాష్ట్రము ఎగువశాసనసభనిమిత్తము ధనము ఖర్చుచేయగలస్థితియందుండదు. ప్రస్తుత చెన్నరాష్ట్రఅసెంబ్లీలో ఈ ౧౩ జిల్లాలనుండి ఎన్నిక అయిన సభ్యులతో తాత్కాలికాంధ్రశాసనసభ ఏర్పాటుకాగలదు.

ప్రభుత్వసిబ్బందివిషయములోకూడా ఎలాంటి చిక్కులూ రానవసరములేదు. ఆంధ్రప్రభుత్వము క్రింద ఉండగోరు ఉద్యోగులందరికి క్రొత్తప్రభుత్వము కేంద్రప్రభుత్వము నిర్ణయించిన, రాజ్యాంగపరిషత్తు ఆమోదించిన నిబంధనల ననుసరించి రక్షణల నివ్వగలదు. అసలు ఆంధ్రప్రభుత్వము హెచ్చుపరిపాలనాఖర్చును భరింపలేదు. ఉమ్మడిగా నున్నందువలన చెన్నరాష్ట్రప్రభుత్వమునందు వివిధశాఖలుగ ఏర్పడి ప్రతిఒక్కశాఖకు ఒక కార్యదర్శి, అతనికి అవసరమైన సిబ్బంది ఉన్నది. ఆంధ్రరాష్ట్రమునకు అన్ని శాఖలు అవసరము లేదు. పరిపాలనాశాఖలను ఏడింటికి తగ్గించి, [illegible] మంత్రులతో పరిపాలనను సాగింపవలసియుండు

డును. అందుకు వీలుగా ప్రభుత్వశాఖలను కలిపివేయుట అవసరము. ఈవిధముగ ఉద్యోగుల కొరతను పరిష్కరింపవచ్చును.

ఇంక మిగిలిన ఒక్క సమస్య రాజధానీ, రాష్ట్రమునందు శాంతిభద్రతల రక్షణ. భారతప్రభుత్వ హోంశాఖాకార్యదర్శి ఈ రెంటినీ ఒకటిగనే సూచించెను. రాజధానిని నిర్ణయించుకొనునపుడు కమ్యూనిస్టు ప్రమాదమును మనస్సునం దుంచుకొనవలసిన యవసర మున్నదని ఆయన హెచ్చరించెను. కలకత్తాలో కమ్యూనిస్టుచర్యలు హెచ్చినందువలన పశ్చిమబెంగాల్ ప్రభుత్వము తన కార్యస్థానమును కలకత్తానుండి మార్చుకొని యుండలేదు. కమ్యూనిస్టుముప్పును నిర్మూలించుటకు ప్రభుత్వకార్యస్థానము అట్టి ప్రమాదము ఎక్కువగ నున్న ప్రాంతమునకు సమీపముగ నుండుట యవసరము. తాత్కాలికముగ ఆంధ్రరాజధాని మద్రాసునం దుండినను, నూతన రాజ్యాంగము ననుసరించి ఎన్నికలు జరిగిన అనంతరము పరిస్థితులు ఇదే విధముగ నుండునని భావించుటకు వీలు లేదు. హైదరాబాదు సంస్థానప్రజాభిమతమునుబట్టి పరిష్కారమైన హైదరాబాదే ఆంధ్రరాజధాని యగుట తథ్యము. అంతవరకైనను ఆంధ్రరాజధాని చెన్ననగరమునం దుండుట భాగ్యము.

అట్లు గాక చెన్నరాష్ట్రములో మిగిలిపోయిన ఇతర భాషాప్రాంతములవారందరు చేరి ఆంధ్రరాజధాని తక్షణము నిర్ణయము కావలెనని, ఆంధ్రప్రభుత్వము అచటనుండియే వ్యవహరింపవలసియుండునని, ఆ విషయమై మంత్రివర్గము నియమించు సంఘమున ఒడంబడిక కుదరక కేంద్రప్రభుత్వము జోక్యముకల్గించుకొని నిరాకరించిన అర్జీ చెల్లించుకొనుచు చెన్ననగరమును కనిపెట్టుకొనియుండుటకంటె హైదరాబాదువ్యవహారము పరిష్కారమగువరకు ప్రభుత్వకార్యస్థానమును విజయవాడయం దుంచుకొనుట శ్రేయస్కరము. ఇందువలన కొన్ని చిక్కులు ఉండవచ్చును. ప్రజలు, ప్రజాప్రతినిధులు, నాయకులు కూడ ప్రభుత్వకార్యస్థానము తమవద్దకు వచ్చినందున అనుక్షణము అధికారులపై వొత్తిడిచేసి పరిపాలనానిర్వహణ దుస్సాధ్యము చేయక నూతనరాష్ట్రము స్థిరపడుటకు ప్రయత్నింపవలసియుండును. ప్రతిఒక్కరు స్వార్థరహితముగ ప్రవర్తించిన గాని నూతనఆంధ్రరాష్ట్రము స్థిరపడదు. ఇప్పటివరకు ఆంధ్రలో ఏర్పడిన భిన్నవర్గములను ఏకము చేయుటకు ప్రయత్నములు జరుగలేదు. రాష్ట్రమున కాంగ్రెస్ ప్రతిష్ఠ దెబ్బతింటున్నది. పరిస్థితులు ఇదే విధంగా ఉంటే ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఎంతో కాలము ప్రజాస్వామిక 'రాజ్యము'గ నుండజాలదు. కమ్యూనిస్టుముప్పును నివారించుటకు కాంగ్రెస్‌లో ఐక్యత అత్యవసరము. రాష్ట్రకాంగ్రెస్ అధిష్ఠానవర్గము ఇందుకు మనస్ఫూర్తిగా ప్రయత్నించేయవలసి ఉంటుంది. ఇతరవర్గములవారు ఈ ప్రయత్నములు ఫలించునట్లు కాంగ్రెస్ అధిష్ఠానవర్గముతో సహకరింపవలసియుండును.

ఇప్పటికి ఆంధ్రనాయకులందరూ ఒకచోట చేరుట తటస్థించలేదు. విభజనకార్యక్రమము, రాష్ట్రనిర్మాణవ్యవహారములను అందరూ కలిసి విచారించుట అవసరము. ఆంధ్రమంత్రులకును, రాష్ట్రకాంగ్రెస్ సంఘమునకును ప్రస్తుతమున్న 'స్పర్థలు' పరిష్కారము కావలెను. కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకట్రావుగారు, రాష్ట్రపతి డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు, ప్రకాశంపంతులుగారు, ఆంధ్రకాంగ్రెసుఅధ్యక్షుడు ఆచార్యరంగాగారు తెనుగు మంత్రులతో అన్నివిషయములనూ చర్చించి విభజనవిషయములోనే కాక రాష్ట్రనిర్మాణము విషయములోనూ ఒక ఏర్పాటు చేయుట అవసరము. అన్నింటికంటె ముఖ్యము జనవరి ౨౬వ తేదీలోపున గవర్నరు జనరల్ ఉత్తరువు జారీఅగునట్లు చూడవలసియున్నది. ఇందుకైనా ఆంధ్రనాయకుల సమష్టిప్రయత్నము అవసరము.

నూతన రాజ్యాంగము అమలుజరగడానికి పూర్వం ఆంధ్రరాష్ట్రఉత్తరువు జారీకాకపోతే నూతనరాజ్యాంగాన్ని అనుసరించి ఆంధ్రరాష్ట్రము ఇంతలో ఏర్పడగలదనే ఆశ లేదు. రాజ్యాంగరచనాసంఘమువారు ఎప్పుడైతే ౨౯౦ సెక్షను ప్రకారము ఆంధ్రరాష్ట్రము ఏర్పాటుకావడం అవసరం అని సూచించినారో అప్పటినుంచీ ఇందునిమిత్తం జరిగిన ప్రయత్నాలన్నింటినీ పరిశీలిస్తే కాంగ్రెస్ కార్యవర్గము, కేంద్రప్రభుత్వము కూడా నూతనరాజ్యాంగం అమలుకువచ్చుటతోబాటు ఆంధ్రరాష్ట్రం అవతరించాలనే ఉద్దేశ్యంతోనే ఇంతవరకూ వ్యవహారం జరుపుతూవచ్చినారు. కాని ఆఖరుక్షణంలో కేంద్ర




నవంబరు ౨౬-వ తేదీన రాజ్యాంగపరిషత్తు స్వతంత్రభారత రిపబ్లిక్ రాజ్యాంగాన్ని ఆమోదించిన అనంతరం రాజ్యాంగచట్టపు ప్రతిపై పరిషత్తు అధ్యక్షుడు డాక్టర్ రాజేంద్రప్రసాద్ గారు సంతకం చేస్తున్నారు.

---

ప్రభుత్వవైఖరి ఎందుచేతనో కొద్దిగా మారినట్లు కన్పిస్తున్నది. చెన్నపట్నాన్ని కేంద్రప్రభుత్వ పరిపాలనకు లోబడిన నగరంగా చేయకతప్పదు. అలాంటప్పుడు తాత్కాలికంగా ఆంధ్రరాజధాని చెన్నపట్టణంలో ఉండడంగురించి స్వయంగా తీర్పు ఇవ్వడానికి బదులు ఈవిషయంలో ఆంధ్ర ఆంధ్రేతర నాయకులకు సమాధానము కుదురుట అవసరమని స్వీకరించెను. తమిళ నాయకులు మొన్నటివరకు, ఆంధ్రులు చెన్నపట్టణముపై తమ హక్కు వదులుకొనిన, ఎంతకాలమైనను వారు తమ ప్రభుత్వస్థానమును నగరమునందుంచుకొనవచ్చునని చెప్పిరి. ఇప్పుడు, అద్దె చెల్లించి నగరములోని ప్రభుత్వభవనములను ఎంతకాలమైనను ఉపయోగించుకొనవచ్చునని సూచింప నారంభించిరి. అద్దె చెల్లించి చెన్నపట్టణమునందుండుటకంటె ఆంధ్రులు తమ రాజధాని ఆంధ్రదేశముననే అందరికి వీలుగ నుండు పట్టణమున ఏర్పరచుకొనుట మంచిది.

ఈ ఒక్క విషయమున అంగీకారము కుదరనందున రాష్ట్రనిర్మాణము వాయిదాపడుట జరిగిన, ఇంతలో ఆంధ్రరాష్ట్రమేర్పడదని చెప్పవలెను. భారతగవర్నరుజనరల్ ఇటీవల పూరిలో ఉపన్యసించుచు భాషారాష్ట్రనిర్మాణసిద్ధాంతమును కాంగ్రెసు కేవలము ప్రచారంనిమిత్తం అంగీకరించియుండెనేగాని పరిపాలనాసౌలభ్యానికి కాదని ప్రకటించిరి. కేవలము ఆంధ్రరాష్ట్రాన్ని మాత్రమే నిర్మించుటకు కాంగ్రెస్ కార్యవర్గం తీర్మానించియున్నందువల్ల కర్నాటకులు ఆగ్రహావేశపరులైరి. కేంద్ర, రాష్ట్రశాసనసభలందు సభ్యులుగ నున్న కర్నాటకులు ౧౨ మంది తమ సభ్యత్వములకు రాజీనామా నిచ్చిరి. కేరళులుకూడా రాయబారములపై రాయబారములు నడుపుచున్నారు. ఇన్నింటివలన భాషారాష్ట్రనిర్మాణసమస్య మరింత క్లిష్టమై ఆంధ్రరాష్ట్రనిర్మాణము తిరిగి అడుగునపడిపోయెను. నూతన రాజ్యాంగమును అనుసరించి ప్రభుత్వము ఒకబిల్లు ప్రతిపాదించినను, అది ఒక్క ఆంధ్ర

రాష్ట్రమునకుమాత్రమే పరిమితమై యుండుట జరుగదు. భారతరాష్ట్రములను భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణమాత్రముల ననుసరించి పునర్నిర్మాణముచేయుట ఇంతలో సాధ్యమగునది గాదు. ఈ పరిస్థితులనన్నిటిని గమనించి ఏవిధముగనైనను ఆంధ్రరాష్ట్రఉత్తరవు జనవరి ౨౬ లోపున జారీయగునట్లు చూడవలసియున్నది.

ఈసందర్భమున ఆంధ్రప్రజలు గమనింపవలసిన ముఖ్యాంశము ఒకటి ఉన్నది. రాష్ట్రం ఎప్పుడు ఏర్పడుతుందో తెలియకపోయినా, అప్పుడే అనేకమంది రాజధాని తమ ఊర్లో ఏర్పడాలనీ, హైకోర్టు తమ పట్నంలో ఉండాలనీ తీర్మానాలు చేస్తున్నారు. ఇలాంటి తీర్మానాలవల్ల ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సుకరం కాదు. రాజధానివిషయంలో గాని, హైకోర్టువిషయంలో గాని వాదోపవాదాలను పెంచక రాష్ట్రం ఏర్పడినతరువాత, రాష్ట్రాభివృద్ధికి జరుగవలసిన పనులనుగురించి ఎక్కువగా విచారించడం అవసరం. ఆంధ్రులు ఎంతో త్యాగం చేయవలసిందిగా వుంది. రాష్ట్రంలో ఏర్పడవలసిన ప్రాజెక్టులు పూర్తిఅయి, రాష్ట్ర ఆర్థిక, పారిశ్రామిక స్థితి అభివృద్ధి కావాలంటే ఇప్పటికంటే ఎక్కువ పన్నులను చెల్లించ వలసిఉంటుంది. ప్రభుత్వఋణములకు విరివిగా డబ్బు ఇచ్చుకోవలసిఉంటుంది.

అయితే రాష్ట్రం ఏర్పడినతరువాత వచ్చే ప్రభుత్వము ప్రజల విశ్వాసాన్ని పూర్తిగా చూరగొని,

జాతీయ కార్యక్రమనిర్వహణకు వారిని ప్రోత్స గలిగినదిగా ఉండాలి. ప్రస్తుతం మన రాష్ట్ర స్థితులను గమనిస్తే ఆంధ్రలోనూ తూర్పు బ్, పశ్చిమబెంగాల్ పరిస్థితులు ఏర్పడేటట్లు న్నవి. అలా గాక మన అగ్రనాయకులు అం ప్రభుత్వయంత్రమును నడపుటకు పూనుకుంటే ంలో ఐక్యతా ఏర్పడుతుంది; రాష్ట్రము ంగా అభివృద్ధిచెందుతుంది.

ప్రత్యేకాంధ్రరాష్ట్రంలో కులవిద్వేషాలు, భిమానాలు పెచ్చుపెరిగిపోగల వనే భయము, దేహము ప్రబలంగా ఉంది. అలాంటిదే తటస్థిస్తే రంభంలోనే మనకు 'సె. ౯౩' పరిపాలన అనివార్య తుంది. ఆంధ్రులకు అది గౌరవప్రదము గాదు. ంటిపరిస్థితులు అనివార్యమనే భావముతోనే మన కులు కొందరు, సామాన్యప్రజలున్న రాష్ట్రము డకుండా ఉండడమే మేలు అని భావించుచుండిరి. అనుమానములను నివృత్తిచేయవలసిన బాధ్యత మన కులపైనే ఉన్నది. కొత్తమంత్రివర్గనిర్మాణము నే మన నాయకుల భవిష్యద్విధానము తెల్లమౌతుం ది. ఆరంభంలో ఒక్క పొరపాటు జరిగితే ఆ పాటువల్ల అసలు రాష్ట్రానికే ముప్పు వస్తుంది. ్యూనిస్టుముప్పు' కంటే ఈ ముప్పే రాష్ట్రాభి ద్ధికి తీవ్రప్రతిబంధకం కాగలదు.

## సూచన

గతమాసపు భారతిలో ప్రకటితమైన "తెలుగు నిఘంటువులు" అను నావ్యాసములో ఈక్రిందిమార్పులు పాఠకులు గమనింపగోరుదును. (౧) "వేంకటేశాంధ్రము" రచించిన గణపవరపు వేంకటకవి క్రీ. శ. ౧౪౬౦ ప్రాంతమువాడు కాడనియు, క్రీ. శ. ౧౬౫౦ ప్రాంతమువాడనియు ఒకరిద్దరు మిత్రులు వ్రాసిరి. స్వర్గీయ వంగూరిసుబ్బారావుగారి "శతకకవులచరిత్రము" నేను సూచించిన కాలమున కాధారము. అది సరి కానిచో "వేంకటేశాంధ్రము" తొలినిఘంటువు గాక మూడవ నిఘంటువుగా వచ్చును. (౨) ఆం మసంగ్రహమును, ఆంధ్రరత్నాకరమును రెండును పైడిపాటిలక్ష్మణకవిప్రణీతము లని వ్రాసితిని. ఇందు ండవది పైడిపాటి కవిలక్ష్మణుని ప్రణీతమనియు, క్ష్మణకవియు కవిలక్ష్మణుడు నొకటి కారనియు గహింపగోరుదును. (౩) సూర్యరాయనిఘంటువు అను రిక క్రింద మూడవ పేరాలో "రమారమి క్రీ. శ. ౧౭౦౦ ను వెలువడిన శిష్టకవుల నెందు ప్రామాణికులనుగా కొనలే" ని పడినది. అది అచ్చుతప్పు. క్రీ. శ. ౧౯౦౦ అని దువుకొనునది.

బులుసు వేంకటేశ్వర్లు.

# 'కవిబ్రహ్మ'నిర్గమనము

శ్రీ వానరసింహారావు

తెగిపడె తెన్గుపాట నినదించెడి కావవీణాతంత్రి; నె
వ్వగ నెద భారమై తెనుగుభారుదె; రసజ్ఞలోకముల్
పొగిలెను శోకవహ్ని; వలపుంగోటల క్షేత్రలక్ష్మి నె
మ్మొగము కళావిహీనమయి పో నీ కనుమోడ్పులో కవీ!

నీవు కళాతపస్వివని నీ తెలుగుల్ గౌరవించి సం
భావన సేయనెంచి రభిమానపురద్ధితోడ, నీ
వీవిధి నస్తమించితి; విదెంతటి దుర్దినమ్మొ; త్వ
ద్భావన బుల్కరింపవుగదా! [illegible]క రసప్రపంచముల్.

'జిలిబిలిబాలచంద్రు'ల నవ్వ వె[illegible] చిలుకు స్వేచ్ఛాకాంక్ష తెలిసితెలిసి
వీరశృంగారముల్ వెలయించు [illegible]దాల' అమృతవాగ్ఝరి నోలలాడియాడి
రససిద్ధహృదయనీరాజనంబైన [illegible]లోక' సౌందర్య మరసియరసి
'వీరభారత' మహావిప్లవాధ్వము[illegible]రుగాడి పులకల దేరితేరి
ఆంధ్రు లెప్పుడో నీమధురార్ద్ర[illegible]స - పరిణతిశ్రీకి జోహారు పలికినారు,
ఆంధ్రజాతీయకవి యిట్టు లస్తమి[illegible]ట మాటాడ దెట్లు?—కన్నులు చెమర్చె.

తెనుగుల్ నోచిన నోములెల్ల [illegible]గాంచె; త్వత్కావ్యశ్రీ
వనని ర్వాణవిశాలవీథుల వనిరా[illegible]మ్మలై విశ్వమో
హనకల్యాణవిలాసముల్ వెల[illegible]చ్ఛానందసౌందర్యభా
జనస్పష్టుల్ వికసించె హో కవి[illegible] నీకవిత్వమ్ములో.

తారమధ్యమతంత్రినాదములు ప[illegible]'కవిబ్రహ్మ' వదలిన మంజువీణ
'నేను మీటెద' నని ముందు [illegible]డు - కవి ఎవం డాతనికి నమస్కారశతము.

# 'కవిబ్రహ్మ' నిర్గమనము

శ్రీ వాసి[illegible] నరసింహారావు

తెగిపడె తెన్గుపాట నినదించెడి వే[illegible]ానవీణతంత్రి; నె
వ్వగ నెద భారమై తెనుగుభారతి[illegible]ందె; రసజ్ఞలోకముల్
పొగిలెను శోకవహ్ని; వలపుం[illegible]ోటల క్షేత్రలక్ష్మి నె
మ్మొగము కళావిహీనమయి పో[illegible] నీ కనుమోడ్పులో కవీ!

నీవు కళాతపస్వివని నీ తెలుగుల్[illegible] గౌరవించి సం
భావనసేయనెంచి రభిమానపురస[illegible]ద్ధితోడ, నీ
వీవిధి నస్తమించితి; విదెంతటి [illegible] దుర్దినమ్మొ; త్వ
ద్భావన బుల్కరింపవుగదా! ఇ[illegible]క రసప్రపంచముల్.

'జిలిబిలిబాలచంద్రు'ల నవ్వవె[illegible] చిలుకు స్వేచ్ఛాకాంత తెలిసితెలిసి
వీరశృంగారముల్ వెలయించు '[illegible]దాల' అమృతవాగ్ఝరి నోలలాడియాడి
రససిద్ధహృదయనీరాజనంబైన '[illegible]లోక' సౌందర్య మరసియరసి
'వీరభారత' మహావిప్లవాధ్వము[illegible]రుగాడి పులకల దేరితేరి
ఆంధ్రు లెప్పుడో నీమధురార్ద్ర[illegible]ు - పరిణతిశ్రీకి జోహారు పలికినారు,
ఆంధ్రజాతీయకవి యిట్టు లస్తమి[illegible]ట మాటాడు టెట్లు?—కన్నులు సెమర్చె.

తెనుగుల్ నోచిన నోములెల్ల ఫ[illegible] గాంచె; త్వత్కావ్యజీ
వననిర్వాణవిశాలవీథుల ననిరా[illegible]్మలై విశ్వమో
హనకల్యాణవిలాసముల్ వెల[illegible]్ఛానందసౌందర్యభా
జనస్పృష్టుల్ వికసించె పో కవివ[illegible] నీకవిత్వమ్ములోఁ.

తారషడ్జమతంత్రీనాదములు పలి[illegible]'కవిబ్రహ్మ' వదలిన మంజువీణ
'నేను మీటద' నని ముందు [illegible]డు - కవి ఎవం డాతనికి నమస్కారశతము.